# కె. ఎల్. నరసింహారావుగారి నాటకాలు - ఒక పరిశీలన

డా॥ ఏ. రాజేశ్వరి
M.A., Ph.D.

ప్రచురణ :
"గురుకృప"
హైదరాబాదు 1999

# కె. ఎల్. నరసింహారావుగారి నాటకాలు

# ఒక పరిశీలన

డా॥ ఏ. రా

M.A., Ph.D.

ప్రచురణ :

''గురుకృప''

హైదరాబాదు

1999

కే. ఎల్. నరసింహారావుగారి నాటకాలు ఒక పరిశీలన
K. L. Narasimha Rao Gari Natakalu Oka Pariseelana

ప్రథమ ముద్రణ

ప్రతులు : 1000

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంతో ప్రచురితం

వెల : రూ. 40-00

ప్రతులకు :

**డా. ఏ. రాజేశ్వరి**
H. No. 1-3-183-39/12/B/1/2
కవాడిగూడ,
హైదరాబాదు-80
ఫోన్ : 7530290

ముద్రణ :

**హైటెక్ ప్రింటర్స్**
1-1-566/సి, సెయింట్ క్జేవియర్ హై స్కూలు ఎదురుగా,
గాంధీనగర్, హైదరాబాదు-80.
ఫోన్ : 7671357.

ఈ గ్రంథము
వెలుగుచూడడానికి
చేయూతనిచ్చిన వదాన్యులు
మాన్యశ్రీ
H.J. దొర I.P.S.
D.G.P, Andhra Pradesh.
వీరికి
మా కృతజ్ఞతలు

# విషయసూచిక

ఆచార్య ఎస్వీ రామారావు,
ఎం.ఏ., పిహెచ్.డి.
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అభినందన

నేను హైస్కూలులో విద్యార్థిగా ఉన్నప్పుడే కె. ఎల్. నరసింహారావుగారి **'గెలుపు నీదే'** నాటకం చదివి ఆయన రచనలవైపు ఆకర్షింపబడ్డాను. ఆనాడే ఆయన గ్రామీణాభ్యుదయాన్ని ధ్యేయంగా పెట్టుకొని రచనలు చేశారు. తెలంగాణాలో సాహిత్య సాంస్కృతిక చైతన్యానికి ఎంతో కృషి చేశారు. వారినాటకాలపై ఈనాటికైనా విమర్శ గ్రంథం వెలువడటం ముదావహం.

చి. రాజేశ్వరి పట్టుదలతో ఎం. ఏ. పట్టం (ఎక్స్టర్నల్) సాధించింది. ఆమెలోని పరిశోధనాభిలాషను గమనించి కె. ఎల్. సాహిత్యాన్ని పరిశోధ నాంశంగా సూచించాను. మొక్కుబడిగా కాకుండా అభినివేశంతో వారి రచనలన్నీ సంపాదించి నరసింహారావుగారి ఆశీస్సులను కూడా పొంది ఈ సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించింది.

చిన్న వయసులోనే గృహిణిగా బాధ్యతలతో సతమతమవుతున్నా ఉన్నత విద్యను ఆర్జించి, సాహిత్యాభిమానంతో కృషి చేస్తున్న డాక్టర్ రాజేశ్వరిని అభినందిస్తున్నాను. ఆమెకు ప్రోత్సాహ సహకారాలు అందిస్తున్న మిత్రులు, సాహితీ రసజ్ఞులు డా. యజ్ఞరాములు గారికి నా శుభాకాంక్షలు.

సికింద్రాబాద్
తేది ౩-౩-౧౯౯౯ డా. ఎస్వీ రామారావు

కె. కుసుమాబాయి
ఎం.ఎ., పి.హెచ్.డి.
రీడర్, తెలుగు విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# ఆశీఃప్రశంస

'కావ్యేషు నాటకం రమ్యం' అని నాటకం సమస్త సాహిత్య ప్రక్రియల్లో ఉత్కృష్టమైనదిగా కీర్తించబడింది అలాగే పరిశోధన రంగంలో కూడ నాటక ప్రక్రియ విశిష్ట స్థానాన్ని ఆక్రమించింది. విశ్వవిద్యాలయాల్లో పరిశోధన నాటకేతరమైన అంశాలపై ఎక్కువగా జరుగుతున్నది. అందుకు కారణం తెలుగులో ప్రసిద్ధమైన నాటకాలుగాని, గొప్ప నాటక రచయితలుగాని అరుదుగా ఉండటమే నని భావించవచ్చు. ఇటువంటి పరిస్థితుల్లో శ్రీమతి ఎ. రాజేశ్వరి తన పరిశోధ నాంశంగా కె. యల్. నరసింహారావుగారి నాటకాలను గ్రహించి ఆమూలాగ్రంగా పరిశీలించి, విభజించి, విశ్లేషించి సిద్ధాంత వ్యాసంగా రూపొందించింది.

శ్రీ కె. యల్. నరసింహారావుగారు ఆధునికాంధ్ర నాటక రచయితలలో ఒక ప్రత్యేకమైన స్థానాన్ని అధిష్ఠించినవారు. మనోరంజనకంటె సంఘ సంస్కరణకు నాటకాలను ఎక్కువగా వినియోగించిన కందుకూరి, గురజాడ వంటి ఉత్తమ నాటక కర్తల వరుసలో నిలువదగినవారు. గాంధీగారి ఆశయాల కనుగుణంగా గ్రామీణాభివృద్ధికి కృషిచేసినవారు. గ్రామ వికాసానికి దోహదం చేసే నాటకాలను రచించి పామరుల హృదయాల్లో జ్ఞాన జ్యోతిని వెలిగించటానికి ప్రయత్నించిన వారు. పల్లెలు ప్రగతిపథంలో పయనించినపుడే దేశ పురోభివృద్ధిని సాధిస్తుందని నమ్మినవారు. అందుకే శ్రీ కె. యల్. నరసింహారావుగారు ఎక్కువగా తన ప్రతిభను సృజనాత్మక శక్తిని పల్లె ప్రజల్లో చైతన్యాన్ని తీసుకొని రావటానికి వినియోగించారు.

శ్రీమతి ఎ. రాజేశ్వరి ఆంధ్ర నాటక సాహిత్యం పుట్టు పూర్వోత్తరాలను పరిచయంచేసి, ఆంధ్రనాటక వికాసాన్ని సమీక్షించి తన సిద్ధాంత వ్యాసానికి తగిన నేపథ్యాన్ని ఏర్పాటుచేసుకొన్నది. శ్రీ కె. ఎల్. నరసింహారావుగారి జీవిత విశేషాలను పరిచయంచేసి ఆయన వ్యక్తిత్వాన్ని నిలువుటద్దంలో చూపించింది. ఆయన నాటకా లన్నిటినీ గ్రామీణ, సాంఘిక, హాస్య, బాలల, మనస్తత్వ నిరూపక, చారిత్రక నాటకాలుగా విభజించి ఆయా నాటకాల్లోని సందేశాన్ని, సాహితీ విలువలను, భాషా విశేషాలను సమ్యక్దృష్టితో వివేచించి సరళ సుందరంగా రచించిన డా. ఎ. రాజేశ్వరిని అభినందిస్తూ భగవంతుడామెకు సర్వదా ఆయురారోగ్యైశ్వర మేధాసంపత్తిని ప్రసాదించాలని కోరుతున్నాను.

# స్పందన

ఈ పరిశోధన గ్రంథం చదివాక - నా స్పందన ఏమిటో రెండు మాటలు వ్రాయమన్నారు - డాక్టర్ ఎ. యజ్ఞరాములుగారు.

నా స్పందన తెలపాలంటే దాదాపు ౬౦ ఏండ్ల వెనక్కు వెళ్లాలి.

౧౯౪౦-౪౪ సంవత్సరాల మధ్యకాలం. అప్పుడు నా వయస్సు ౧౬-౨౦ ఏండ్ల మధ్య. సూర్యాపేటలో మిడిల్ ప్యాసయ్యాను. ఇక అక్కడ పై చదువులు లేక జగ్గయ్యపేట హైస్కూల్లో చేరాను.

అది కమ్యూనిస్టు సాహిత్యం అతి ముమ్మరంగా వస్తున్నకాలం. హైస్కూల్లో కొందరు కమ్యూనిస్టు టీచర్లున్నారు. వారి ప్రోత్సాహంవల్ల నైతేనేం, నాకా సాహిత్యం రుచిగా కూడా వుండడంవల్ల నైతేనేం, బడిచదువులకన్నా ఎక్కువగా ఆ సాహిత్యాన్ని దాదాపు నిద్రాహారాలు మాని అమిత ఆసక్తితో చదివానంటే అతిశయోక్తి కాదు.

సాహిత్యం జనంలో కెళ్ళాలనేదీ, ఆ వెళ్లిన ప్రక్రియతో వ్యవస్థమారాలనేదీ కమ్యూనిస్టు సూత్రం అది కూడా నాకు నచ్చిన సూత్రమే.

ఆ సూత్రాన్ని అమలు జరిపే తపనతో ౧౯౪౪ లో నేను యస్. యల్.సి ప్యాసై ఇల్లు చేరాను. కాలేజీ చదువులకు ప్రయత్నించా, సాధ్యం కాలేదు. ఇక - సాహిత్య రచన సాగించడం, దాంతో వ్యవస్థ మారడం అర్జంటుగా జరగాలనేది నా తహతహ.

ఆ తహతహననుసరించే ''విప్లవశంఖం'' అనే నాటకాన్ని పూరించాను. దాన్ని ప్రదర్శించడానికే ''గ్రామ వెలుగు నాట్యమండలి''ని ౧౯౪౭ జనవరి ౧న యమ అర్జంటుగా ప్రారంభం చేశాను. అంతగా పై చదువుల అనుభవం లేని మా గ్రామ యువకులకే వి. ఆర్. కె. మూర్తి, యమ్.వి. భద్రం, యం. పుల్లేశ్వర్ ఇలా ఇంగ్లీషు పేర్లు తగిలించి - వారితో కలిసి అద్భుతంగా ప్రదర్శన ఇప్పించాను.

అందులోని ఇతి వృత్తం ఏమిటంటే - వ్యవసాయానికి కుదుర్చుకున్నా జీతగాణ్ణి - తన ఇంటి పనికి రాలేదని యజమాని కోప్పడ్డందుకు అతను తిరగబడి జీతం మానేసి పోతాడు.

ఈ తిరుగుబాటు ప్రభావం - తెల్ల వారేసరికి మా శివారుగ్రామం జగన్నాధపురంలో పడి - అక్కడి జీతగాళ్లుపనులు మానేశారని మా నాటకంలో 'జీతగాడు ' పాత్రవేసిన వ్యవసాయదారు స్వయంగా చెప్పాడు. నిజంగా అది జనం మీద సాహిత్యప్రభావమేకదా. ఆ మాట నాకెంత ఆనందంగా వుంటుంది! ఆనందమేకాదు - మరో సంఘటనకూడా జరిగింది అప్పడే. నిజానికి దాన్ని ఆనందమనే వీలు లేదు. కోపం, కసి అనాలి- అంతే.

అదేమిటంటే - ఆ నాటకంలో - ఇప్పటి సామాన్య ప్రజానీకానికి అర్థంకాకుండా ఆనాడు సంస్కృతంలో వ్రాసిన రామాయణం, భారతం, భగవద్గీతలాంటి గ్రంథాలను

కసి కసిగా దుయ్య బట్టాను. నిజానికి - ఆ గ్రంధాలను నేను చదివికాదు సుమా - అంతగా తిట్టింది. 'ప్రజాసాహిత్యం' కాని ఆ పురాణాలను కొందరు స్వార్థపరులు వ్రాయడమే ఇక నేరమైతే - మనం పనిగట్టుకొని చదవడం మరో నేరమనేంత అజ్ఞానంగా, పరమమూర్ఖంగా వున్నాయి. అప్పటివా వేడివేడి వీర విప్లవభావాలు. ఇంతకూ- ఇప్పుడు చెప్పొచ్చేదేమి టంటే అనాడు ఆగ్రంధాలు 'ప్రజాసాహిత్యం' కాదని అతిగా కోప్పడ్డ నేనే - ఈ నాడు చాలా వరకు నా నాటకాలను 'ప్రజాసాహిత్యం' పేరుతో చెలామణి అవుతూ చదువుకున్న పాఠకులకు చప్పున అర్థంకాని ''గ్రామీణ మండలికం''లో వ్రాశాను. అదీ అసలు విషయం.

మాండలికంలోనే వ్రాయడానికి బలమైన కారణం లేకపోలేదు. 1948 లో వ్రాసిన గెలుపునీదే నాటకంలో లింగన్న, పెంటన్న, సుబ్బన్న అనే మూడు గ్రామీణ 'యాస' గల పాత్రలను పెట్టాను.

ఆ పాత్రలను కీ.శే. తేరాల సూర్యనారాయణశర్మ, డాక్టర్ అలవాల వెంకయ్య, పెండ్యాల నీలకంఠరావు గార్లు ఎంత గొప్పగా నిర్వహించారంటే - ప్రేక్షకులు వారి రాక కోసం క్షణక్షణం ఎదురు చూసేవారు. ఆ పాత్రలు - దానికి తగ్గ వారి నటన, శైలి - పల్లె ప్రజలను విపరీతంగా ఆకట్టుకునేవి. అందుకే - ఇప్పటికీ నేనా పాత్రలను మరిచిపోలేక మాండలికంలో నాటకాలను వ్రాస్తున్నాను.

అయితే - ఈ నాటక ప్రదర్శనలను స్వయంగా చూడాలితప్ప - పుస్తకంగా చదవాలంటే మటుకు చాలా కష్టపడాలి. ఎంతో ఆసక్తి, ఓపిక, అవగాహన, మాండలికంపట్ల అభిరుచి, సానుభూతి మొదలైన గుణాలెన్నో వుంటే తప్ప సాధారణంగా చదివేపని ఎవరూ పెట్టుకోరు.

పైగుణాలు ఎన్నెన్నో వున్న శ్రీమతి రాజేశ్వరిగారు నా నాటకాలను ఓపికగా, క్షుణ్ణంగా చదివి- నా ఆలోచనాధారను పట్టుకున్నారంటే నా కెంతో ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ వుంది. ఎందుకంటే - 1948 నుంచి నా నాటకాలు పల్లెల్లో కొన్ని వేల ప్రదర్శనలు జరిగాయి. ఇప్పటికీ జరుగుతున్నాయి. లక్షలాది సామాన్య ప్రజలు చూశారు, చూస్తున్నారు. కాని - అసలు నేనేం వ్రాశానో, ఎందుకువ్రాశానో, ఎలా వ్రాశానో ''పాఠకులకు'' వివరంగా చెప్పిన విద్యాధికులు బహు తక్కువ.

ఆ పనిని శ్రీమతి రాజేశ్వరిగారు చాలా ముచ్చటగా నెరవేర్చారు. 50 ఏళ్ల నా రచనారంగంలో ఇదొక ముఖ్యఘట్టంగా భావించుకుంటున్నాను. ఆభావనను కలిగించిన రచయిత్రికి నా నమస్సులు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

**కె. యల్. నరసింహారావు**

24-12-98.

# కృతజ్ఞతలు

శ్రీ కె. ఎల్. నరసింహారావుగారి నాటకాలపై పరిశోధనకు అనుమతించిన ఉస్మానియా విశ్వవిద్యాలయానికీ..............తెలుగు శాఖాధ్యక్షులు (అప్పటి) ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారికీ..................

నాపై విశ్వాసంతో పరిశోధనాంశాన్ని సూచించి, ఎప్పటికప్పుడు వివరాలడిగి తెల్సుకుంటూ వెన్నుతట్టిప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య ఎస్వీ రామారావుగారికీ...................

అమూల్యమైన సమయాన్ని నాకోసం కేటాయించి, ఈ థీసిస్ సకాలంలో పూర్తిచేయటానికి సంపూర్ణ సహకారాన్ని అందించిన మార్గదర్శకులు గౌరవనీయురాలు డా. కె. కుసుమాబాయి గారికీ.............

పరిశోధనా సమయంలో భావనాపరంపరకు ఎలాంటి ఆటంకం కలుగకుండా, దయతో మా ఇంటికి వచ్చి అవసరమైన గ్రంథాలనూ, విలువైన సలహాలను అందించి, పరిశోధనను ఎప్పటికప్పుడు సమీక్షించిన శ్రీ కె. ఎల్. గారికీ................

శిలను శిల్పంచేసే ప్రయత్నంలో నాలోని అమాయకత్వాన్ని సహనంగా, కుతూహలాన్ని జిజ్ఞాసగా మారుస్తూ, నాచేత ఈ పరిశోధనను చేయించిన నా జీవన సహచరుడు డా. యజ్ఞ రాములుగారికీ మనసా శిరసా.......... ధన్యవాదాలర్పిస్తున్నాను.

డా. ఏ. రాజేశ్వరి

# ప్రవేశిక

నిజాం ప్రభుత్వం యొక్క నిరంకుశత్వపు కోరలనుండి విముక్తమైన తెలంగాణాన్ని ప్రభావితం చేయటానికీ, నిస్తేజమైన అక్కడి ప్రజల జీవన విధానంలోనూ, వారి ఆలోచనా విధానంలోనూ మార్పు తీసుకురావటానికి ఎందరో మహానుభావులు తీవ్రమైన కృషి చేశారు. 'నా తెలంగాణ కోటిరత్నాలవీణ' అన్నారు దాశరథి. తెలుగు భారతి కంఠసీమలో తన మహోన్నతమైన రచనలతో వెలలేని రత్నహారాలను అలంకరించారు. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డా. సి. నారాయణరెడ్డి. తెలంగాణా ప్రాంతానికి చెందిన వీరిద్దరే గాక, ఎందరోకవులు, నాటక కర్తలు, గాయకులు తమ జీవితం కృషిగా, బానిసభావం జీర్ణించుకుపోయిన తెలంగాణా ప్రాంతపుప్రజలలో చైతన్యాన్ని నింపటానికీ, స్ఫూర్తిని పంచటానికీ నిరంతరం శ్రమించేవారని ఆనాటి తెలుగుసాహిత్యం వల్ల తెలుస్తుంది.

వారి బాటలోనే సాగిన శ్రీ నరసింహరావుగారు తన జీవితాన్ని, రచనావ్యాసాంగాన్ని, తన ఆలోచనావిధానాన్ని తెలంగాణా గ్రామీణ ప్రజా పునరుద్ధరణ కోసం వినియోగించి ధన్యులవుతున్న మహనీయులు. పల్లె ప్రాంతాలలో మూగజీవాలకూ, బానిసజీవితాలకూ తేడా చూపి, గ్రామీణప్రజలలో మానసిక చైతన్యాన్ని నింపిన తేజోమూర్తులు. వీరు సాహిత్యంలో ఏ ప్రక్రియ చేపట్టినప్పటికీ అందులోని ఇతివృత్తం, కథానాయకుడు, భాష, అన్నీ గ్రామీణప్రాంతానికి చెందినవిగానే వాడుకోవటం వీరి సంప్రదాయం.

దాదాపు అర్ధ శతాబ్దికిపైగా నాటక (వివిధ రూపకాలన్నీ నేడు 'నాటక'మనే పేరుతో పిలవడం వ్యవహారంలో ప్రసిద్ధమైంది.) రచనే తన జీవితధ్యేయంగా గ్రామీణుల పునర్వికాసమే తన లక్ష్యంగా స్వీకరించి అందులో సఫలీకృతులయిన నరసింహారావుగారు బహుముఖ ప్రజ్ఞావంతులు. వీరు ఒక్కనాటకరచయితగానేగాక, నటులుగా, దర్శకులుగా, ఆర్గనైజరుగా, జర్నలిస్ట్‌గా, రేడియో. టి.వి. కళాకారులుగా అకాడమీ సభ్యులుగా గ్రామీణజనజీవనవికాసానికి ఎనలేని కృషి చేశారు.

భారతదేశంలో నూటికి ఎనభైశాతంనివసించే గ్రామీణ ప్రజల కోసం, వారి చైతన్యం కోసం మారుమూల పల్లె ప్రాంతాలవారు ఉపయోగించే భాషనే తన సాహిత్యంలోప్రయోగించి, వారి యాసలోనే, అక్కడి ప్రజానీకం తోనే తన నాటకాలను ప్రదర్శించి చీకట్లు ముసిరిన గ్రామీణుల జీవితాల్లో

చిరుకాంతులను వెలిగించారు. సమాజంలోనివసించే ప్రతివ్యక్తీ సమాజాభ్యుదయానికి తప్పక కృషి చేయాలని విశ్వసించేవీరు తన సాహిత్యం ద్వారా గ్రామీణ ప్రజాభిమానాన్ని అద్భుతంగా చూరగొన్నారు. తన జీవితకాలాన్నంతా గ్రామీణుల కోసమే వినియోగిస్తున్న త్యాగధనులు.

నిరక్షరాస్యులయిన పల్లె ప్రాంతాలలోని ప్రజలకు మానవ హక్కులు, మనరాజ్యాంగం సులువుగా అర్థమయ్యేలా తన నాటకాలలో విశదీకరించిన నరసింహారావుగారు, ముఖ్యంగా గ్రామాలపునరుద్ధరణకోసం ప్రభుత్వం ప్రణాళికలద్వారా రూపొందించే విలువైన పథకాలు, ఎన్నో సౌకర్యాలు అక్కడి ప్రజలకు వివరించేవారు. తాత్కాలిక ఉద్యమాల మోజుతో వక్రమార్గాన్ని ఎన్నుకొని తమ జీవితాలను ఛిన్నాభిన్నం చేసుకున్న యువతరాగ్నిమేలుకొల్పటానికీ, వారిని ఆ మార్గంలోనుండి తప్పించటానికీ నరసింహారావుగారు చేసిన అక్షరయజ్ఞమే నా ఈ పి.హెచ్.డి సిద్ధాంత వ్యాసానికి ఆధారభూమిక. తన ప్రతిరచనా గ్రామీణజీవన విధానంలో నవ్యతను నింపాలని కోరుతూ, ఒక్కొక్క నాటకాన్నీ ఒక్కొక్క ప్రత్యేక గ్రామీణ సమస్యపై రచించి, అక్కడి గ్రామీణుల చేతే ప్రదర్శింపచేసి ఎంతోమంది అమాయకులకు కనువిప్పు కలిగించారు.

నరసింహారావుగారి ప్రచురిత నాటకాలనే నా పి.హెచ్.డి సిద్ధాంత వ్యాసానికి పరిశోధనాంశంగా ఎన్నుకోవటానికి కారణం, ప్రదర్శనా సౌలభ్యమే పరమావధిగా రచించిన వీరి అముద్రిత నాటకాలు లెక్కకుమిక్కిలిగా వున్నందునా, ఇప్పుడవి అలభ్యాలయినందున కూడా.

మొదటిభాగంలో నరసింహారావు గారి జన్మస్థానం, వారి జననీజనకులు, వీరికి మార్గదర్శకులైన శ్రీకోదాటి నారాయణరావు గారి ప్రేరణ, నరసింహారావు విద్యాభ్యాసం, వారి నాటకరచనకు ముందు తెలంగాణా ప్రాంతీయనేపథ్యం. మొట్టమొదటిరచన వెలుగులోనికి రావటానికి గల ముఖ్యమైన కారణాలు, వీరి ఇతర రచనలు. రేపాలలో వీరు నెలకొల్పిన గ్రామవెలుగు నాట్యమండలి, గ్రామీణ ప్రాంతాలకు చేస్తున్న కళారాధనా సేవలను స్పష్టం చేయటం జరిగింది. స్వగ్రామంలో వీరు చేపట్టిన ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలను వివరించాను.

ఇందులో రెండవ భాగంలో తెలుగు సాహిత్యంలో నాటకావిర్భావాన్నీ, అంతకు పూర్వకవులైన సంస్కృతనాటక కర్తలను వారి ప్రసిద్ధ నాటకాలను చర్చించి, తెలుగునాటకం వికాసదశకు చేరుకున్న విధానాన్ని తెలియచేయటం జరిగింది. ఇంకా తెలుగునాటకసాహిత్య వికాసాన్ని, అందుకు

దోహదం చేసిన ప్రముఖుల ప్రసిద్ధమైన నాటకాలనూ, సంస్కృత నాటకాలకు రచించిన తెలుగు అనువాద నాటకాలనూ, ఆంగ్లానువాద నాటకాలను, తెలుగుసాహిత్యంలో మొట్టమొదటి నాటకావిర్భావసమయసందర్భాల్ని స్పృశించి, రచయిత నాటకరంగంవైపు ఆకర్షితులవటాన్ని వివరించాను.

'నరసింహారావుగారి నాటకాలు' అనే మూడవ విభాగంలో ఆయన నాటకాలన్నింటినీ విషయ వైవిధ్యాన్నిబట్టి 7 ఉప భాగాలుగా విభజించాను. అవి: 1. సాంఘిక నాటకాలు, 2. గ్రామీణ నాటకాలు, 3. బాలల నాటకాలు, 4. హాస్యనాటకాలు, 5. మనస్తత్వ నిరూపక నాటకాలు, 6. చారిత్రక నాటకం, 7. రేడియోనాటకాలు.

సాంఘికనాటక విభాగంలో సంఘసంస్కరణే లక్ష్యంగా భావించేవాడైన రచయిత సంఘంచేత తానుప్రభావితుడై సంఘాన్ని ప్రభావితం చేయగల సాహిత్యాన్ని సృష్టిస్తాడనీ, వీరి సాంఘిక నాటకాలు నిరూపిస్తున్నాయి. తెలుగునాటకసాహిత్య వికాసదశకు చెందే వీరి నాటకాలనే గాక, ఆ కాలంలోని ప్రముఖుల సుప్రసిద్ధసాంఘికనాటకాలను పరిచయం చేయటం జరిగింది.

గ్రామీణనాటకవిభాగంలో గ్రామీణుల జీవనవిధానాన్ని, వారి సమస్యలను, అలవాట్లను, తరతరాలుగా కామందులచే అణగద్రొక్కబడుతున్న వారి బాధామయమైన జీవితాలనే వీరు తన నాటకరచనకు స్వీకరించిన విధానాన్నీ, స్వభావవాదానికి చెందే వీరిగ్రామీణ నాటకాలు ప్రదర్శనారీత్యా కూడా విజయవంతమైనవి కావటానికీ, వీరు అధికశాతం గ్రామీణ ప్రాంతాలకే ప్రాధాన్యత నిచ్చి, మాండలిక యాసలోనే ఎక్కువగా నాటకరచన చేయటానికీ గల కారణాలను విపులీకరించాను.

బాలలనాటికా విభాగంలో పిల్లలకోసం వీరు రచించిన బాలనాటక సాహిత్యంలోని ఇతివృత్తాలనూ, పాత్రపోషణనూ ప్రస్తావించాను. బాలల నాటకానికి నరసింహారావుగారిచే రచించబడిన బాలనాటకలక్షణాలను కూడా ఇందులో పొందుపరచాను. బాలసాహిత్యవికాసానికి దోహదం చేసిన ప్రముఖులను, వారివారి బాలల నాటకాలను వివరించటమేగాక, బాలల నాటక సాహిత్యం అనే ప్రక్రియకు శ్రీకారంచుట్టిన చింతాదీక్షితులుగారినీ, న్యాపతి కామేశ్వరిగారినీ, న్యాపతి రాఘవగారినీ, వీరి ప్రసిద్ధమైన బాలల నాటకాలనూ పరిచయం చేశాను.

హాస్యనాటక విభాగంలో ప్రప్రథమ హాస్యరూపకోద్భవాన్నీ ప్రపంచసాహిత్యంలోని హాస్యనాటక క్రమ పరిణామాన్నీ వివరించి, తెలుగుసాహిత్యంలో హాస్యనాటక ఆరంభకాలాదులను ప్రముఖ రచయితల హాస్యనాటకాలను ప్రస్తావించాను. నరసింహారావుగారి హాస్యనాటకాల్లోని ఇతివృత్తాలను, వీరి ముగింపునీ, ఆ నాటకాలు ప్రదర్శించిన సమయసందర్భాల్నీ తెలియచేయటం జరిగింది. చారిత్రక నాటకవిభాగానికి చెందే వీరి ఏకైక చారిత్రక నాటకం 'అక్బర్'ను వ్యక్తిచిత్రణ ప్రధానమైన రూపకంగా మలచిన విధానాన్ని, ఇంత వరకూ తెలుగునాటకసాహిత్యంలోగల చారిత్రకనాటకాల ప్రత్యేకతనూ వివరించటమేకాక, ఈ అక్బర్ నాటకాన్ని జాతీయసమైక్యత సాహిత్యానికి చెందేవిధంగా విశ్లేషించటం జరిగింది.

వీరి మనస్తత్వనాటక విభాగాన్ని గురించి, చర్చిస్తూ భౌతిక సమస్యలనేగాక, మానసిక విశ్లేషణను తెలుగునాటకరచనలో ప్రారంభించిన ప్రముఖుల మనోవిశ్లేషణాత్మక నాటకాలను స్పృశించి, వీరి క్రీనీడలు, ఒకరోజు నాటకాలు స్త్రీపాత్రపైదుష్ప్రాన్ని చాటేవేగాక, మానసిక విశ్లేషణాత్మకంగా ఎలా రచింపబడ్డాయో వివరించాను.

నరసింహరావు రేడియోనాటకాలను ఐదు భాగాలుగా విభజించాను. అవి.

1. వెంగళప్ప కబుర్లు
2. వయోజన విద్య
3. ప్రాథమిక విద్యా కార్యక్రమాలు
4. ముచ్చట్లు
5. అందరికీ చదువు

వీరి ఈ కార్యక్రమాలు, ఆకాశవాణి శ్రోతలకు చిరకాలం గుర్తుండి పోయే హాస్య, అమాయక చక్రవర్తి వెంగళప్పపాత్రను వీరు అత్యద్భుతంగామలచి, పోషించిన విధానాన్ని, ప్రతిశ్రోతఇష్టపడే వీరి ముచ్చట్లు కార్యక్రమాన్ని, పాఠశాల విద్యార్థుల కోసం, పాఠశాలల్లోనే పిల్లలు నేర్చుకోవలసిన ఎన్నో అంశాలను వీరు రేడియోలో రూపొందించిన ప్రాథమికవిద్యా కార్యక్రమాలనూ, గ్రామాల్లో అందరికీ చదువు ఉండవలసిన ఆవశ్యకతను, వయోజనవిద్యకోసం ప్రభుత్వం

ప్రసారిత సమయాలనూ తేదీలవారీగా తెలియజేయటం జరిగింది.

ఇక వీరి నాటకసాహిత్యంలో ప్రయుక్తమైన భాషను ఆధారం చేసుకుని ప్రత్యేకమైనఅధ్యాయాన్ని కేటాయించాను. వీరు ప్రయోగించిన భాషలోని అన్యదేశాలనూ, గ్రామీణభాషను మాండలికానికి సంబంధించిన విశేషపదాల పుట్టుకనూ స్థూలంగా చర్చించి వీరి ప్రతినాటకంలోనూ విధిగా ఉపయోగించబడిన ఊతపదాలనూ, గ్రామీణజీవితాలకే పరిమితమైన పలుకుబడులనూ సామెతలనూ, జాతీయాలనూ వివరించాను.

రచయితతో ముఖాముఖీ విభాగంలో అర్ధశతాబ్దికి పైగా తెలంగాణా ప్రాంతంలో జరిగిన ఎన్నో సంఘటనలకు సాక్షీభూతమైన తన మనస్సులోని భావాలనూ, అనుభవాల దొంతరలనూ నరసింహారావుగారు వివరించిన విధానాన్ని, వారి నాటకరచనా జీవితానికి ప్రేరణనిచ్చిన ఎన్నో సంఘటనలనూ ఇందులో పొందుపరిచాను.

# కె. యల్. నరసింహారావుగారి

# జీవిత విశేషాలు

శ్రీ కోదాటి వెంకట నరసింహారావు, శ్రీమతి వెంకటరామ నరసమ్మ దంపతులకు 23-10-1924వ సంవత్సరంలో శ్రీకోదాటి లక్ష్మీనరసింహారావు గారు జన్మించారు. నల్గొండ జిల్లా మునగాల మండలంలోని రేపాల వీరి స్వగ్రామం. అక్కడే తమ ప్రాథమిక విద్య పూర్తి చేసుకున్న నరసింహారావుగారు ఉర్దూ కోసం సూర్యాపేటలోని మిడిల్‌స్కూల్ లోనూ, జగ్గయ్యపేటలో హైస్కూలులోనూ స్కూలు చదువు ముగించారు.

కె. యల్. నరసింహారావుగారు చదువుకునే రోజుల్లోనే కమ్యూనిస్ట్ సాహిత్యాన్ని బాగా చదివేవారు. సాహిత్యాన్ని ప్రజలలోకి తీసుకురావటం కమ్యూనిస్టుల ముఖ్యోద్దేశ్యం. తద్వారా ప్రజలను చైతన్యవంతులను చేయటం, ఆర్థికంగా అసమానతలులేని సమాజాన్ని నెలకొల్పటం, దోపిడీ వ్యవస్థను రూపుమాపటం, నిరాడంబరంగా, నిజాయితీగా జీవించటం, సామాన్యప్రజలలో ఉంటూ, వారి అవసరాలను, ఆశయాలనుగమనిస్తూ, వాటిని నెరవేర్చటానికి ప్రయత్నించటం ఇవన్నీ కమ్యూనిస్ట్‌సాహిత్యం ద్వారా వీరు ఆకళింపు చేసుకున్న సూత్రాలు. ఇంత చక్కని సూత్రాలతోకూడిన సాహిత్యాన్ని అందించిన ఆనాటి కమ్యూనిస్ట్‌వాదులకు వేరే ఏ సాహిత్యం చదివినా గిట్టేదికాదు. వారి దృష్టితో ఇతర సాహిత్యం పరమచెత్త, నిషిద్ధం. మన ప్రాచీన సాహిత్యం, రామాయణం, భారతం, ప్రబంధాలేగాక, ఆనాడు వెలువడే ఏ ఇతర పత్రికలైనా వీరికి చదవకూడని సాహిత్యంగానే ఉండేది.

పోతే నరసింహారావుగారు కమ్యూనిస్టుల రచనల్ని ఎంత ఉత్సాహంగా చదివినా, వారికి నిషిద్ధమైన ఇతర ఆధునిక పత్రికలను కూడా చాటుగా చదివేవారు. అన్ని కోణాలనుండీ, వార్తలనూ, ప్రజాజీవితాన్నీ అవగాహన చేసుకునేవారు. ఈ విధంగా విభిన్నసాహిత్యదృక్పథాల భావబీజాలు చదువుకునే రోజుల్లోనే నరసింహారావుగారి మనస్సులో నాటబడ్డాయి. ఆ బీజాలే మహావృక్షాలై రానురాను ఆయనరచనల్లోనూ, జీవితంలోనూ, సామాజిక కార్యకలాపాల్లోనూ ప్రస్ఫుటమయినాయి. వీరి స్వగ్రామమైన రేపాలలోని లైబ్రరీకి దాదాపు ఎనభైదాకా అన్నిరకాల పత్రికలనూ తెప్పించేవారు.

ఇలా చదువుకునే రోజుల్లోనే కమ్యూనిస్ట్ భావాలకు ఆకర్షితులయిన నరసింహారావుగారు 'విప్లవశంఖం' అనే నాటకం వ్రాశారు. ఇందులో ప్రాచీన సాహిత్యాన్ని కసిగా తిట్టిపోశారు. భారత దేశజనాభాలో సగానికిమించి గ్రామాల్లో నివసించే మామూలు ప్రజలకు అర్థంగాలేని సంస్కృత కావ్యాలనూ, గ్రాంథిక వాదాన్ని వీరు దుయ్యబట్టారు. అంతేకాక రేపాలలోని 'శ్రీలక్ష్మీ నరసింహస్వామి కల్యాణోత్సవాలకు' జోడిస్తూ, 1958 నుండే 'వైజ్ఞానిక మహాసభలు - ప్రదర్శనలు' పేరుతో ఎన్నోకార్యక్రమాలు మొదలుపెట్టారు. ఆరోజుల్లో విద్యార్థులను ఈ కార్యక్రమాలు బాగా ఆకర్షించాయి. ఈ సభలలో అన్ని రంగాలలోని ప్రముఖులను ఆహ్వానించి, వారితో ఉపన్యాసాలను ఇప్పించి, గ్రామీణులను చైతన్యవంతం చేయటం నరసింహారావుగారి ముఖ్యోద్దేశ్యం. ఈ కార్యక్రమాలను విజయవంతం చేయటంలో వీరు కృతకృత్యులయినారు.

1946లో మిత్రుల సహకారంతో తమ గ్రామంలో ఒక నాట్యకళామండలి నెలకొల్పారు. ఆ మండలి పేరు తమ ఇష్టపూర్తిగా 'గ్రామ వెలుగునాట్యమండలి' అని పెట్టారు. నిజానికి 'గ్రామ' సంస్కృత పదం 'వెలుగు' తెలుగుపదం. ఆ రెంటికీ సమాసం కలవదని తెలిసినా తన స్థిరలక్ష్యాన్ని నరసింహారావుగారు ఆపేరుతోనే సూచించారు. భావాల ప్రభావమేగానీ గ్రాంథిక భాష, ఛందస్సులంటే వీరికట్టేగిట్టదు. కారణం చదువుకునే రోజుల్లోనే వీటిపైగల అశ్రద్ధ. ప్రజాచైతన్యం మీద అమిత శ్రద్ధ. సమాజంలో మనిషి ఏపని చేసినా తోటి మనుషుల కుపయోగపడాలని వీరి ప్రగాఢవాంఛ. ఆ వాంఛాపరి పూర్తికోసం 'విప్లవశంఖం' అంతగా చదువులు లేని తమ ఊరి నటవర్గంతోనే ప్రదర్శింపచేసి విజయవంతం చేశారు. ఈ నాటకంలో వీరూ నటించారు.

తమ హైస్కూలు చదువు పూర్తిచేసుకుని వచ్చిన నరసింహారావుగారు తమ స్వగ్రామంలోనూ, చుట్టుప్రక్క పల్లెల్లోనూ పేరుకుపోయిన నిరాశానిస్పృహలను, దుర్భరదరిద్రాన్నీ, వాటినధిగ మించలేని గ్రామీణుల నిరక్షరాస్యతను చూసి చాలా స్పందించారు. ఆ రోజులలో నిజాంపై పోలీస్‌చర్య ఇంకాజరగలేదు. కానీ అప్పటికే కాంగ్రెస్‌వారూ, కమ్యూనిస్ట్‌పార్టీవారూ నిజాంకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్నారు. పోతే కమ్యూనిస్ట్‌ల పోరాటం మాత్రం విశేషించి, వర్గపోరాటంగా, వికృత పోరాటంగా పరిణమించింది. తమ సిద్ధాంతాలను నమ్మని వారిని హత మారుస్తూ, అలా చంపబడ్డ వాళ్ళంతా భూస్వాములనీ, బూర్జువాలనీ, అభివృద్ధి నిరోధకులనీ, వర్గశత్రువులనీ, ముద్రవేసేవారు. మామూలు ప్రజలను నమ్మించటానికి తమ పత్రికలలో వారిని గూర్చి, చిలువలు పలువలుగా వ్రాసే వాళ్ళు.

అలా హత్యకుగురియైన వారిలో శ్రీయుతులు ఆరె సత్యనారాయణ, కొలు రఘుసత్యనారాయణలు గాక, నరసింహారావు గారి తాతగారి (తల్లిగారి పినతండ్రి)ని దారుణంగా హింసించారు. వీరి తాతగారైన కొండపల్లి రామ చంద్రరావుగారిని హింసించేవారని వినగానే కడుపులో మంట బయలుదేరింది. అలాగే మరికొద్ది రోజుల్లోనే ఆ గ్రామాలలోని అమాయకస్త్రీలను, వయోవృద్ధులను అతి దారుణంగా చంపేశారు. ఇలా సుపరిచితులైన వారూ, అమాయక మహిళలూ సమసిపోతుంటే రేపాలలోని ప్రజలు భయభ్రాంతులై ఆత్మవిశ్వాసాన్ని కోలుపోయారు. హత్యలకు గురయిన వారంతా అమాయకులే గాక, సమాజానికి అంతో ఇంతో మేలుచేసే వారేగాని కీడుతలపెట్టని సహృదయులు. ఇలా మంచివారెందరో తెలంగాణా సాయుధపోరాటం పేరుతో బలయిపోతుంటే, నరసింహారావుగారిలో అంతర్మథనం మొదలయింది. అప్పటివరకూ వారు చదివిన కమ్యూనిస్ట్‌సాహిత్యానికీ, చాటుగా చదివిన ఇతరసాహిత్యానికీ తీవ్రమైన ఘర్షణ ప్రారంభమయింది.

మహోన్నతమైన సిద్ధాంతాలతో, అసామాన్యమైన లక్ష్యసాధనతో, దృఢదీక్షతో, ప్రవర్తనతో, హేతుబద్ధమైన తర్కబలంతో జనాన్ని చైతన్యవంతులను చేయగలవాడే నిజమైన కమ్యూనిస్ట్. ఆ కమ్యూనిస్ట్ 'మనీషి' ఎవరినీ హత్యాకాండకు గురిచేయడు. కానీ అదే పేరుతో రోజురోజుకూ ఎన్నో ఘోరాలు జరిగేవి. ఆ స్థితిలో కళ్ళముందు జరుగుతున్న వాస్తవాన్ని సమర్థించాలో, చదువుకున్న సిద్ధాంతాలను సమర్థించాలో తెలియక నరసింహారావు ఎంతో మధనపడ్డారు.

ఆ ఘర్షణలో చివరికి మనస్సే నెగ్గింది. దాని ఫలితమే 'గెలుపునీదే' నాటకరచన. ఆ నాటకంలో సాయుధపోరాటం పేరుతో జరుగుతున్న మారణహోమాన్ని తీవ్రంగా ఆక్షేపించారు. సంఘానికి పనిగట్టుకుని హింసను నేర్పితే అదెక్కడికి దారితీస్తుందో సునిశితంగా చెప్పారు. మనసులో రగులుతున్న వారి తీవ్ర ఆందోళనను ఒకటి రెండు రోజులలోనే నాటక రూపంగా వెలువరించారు. జనతాకళామండలి ద్వారా ప్రదర్శింపబడిన ఈ నాటకం తెలంగాణాలో ఎంతో ప్రసిద్ధి పొందింది. నేటి వరకూ ఈ ఒక్క నాటికే వందలాది ప్రదర్శనలు పొందింది. తెలంగాణాలో పోలీస్‌చర్య అనంతరం హైదరాబాద్‌లోని ప్రతాపగిర్జికోఠీలో స్టేట్‌కాంగ్రెస్ మహాసభ జరిగింది. ఆ సభలలో గెలుపునీదే నాటకం ప్రప్రథమంగా 1948 డిసెంబర్ రెండవ తేదీన ప్రదర్శింపబడింది.

ఒకసారి వరంగల్ సినిమాహాలులో ఇచ్చిన ఈ నాటక ప్రదర్శనను తిలకించిన అప్పటి విద్యాశాఖామంత్రి 'శ్రీరాజాధోండేరాజ్ బహద్దూర్' గారు ఈ నాటక ప్రదర్శన ప్రభుత్వపక్షాన నిర్వహించటానికి వెంటనే నిర్ణయం తీసుకున్నారు.

అలా మొదలయిన వీరి గ్రామీణ నాటకరచనా వ్యాసంగం ప్రభుత్వమూ, ప్రజలూపట్టించుకోని మారుమూలపల్లెల్లోని ఎన్నో సమస్యలను విశ్లేషించింది. ప్రత్యేకించి గ్రామప్రాంతాల్లో వీరి నాటకాలు అపరిష్కృత సమస్యలకు కొంత వివరణాత్మకంగానూ, మరికొంత పరిష్కార మార్గసూచ్యంగానూ ఎంతో ప్రసిద్ధికెక్కాయి. తమ పరిసర ప్రాంతాలలోని రైతుల చేతా, ఇతర గ్రామీణులచేతా నరసింహారావు తననాటకాలలోని పాత్రలు వేయించేవారు. అప్పటి నిజాం ప్రభుత్వపు కోరల నుండి బైటపడిన తెలంగాణారైతు వీరి నాటకంలో ఒక కొత్త ప్రపంచాన్ని చూస్తున్నట్టుగా అనుభూతి చెందేవాడు. గ్రామీణ ప్రజలకు, నిరక్షరాస్యులకు ప్రజాస్వామ్యాన్ని తమ వైపు నుండి పరికించడానికి వీరి నాటకాలు ఎంతో ఉపకరించాయి. ఆ రోజులలో తమకు తెలియని ఎన్నో క్రొత్త సంగతులు, గ్రామీణ సమస్యలు. ఉమ్మడి సౌకర్యాలూ నాటకంగా తెరపైచూసిన గ్రామప్రజల్లో చైతన్యవాహిని ఉరకలెత్తేది.

గెలుపునీదే నాటకంగురించి నరసింహారావుగారు ప్రస్తావిస్తూ పోరాటంలో చనిపోయినవారు మృతవీరులయినప్పుడు వారివల్ల నిర్దాక్షిణ్యంగా చంపబడిన నిరపరాధులు అల్పప్రాణులయినాకాకపోరనీ, ఆ మృతవీరులకు ప్రపంచమంతా జోహార్లర్పించినప్పుడు హత్యకావించబడిన ప్రాణాలకు ఒకకన్నీటి బొట్టు రాల్చటం అధర్మమయితే ఈ లోకంలో జరిగే నిజమైన అన్యాయాలు సిగ్గుపడతాయనీ భావించారు. కేవలం నాటక సాహిత్యమే గాక, వీరి ఇతర రచనలు కూడా ఎంతో ప్రసిద్ధి పొందాయి. వీరి ప్రసారిత రేడియో నాటకాలలో 'వెంగళప్పకబుర్లు' ఇప్పటివరకూ బాలానందంలో ప్రసారమై, పిల్లలను, పెద్దలనూ ఆనందపరుస్తోంది. లేఖాసాహిత్యంలో అప్పటి పత్రికలలో (తెలుగు స్వతంత్ర) లో వచ్చిన వీరి 'తెలంగాణా తీరుతెన్నులు' ఎన్నో వారాలు పాఠకుల నుర్రూత లూగించాయి. అవి తెలంగాణా ప్రాంతాలకే కలికితురాయి. కోలన్, బురఖా, భవభీయుడు, పరాశర మొదలైన ఎన్నో పేర్లతో తమ భావవాహినిని పత్రికలలో ప్రవహింపచేసేవారు.

నాటకరచనే తమ జీవిత ధ్యేయంగా ఎంచుకుని, అందులోనూ ప్రతి నాటకంలోనూ సమస్యాప్రాధాన్యత గల ఇతివృత్తాలతో, స్వభావవాదానికి

ఊపిరిపోయటంలో యాభై సంవత్సరాలుగా ప్రయాసపడుతున్న నరసింహారావు గారు తన ప్రయత్నంలో సఫలీకృతులైనారు. బహుముఖప్రజ్ఞావంతులైన వీరు ఒక నాటకరచనే గాక, నటనలోనూ, దర్శకత్వంలోనూ, ఆర్గనైజర్‌గానూ, రేడియో, టి.వి.కళాకారులుగానూ, అకాడమీ సభ్యులుగానూ ఎంతో కృషి చేసారు. స్వతంత్ర భారతదేశాన్ని త్వరితంగా అభివృద్ధి చేయటానికి ప్రతి పౌరుడూ కృషి చేయాలని ఆయన ప్రగాఢవాంఛ, ఆ కృషిని ప్రజల మనసుల్లో ఆవిష్క రించటానికి 'నాటకమే' అతి శక్తివంతమైన సాధనమని నరసింహారావుగారి దృఢాభిప్రాయం.

# ఆంధ్ర నాటక సాహిత్య వికాసం

"'క్రీడనాయకమిచ్ఛామో దృశ్యం. శ్రవ్యంచయద్భవేత్.''

మనస్సును రంజింపచేయటానికి కంటికింపైనదీ, వినసొంపైనదీ ఏదైనా ఒక క్రీడా విశేషాన్ని తమకు అనుగ్రహించ వలసిందని దేవతలు బ్రహ్మదేవుని అర్థించగా, దానికి అంగీకరించిన సృష్టికర్త ఋగ్వేదం నుండి సాహిత్యాన్ని యజుర్వేదం నుండి అభినయాన్ని, సామవేదం నుండి గానాన్ని, అధర్వణ వేదంలోని రసాన్ని గ్రహించి నాట్యమనే ఐదవ వేదాన్ని సృష్టించాడు. నాట్యసారాన్ని ఉపాసించిన భరతముని తనసంతానంతోనూ, అప్సరసలతోనూ నాట్యాన్ని ఆనాటి 'ఇంద్రధ్వజోత్సవం' లో ప్రదర్శింపచేశాడు.

ఐతే ఈ నాట్యంలోని వస్తువు దేవతలు దానవులను జయించటం. అదిచూసి కోపోద్రిక్తులైన రాక్షసులు బ్రహ్మదేవుని ఆక్షేపించారు. అందుకాయన రాక్షసులను శాంతపరుస్తూ, నాట్యం లోకంలోని రకరకాల భావాలకు నిలయం. అందులో ధర్మాన్ని ఆచరించేవారికి ధర్మం, కాముకులకు కామం, దుష్టులకు నిగ్రహం, సజ్జనులకు దమం, అజ్ఞానులకు జ్ఞానం, దుఃఖితులకు శాంతి కలుగుతాయని ఆయా పాత్రారోపణలవల్ల జనానికి ఆనందోపయోగాలను కల్గించటానికి మాత్రమే తానునాట్యాన్ని సృష్టించాననీ నిర్వచించి, లోకుల స్వభావాలను అనుసరించి హితాన్ని, సుఖ వినోదాలనూ నాట్యం కలిగిస్తుంది; మీరు బాధపడరాదని వారిని సమాధానపరుస్తాడు. ఇది నాట్యోత్పత్తికి సంబంధించి మన ప్రాచీన గ్రంథాలలో కనిపించే అంశం.

నాట్యమంటే అవస్థానుకరణం. అవస్థ ఒకవ్యక్తి ఒకానొక పరిస్థితిలో అనుభవించే అనుభూతి. ఆ వ్యక్తి యొక్క మానసిక, శారీరక పరిస్థితి 'నాట్యం' ద్వారా అభివ్యక్తీకరించబడుతుంది. నటుడు తాను అనుకరించేవ్యక్తి యొక్క స్థితిగతులను, వేషాలంకారాలను తనకు ఆరోపించుకుని తానే ఆవ్యక్తిననే భావాన్ని ప్రేక్షకులకు తననాట్యం ద్వారా కల్పిస్తాడు. సత్యభామ మనకళ్ళఎదుట లేకపోయినా, ఆ పాత్రాభినయం చేసే నటి సత్యభామ యొక్క వేషాన్ని, ఆమె అనుభూతులనూ తనకు ఆరోపించుకుని తానే సత్యభామగా మనల్ని అలరిస్తుంది. నటుడు తాననుసరించే వ్యక్తి భావాలనే గాక, తన ప్రదర్శన ద్వారా నానా దృశ్యాలనూ కల్పించి, ప్రేక్షకుల మనసులలో వివిధ రసానుభవాలను పండిస్తాడు. లోకంలో జరిగే సంఘటనలకు ఏయే వ్యక్తుల ప్రవర్తన ఆధారమో ఆ వ్యక్తుల

రూపాలను నటులు తమకు ఆరోపించుకుని నటిస్తారు కాబట్టి నాట్యం ఆరోపణమై, రూపమై, రూపకంగా సాహిత్యంలో స్థిరపడింది. ఈ రూపకంలో పదిరకాలున్నాయి. అవి: నాటకం, ప్రకరణం, భాణం, ప్రహసనం, డిమం, వ్యాయోగం, సమవకారం, వీథి, అంకం, ఈహామృగం.

ఇవి రూపక భేదాలు. దశవిధరూపకాలలో ముఖ్యమైన నాటకానికి పద్దెనిమిది ఉపరూపకాలున్నాయి. అవి: నాటకం, త్రోటకం, గోష్ఠి, సట్టకం, నాట్యరాసకం, సంతాపకం, శ్రీగదితం, శిల్పకం, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణి, హల్లీసకం, భాణిక అనేవి.

నృత్తనృత్యాలను బట్టి రూపకాలకూ, ఉపరూపకాలకూ ముఖ్య భేదాన్ని నిర్ణయించవచ్చు. ఆచార్య హేమచంద్రుడు తన కావ్యానుశాసనంలో ఈ భేదాలను గుర్తించి, సవిస్తరంగా చర్చించాడు. రూపకం రసాత్మకమైందనీ అది నాట్యభేదంతో కూడినదనీ, ఉపరూపకాలు భావాత్మకాలు అనీ అవి నృత్యభేదంతో కూడినవనీ నిర్ధారించాడు.

## రూపక ప్రాచీనత:-

"[1]సంస్కృతభాషలో తొలిగ్రంథమైన ఋగ్వేదంలో సంవాదసూక్తులు కనిపిస్తాయి." [2]నాటకానికి ప్రాణభూతమైన సంభాషణ విధానం తొలిసారిగా ఈ సూక్తుల్లో కనిపిస్తుంది. యమయమీసంవాదం,
ఊర్వశీపురూరవసంవాదం, ఇంద్రనేమిసంవాదం మొదలైనవి ఉదాహరణగా చెప్పవచ్చు.

క్రీ.పూ. ఐదవశతాబ్ది వాడైన 'పాణిని' తన సూత్రాల్లో నట్, నృత్ ధాతువులను నాట్యపరంగా ప్రయోగించాడు. ఇతని కాలంనాటికే నాట్యకళపరిణతిని పొందిందడానికి ఇది నిదర్శనం. మహాభాష్యకర్త పతంజలి (క్రీ.పూ. 150వ.సం.) కాలంనాటికి నాట్యకళ సర్వతోముఖాభివృద్ధిని సాధించింది. పతంజలి తన మహాభాష్యంలోకంసవధ, బలిబంధనం అనే నాట్యరూపాలను పేర్కొన్నాడు.

ఆదికావ్యమైన వాల్మీకి రామాయణంలో కూడా నట, నర్తక, శబ్దాలతో పాటు నాటక సమాజాలు కూడా పేర్కొనబడ్డాయి.

శ్లో.. "[1]నారాజకే జనపదే ప్రభూతనటనర్తకాః
ఉత్సవాశ్చ సమాజశ్చ వర్ధంతే రాష్ట్రవర్ధనాః".[3]

దీన్నిబట్టి రామాయణకాలంనాటికే నాట్యకళ వృత్తివిద్యగా రూపొందిది, నటకుటుంబాలు, స్త్రీ ప్రధాన నటసంఘాలు ఏర్పడి ఉన్నట్లు తెలుస్తున్నది.

## సంస్కృత రూపకాలు

మనకు లభించిన ప్రప్రథమ సంస్కృతరూపకం అశ్వ ఘోషుని 'శారిపుత్ర' అనే ప్రకరణం. అశ్వఘోషుడు క్రీ.పూ. ప్రథమ శతాబ్ద యందలివాడు. బుద్ధుడు శారిపుత్ర, మౌద్గల్యాయనులకు ధర్మదీక్ష ప్రదానం చేయుటం ఇందులోని ఇతివృత్తం. ఈ రూపకంవల్ల క్రీ.పూ. ప్రథమశతాబ్దినాటికే సంస్కృతంలో రూపకరచన విరివిగా జరిగిందని చెప్పటానికి ఆస్కారం లభించింది.

## భాసుడు

ఇతను సంస్కృతంలో బహురూపకాలను రచించిన ప్రముఖ నాటకకర్త. ఇతని కాలం క్రీ.పూ. 475 నుండి 370 వరకు భాసునినాటకాన్ని గుదిగ్రుచ్చి 'భాసనాటకచక్రం' అనేపేరుతో శ్రీ.పి.గణపతిశాస్త్రిగారు పదమూడు నాటకాలను ప్రకటించారు. అవి దూతవాక్యం, కర్ణభారం, దూత ఘటోత్కచం, ఊరుభంగం, మధ్యమ వ్యాయోగం, పాంచరాత్రం, అభిషేకం, బాలచరితం, అవిమారకం, ప్రతిమ, ప్రతిజ్ఞాయౌ గంధరాయణం, స్వప్నవాసవదత్తం, చారుదత్తం. కాళిదాసాది మహాకవులచేత ఉత్తమరూపకకర్తగా ప్రశంసలు అందుకున్న భాసుడు సంస్కృత నాటకకర్తలకు ఆద్యుడు.

### కాళిదాసు

ఇతడు క్రీ.శ. నాల్గవ శతాబ్దివాడని బహుళప్రచారంలో ఉంది. సా లూ నాటకాలూ ఎందరో సాహిత్యవేత్తలమన్ననలంది ఖండాంతర కీర్తిని ఆర్జించాయి. విక్రమోర్వశీయం, మాలవికాగ్నిమిత్రం, అభిజ్ఞాన శాకుంతలం మొదలైన నాటకాలు నేటికీ ఎంతో ప్రజాదరణను పొందుతున్నాయి.

భాసకాళిదాసులేగాక, సంస్కృత నాటకకర్తలలో ఖ్యాతిగాంచిన శూద్రకుడు, శ్రీహర్షుడు, విశాఖదత్తుడు, భట్టనారాయణుడు, భవభూతి, మురారి, రాజశేఖరుడు, మొదలైన వారంతా చక్కని రచనా పటిమతోనూ, భావస్ఫోరకమైన సంభాషణలతోనూ ప్రదర్శనా యోగ్యంగా ఎన్నో నాటకాలను

రచించి కృతకృత్యు లయినవారు. సంస్కృతభాషలో చాలాచోట్ల వాడబడిన రూపకశబ్దం నాటకశబ్దానికి పర్యాయపదం. దృశ్యశ్రవ్యాలుగా విభజింపడిన కావ్యభేదంలో 'నటాభినీయమానమైన' నాటకమే నాట్యం అనబడుతుంది. నాటకం అనేపదం సర్వదృశ్యకావ్యాలకూ పర్యాయపదంగా ఆలంకారికులచేత ప్రయోగించబడింది. భరతుడు తననాట్యశాస్త్రంలో నాటక శబ్దాన్ని రూపక సామాన్య వాచిగా ప్రయోగించాడు.

తెలుగులో మొట్టమొదటి రూపకలక్షణాలను రచించిన చిత్రకవి పెద్దన తన 'లక్షణసారసంగ్రహం'లో నాటక శబ్దాన్ని దృశ్యకావ్యాలన్నిటికీ వర్తించేట్టుగా వాడాడు. ప్రకరణ నాటకం, వ్యాయోగనాటకం. మొదలైనవి అందుకు ఉదాహరణలు. కాబట్టి నాట్య, నాటక, రూప, రూపకపదాలు, పర్యాయ పదాలేగానీ వేరుగాదని స్పష్టమ వుతున్నది.

అదికూ నన్నయకు ముందు తెలుగుభాషకు స్థిరమైనరూపంగానీ, కావ్యరచన చేయటానికి సరిపడే ఛందస్సు గానీ లేదనటం అతిశయోక్తిగాదు. అప్పట్లో ఆంధ్రవాఙ్మయం శాసనాల్లోనేగాని కావ్య ముఖంగాలేదు. గాసటబీస టగానున్న ఆంధ్రభాషకు స్థిరమైన రూపం కల్పిస్తూనే సంస్కృతభారతాన్ని తెనిగించిన ధీశాలి నన్నయ. ఆ బాటలోనే తిక్కన, ఎర్రనలూ ఆ ఇతిహాసాన్ని ఆంధ్రీకరించారు. వీరి తరువాత ప్రసిద్ధులైన పూర్వాంధ్రకవులందరూ ఇతర పురాణాలను తెనిగించారు. ఆ కాలంలోనివే ఐన నన్నెచోడుని కుమారసంభవం వంటి కొన్ని స్వతంత్రకావ్యాలు ఒకటి రెండున్నా, ఆంధ్రీకృతాలైన కావ్యాలతో పోలిస్తే అవి చాలాస్వల్పమే. స్థూలంగా నన్నయనుండి ఎర్రన యుగాంతరం వరకూ ఉన్న ఆంధ్రవాఙ్మయమంతా పురాణపరివర్తనమేగాని స్వతంత్ర రచనలు గావు.

ఇక సంస్కృతవాఙ్మయాన్ని స్థూలంగా విభజిస్తే, పురాణాలు, కావ్యాలు, నాటకాలు అనేమూడువిభాగాలు కన్పిస్తాయి. కావ్యాలు వర్ణనా ప్రధాన మయినవి. పురాణాలు వివిధ విషయాలతో కూడినవి. నాటకాలు ప్రధా నంగా రసాశ్రయాలు. పురాణాలనూ, కావ్యాలనూ అనువదించిన తర్వాత క్రమపరిణామంలో నాటకాంధ్రీకరణం మీదికి కూడా కవులు తమ దృష్టిసారించారు. శ్రీనాథయుగంలో' కవులు ప్రసిద్ధమయిన సంస్కృత నాటకాలను ఆంధ్రీకరించారు కానీ వాటినినాటకాలుగా కాక కావ్యాలుగానే అనువదించారు. కాళిదాసమహాకవి అభిజ్ఞాన శాకుంతలాన్ని, పిల్లలమర్రి పినవీరభద్రకవి శృంగార శాకుంతల కావ్యంగా అనువదించాడు. కృష్ణమిశ్రుని

ప్రభోద చంద్రోదయాన్ని, నందిమల్లయ, గంటసింగనలు కూడా ప్రబోధ చంద్రోదయం అనే కావ్యంగానే అనువదించారు. రాజశేఖరుని విద్ధసాలభంజికనుమంచన కేయూరబాహు చరిత్ర కావ్యంగా అనువదించాడు.

ఐతే పురాణాలనూ, కావ్యాలనూ తెలుగులోకి అనువదించి నప్పడు వాటి ఆకృతిలో ఎలాంటి మార్పు లేకుండానే వ్రాసిన పూర్వాంధ్ర కవులు నాటకాల అనువాదానికి వచ్చేటప్పటికి, వాటినియథాతథంగా అనువదించక ప్రబంధాలుగా మాత్రమే వ్రాశారు. దానికి ముఖ్య మయినకారణం – ప్రాచీనకాలంలోకవులను, కవిత్వాన్ని పోషించిన వారు రాజులు, చక్రవర్తులు. ఎందువల్లనోవారికి నాట్యంతప్ప నాటకాలు ప్రీతిపాత్రం కాలేకపోయాయి. పద్యకావ్యపఠనంపై ఉన్న మోజు నాటకసాహిత్యం మీదగానీ, నాటక ప్రదర్శనలపైగానీ ఉన్నట్టు కన్పించదు. అందుచేతనే రాజులకిష్టమయిన శృంగారభూయిష్ఠమైన కావ్యాలనేగానీ, నాటకరచనను పూర్వకవులు రచించలేదు. అప్పట్లో వ్రాయబడిన కొద్ది సంస్కృతనాటకాలు కూడా రాజాస్థానాలకూ, పండితసభలకు మాత్రమే పరిమితమైనాయి. సామాన్యులకూ, పామరులకూ వాటిపరిచయమే లేదు. ఈ విధంగా నాటకంసామాన్య ప్రజలకు ఆకాలంలో దూరమైంది. పైగా నాటక ప్రదర్శనలకు కావలసిన నాటకశాలలుగానీ, రంగపరికరాలుగానీ ఎక్కడా లభ్యమయ్యేవిగావు.

సంస్కృతసాహిత్యంలో సమగ్రమైన నాటకరచనలు సాగినందువల్లనే వాటిని వివరించే లక్షణగ్రంథాలు ఎన్నో వచ్చాయి. ఐతే సంస్కృతనాటకాలను కావ్యాలుగా అనువదించటం వల్లా, ఆంధ్రంలో నాటకాలు లేనందువల్లా పదహారవశతాబ్ది వరకు కూడా తెలుగులో నాటకలక్షణాలను వివరించే గ్రంథమే లేదు. పదహారవశతాబ్దిలోని చిత్రకవి పెద్దన మాత్రం 'లక్షణసారసంగ్రహము' అనే తన లక్షణగ్రంథంలో నాటకలక్షణాల్ని వివరించాడు. స్మృతులు, వేదాలూ, నటగాయకులను పంక్తిదూరులుగా పరిగణిస్తున్నప్పడు నాటకాలను ప్రదర్శించటానికి నటులు ఎవరూ ముందుకురాలేక పోయేవారు. నాటక ప్రదర్శనకు అవసరమైన నటులు ముందుకు రానప్పడు, నాటకాలను రచించి ప్రయోజనం లేకపోవటం చేత కవులు కూడా ఆ కాలంలో నాటకరచనకు ఉత్సాహం చూపలేదు. అయితే దేవుడి ఉత్సవాల్లోనూ, వేడుకల్లోనూ నాటక ప్రదర్శన జరిగినట్టు ప్రాచీనకావ్యాల్లో కొన్నిచోట్ల ప్రస్తావించటం జరిగింది గానీ, ఆ ప్రదర్శనలు అన్నీ యక్షగానంవంటి జానపద కళారూపాలేగానీ సంస్కృతాంధ్ర నాటక ప్రదర్శనలు మాత్రం కావు.

ఇక చారిత్రకంగా నాటక పరిణామక్రమాన్ని పరిశీలిస్తే, ఆంధ్రనాటక సాహిత్యవికాసం క్రీస్తుశకానికి ముందే జరిగిందని హాలశాతవాహనుని గాథాసప్తశతినిబట్టి తెలుస్తుంది. హాలునికి ముందే ఆంధ్రదేశంలో నృత్య, సంగీత, నాటక, వాద్యాలు ప్రచారంలో ఉన్నాయని గాథాసప్తశతిలోని కొన్ని ఉదాహరణలను బట్టి తెలుస్తుంది.

'' మద్దెలవలెఖలుడుబోనము అమరిన అంతవరకు మధురముగా పలుకును. అమరనిచో వెంటనేవిరసముగా పలుకును.

పూచినజనుపచేను హరితాళమండితముఖముతో పేరసెడి నటివలె అందగించుచున్నది.

మదననాటకమునకు నిబిడోపగూహనము పూర్వరంగ మైంది''.[4] హాలచక్రవర్తి క్రీ.శ. ప్రథమ శతాబ్ధికి చెందిన వాడని పరిశోధకుల నిర్ణయం. పై ఉదాహరణలని బట్టి చూస్తే, ఆంధ్రదేశంలో నాటకసాహిత్యం క్రీ.శ. ప్రారంభంనాటికే ఉందని తెలుస్తుంది. గాథాసప్తశతితోపాటు పేర్కొనవలసిన గ్రంథం భరతుని నాట్యశాస్త్రము. ఇది క్రీ.శ. ప్రారంభకాలానికి సంబంధించిన గ్రంథమని విమర్శకుల అభిప్రాయం. ఆ కాలంలోనే భారతదేశంలో సుస్థిరమైన నాట్యవ్యవస్థ నెలకొన్న రాష్ట్రాల్లో ఆంధ్రరాష్ట్రమొకటని నాట్యశాస్త్రాన్నిబట్టి తెలుస్తోంది. నాట్యశాస్త్రంలో ఆంధ్రుల ప్రసక్తి కన్పిస్తుంది. '' పదిహేడవ అధ్యాయంలో ఆంధ్రి అనే విభాష ఆదేశవాసులకు నాట్యమందు ఉపయుక్తమని చెప్పబడింది. 28వ అధ్యాయంలో మధ్యమ గ్రామాశ్రయములగు పదకొండు జాతులలోఆంధ్రి ఒక జాతిగా పేర్కొనబడింది.''[5] దీన్ని బట్టి క్రీ.శ. ఆరంభంనాటికే ఆంధ్రులు లలితకళల విషయంలో ఎంతో అభివృద్ధి సాధించారని స్పష్టమవుతుంది.

చాళుక్యరాజులు వేదాల్లాంటి పవిత్ర విద్యలనేగాక. లౌకిక విద్యలను కూడా ఆదరించి ప్రోత్సహించారు. గుణగవిజయాదిత్యుడు ''గాంధర్వ విద్యా ప్రవీణ'' బిరుదాంకితుడు. ఇతడు సౌందర్యపరాజిత దేవాంగనమైన చెల్లవ్వకు అత్తిలి గ్రామంలో కొంతభూమిని దానం చేశాడు. ఈమె పట్టవర్ధనీ కులసంజాత. నట్టువరాంద్రనే కలువలకు చంద్రకాంతిగా ఈమె వర్ణితమైంది. వేంగీరాజ్యపాలకుడు 'కవిగాయక కల్పతరు' బిరుదాంకితుడు అయిన రెండవ అమ్మరాజు క్రీ.శ. 945-75 కాలం నాటి వాడు. తన ప్రియురాలూ, జైనశ్రావకి అయిన చామెకాంబ ప్రోత్సాహంతో నృత్యకళయందాసక్తి కల్గినవాడై. నాట్యాభివృద్ధికి ఆ కాలంలో ఎంతో తోడ్పడ్డాడు. తెలుగుభాషలో వ్రాయబడిన మొదటి గ్రంథం నన్నయభారతం. రాజరాజ నన్నయతో ఉదాత్తరసాన్విత

కావ్యనాటక క్రమములు పెక్కుసూచితి అంటాడు. ఇందులో ఆయన 'చూచిన' నాటకాలు తెలుగుభాషలో ఉన్నా లేకపోయినా, చూచిన అనే క్రియకు ప్రదర్శనమనే అర్థాన్ని చెప్పకుంటే ఆనాటికే నాటకప్రక్రియ తెలుగుదేశంలో వృద్ధిపొందిందని చెప్పక తప్పదు. ఇంకా నన్నెచోడుని కుమారసంభవంలోనూ, పాల్కురికి సోమనాథుని బసవపురాణం లోనూ నాట్య, నాటక ప్రశంసలున్నాయి.

కాకతీయులుకూడా లలితకళల్లో నృత్యాన్ని విగ్రహశిల్పాన్నీ ఎక్కువగా ఆదరించారు. కాకతీయ చక్రవర్తులందరిలో శ్రేష్ఠుడైన గణపతిదేవచక్రవర్తి నాట్యకళనెంతో ఆదరించాడనీ జాయపసేనాని నృత్తరత్నావళి అనే శాస్త్రగ్రంథం ద్వారా తెలుస్తుంది. రామప్పగుడిలోని నృత్యశిల్పాలు కాకతీయుల నృత్యకళా భిమానానికి పరాకాష్ఠ. రెండవప్రతాపరుద్రుని కాలంలోని విద్యానాథుడు 'ప్రతాపరుద్ర యశోభూషణ' మనే ఉత్తమలక్షణగ్రంథాన్ని రచించాడు. తాను చెప్పిన నాటకలక్షణాలకు అనుపుగా 'ప్రతాపరుద్రకల్యాణము' అనే సమగ్రాంగమైన నాటకాన్ని వ్రాశాడు.

భారతాన్ని నాటకీయ శిల్పంగా తెనిగించిన తిక్కన తనరచనలో నాట్యసంబంధాలైన పదాలను విశిష్టంగా వాడాడు. 'నాట్యశాల', 'నాట్యమందిరం,' నృత్తశాల, నర్తనాగారము, నర్తనమండపము, నర్తనశాల, అనే పదాలను విరివిగా ప్రయోగించటాన్ని బట్టి నాటకసాహిత్యవికాసం, ఆకాలంలో ఎంతో అభివృద్ధి పొందిందని చెప్పవచ్చును.

రెడ్డి రాజులకాలంలో ప్రసిద్ధుడయిన శ్రీనాథుడు నాట్య, నృత్త, పదాలనెక్కువగా తనరచనలలో వాడాడు. కాశీఖండంలో శివపూజాసమయంలో జరిగే నృత్యంచక్కగా అభివర్ణించబడింది. జక్కనకూడా విక్రమార్కచరిత్రలో రంభ, ఊర్వశుల నాట్యాన్ని విపులంగా వర్ణించాడు. ఊర్వశీ నృత్యాన్ని గూర్చి ప్రత్యేకంగా వర్ణించాడు. రాచకొండ ప్రభువైన రెండవసింగభూపాలుడు 'రసార్ణవసుధాకరము' అనే లక్షణగ్రంథంలో సంగీత, నృత్య, నాట్యలక్షణాలను ప్రస్తావించాడు. అమృతానందయోగి రూపకలక్షణాలున్న 'అలంకారసంగ్రహం' అనే గ్రంథాన్ని రచించాడు. రెడ్డి రాజుల్లో పేరెన్నికగన్న కుమారగిరిరెడ్డి ''వసంతరాజీయం' అనే నాట్యశాస్త్రాన్ని రచించాడు. కాటయవేముడు దీనికే 'కుమారగిరి రాజీయము' అనే పేరుతో వ్యాఖ్యానాన్ని రచించాడు.

ఇక తెలుగులో రూపకలక్షణాలను ప్రత్యేకించి చెప్పిన చిత్రకవి పెద్దన 'తన లక్షణసార సంగ్రహం' లో నాటకలక్షణాలను గురించి వివరించాడు.

'నందకరాజ్యము' అనే స్వతంత్ర నాటకాన్ని కూడా రచించారు. పోతే ఈ నాటకాలేవీ ప్రదర్శనా భాగ్యాన్ని పొందలేదు.

1880 లో నవయుగవైతాళికుడయిన శ్రీకందుకూరి వీరేశలింగంగారి ప్రవేశంతో తెలుగు నాటకరంగంలో అపూర్వమైన మార్పులు చోటుచేసుకున్నాయి. 1880 లో వీరు 'వ్యవహారధర్మబోధిని' అనే ఒక ప్రహసనాన్ని రచించి విజయనగరం మహారాజావారి బాలికోన్నత పాఠశాలలో విద్యార్థుల చేత ప్రదర్శింపచేశారు. నాటకరంగంలో అపూర్వమైన ఈ సంఘటన తెలుగునాటకాన్ని తొలిసారిగా రంగస్థలం మీద ఎక్కించింది. తాము రచించే నాటకాలను ప్రదర్శించటానికి ఒక నాటక సమాజం కూడా పంతులుగారే ప్రప్రథమంగా స్థాపించారు. ఎన్నో నూతనసాహిత్య ప్రక్రియలకు ఆద్యులైన పంతులుగారు సుమారు పదహారు నాటకాలను రచించారు. ఇందులో సంస్కృత రూపకానువాదాలు, ఆంగ్లాను వాదాలు, పౌరాణికాలు, ప్రహసనాలూ ఉన్నాయి. శ్రీహర్షుని రత్నావళికీ, కాళిదాసు శాకున్తలానికీ పంతులుగారు చేసిన అనువాదాలు ఇప్పటికీ రసజ్ఞులచేత ప్రశంసింపబడుతున్నాయి. పంతులుగారి శాకుంతలాను వాదం నూరేళ్ళు బతికిన నాటకం. 'షేక్స్పియర్' కామెడీ ఆఫ్ ఎర్రర్‌ను పంతులుగారు 'చమత్కార రత్నావళి' గా అనువదించారు. గురజాడ శ్రీరామమూర్తిగారుకూడా 'మర్చంట్ ఆఫ్ వెనిస్' నాటకాన్ని 'వెనిసువణిజ' నాటకంగా అనువదించారు.

రాజమహేంద్రంలో నాటకోద్యమానికి ప్రాణప్రతిష్ఠ చేసినవారిలో శ్రీవడ్డాది సుబ్బరాయుడుగారు ప్రసిద్ధులు. వీరి వేణీసంహారం అనువాదనాటకంగా చాలా ప్రసిద్ధికెక్కింది. వీరు విక్రమోర్వశీయం, ప్రబోధ చంద్రోదయం మొదలైనవి ఆరు సంస్కృతనాటకాలను అనువదించారు. రంగస్థలం మీద పద్యాలు చదవడం అనే కొత్త ప్రక్రియను ప్రవేశపెట్టింది వసురాయకవిగారే. వేణీసంహారం నాటకం వారికెంతో పేరు తెచ్చిపెట్టింది. ఆ నాటకం తెలుగనాటక సాహిత్యంలో చిరకాలం నిలిచేది.

బళ్ళారిలో ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు నాటక వికాసానికెంతో కృషి చేశారు. 'సరసవినోదినీసభ' స్థాపించి ఎన్నో నాటకాలను ప్రదర్శింపచేశారు. వీరు విషాదాంతనాటకాలు వ్రాయటంలో ప్రసిద్ధులు. 'విషాదసారంగధర', 'చిత్రనళీయం' పాదుకా పట్టాభిషేకం వీరికెంతో పేరుతెచ్చిపెట్టాయి. నాటక రంగానికి వీరు చేసిన సేవకు 'ఆంధ్రనాటక పితామహుడు' బిరుదుతో ఆంధ్రప్రేక్షకులు వీరిని సన్మానించారు. సద్విమర్శకుల గీటురాయిగా నిలచిన

శ్రీదివాకర్లవెంకటావధాని గారు తమ యం.ఏ.పట్టంకోసం వీరి నాటకాలను సవిమర్శ పరిశీలన చేసారు. ధర్మవరం వారి నాటకాలలో ఎన్నో సరికొత్త ప్రయోగాలు మనకుకనిపిస్తాయి. గద్యపద్యాలతో పాటు నాటకాల్లో పాటలను, డ్యూయెట్లను వీరే ప్రవేశపెట్టారు. ఆత్మసంభాషణ ద్వారా, మానసిక సంఘర్షణా పద్ధతిని కూడా వీరే ప్రవేశపెట్టారు. తెలుగులో విషాదాంతనాటకాలకు కూడా వీరే ఆద్యులు.

బళ్ళారిలోనే నాటకకళకు అత్యంతసేవ చేసినవారు ఇంకొకరున్నారు వారే శ్రీకోలాచలం శ్రీనివాసరావుగారు. వీరు చారిత్రక నాటకాలు వ్రాయటంలో ప్రసిద్ధులు. 'చారిత్రక నాటక పితామహుడనేది వీరి బిరుదు. మహానటుడు శ్రీబళ్ళారి రాఘవ కూడా వీరినాటకాలలోని పాత్రలు ధరించే తెలుగునాటకాలకు ఇతర రాష్ట్రాల్లో కీర్తినార్జించిపెట్టారు. ఇంకావీరు 'ప్రపంచనాటక చరిత్ర' అనే సమగ్రనాటకరంగ చరిత్రను కూడా వ్రాశారు.

కన్యాశుల్కంనాటకం ఆంధ్ర నాటకచరిత్రలో మైలురాయి వంటిది. 1897వ సంవత్సరంలో ఈ నాటకం వెలువడింది. మహాకవి గురజాడ అప్పారావుగారు రచించిన ఈ నాటకంవందసంవత్సరాలు దిగ్విజయంగా ప్రదర్శింపబడింది. కాలపరీక్షకు నిలిచి నేటికీ రసజ్ఞుల హృదయాలను చూరకొంటున్నది. ఈ నాటకంలో కన్యాశుల్కం ప్రధానసమస్య. సున్నితమైన హాస్యంతో, గుండెలను పిండే వ్యంగ్యంతో వాడుక భాషలో వ్రాయబడిన ఈ నాటకం తెలుగునాటక సాహిత్యంలో కళాఖండం.

ఇదే సంవత్సరంలో వ్రాయబడిన మరో మహానాటకం వేదం వెంకటరాయశాస్త్రిగారి 'ప్రతాపరుద్రీయము'. తెలుగులోని మొదటిచారిత్రక నాటకం కూడా ఇదే. చాలా చోట్ల ఈ నాటకం ప్రదర్శింపబడ విజయదుందుభులు మ్రోగించింది. పాత్రోచితభాష ఈ నాటకంలోని ప్రత్యేకత. ముస్లిం పాత్రలకు నేటికీ వాడుకలో ఉన్న భాష 'హేమ్ బాయ్' 'హెంద్యూభాయ్' లాంటి పదాలు ఈ నాటకంలోనివే.

1920 నుండీ స్వాతంత్రేచ్ఛ ఇతి వృత్తంగా గల నాటకాలు రాసాగాయి. జాతీయోద్యమానికి సంబంధించిన కథలు, నవలలు, నాటకాలు విరివిగా వ్రాయబడేవి. దామరాజు పుండరీకాక్షుడుగారు 'గాంధీవిజయం' అనే నాటకాన్నీ, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 'గాంధీజీవిజయధ్వజం', శ్రీపాద కామేశ్వరరావుగారు 'చంద్రగుప్త', 'రాణాప్రతాప్' నాటకాలను రచించారు.

ఈ కాలంలో పౌరాణిక నాటకాలు అధికసంఖ్యలో వచ్చాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు 'గయోపాఖ్యానం' తిరుపతి వెంకటకవులు 'పాండవోద్యోగం', ముత్తరాజుసుబ్బారావు 'శ్రీకృష్ణతులాభారాన్ని', పానుగంటి వారు, 'పాదుకాపట్టాభిషేకాన్ని' రచించారు. పౌరాణికాల్లోకూడా పద్యనాటకాల ప్రాబల్యం హెచ్చింది. కందుకూరి, 'అభిజ్ఞానశాకుంతలం', శ్రీపాద కృష్ణమూర్తి గారి 'బొబ్బిలియుద్ధం' ధర్మవరం గోపాలాచార్యులవారిరామదాసు కొప్పరపు సుబ్బారావు 'రోషనార', ప్రధానమైనవి. ఈ కాలంలోనే కాళ్ళకూరి నారాయణరావుగారు చింతామణి, వరవిక్రయం, మధుసేవ లాంటి సాంఘికనాటకాలూ రచించారు.

క్రమంగా హేతువాదదృష్టి ప్రబలింది. నాటకాలు కూడా ఆ దృక్పథంలోనే వచ్చాయి. త్రిపురనేని రామస్వామి చౌదరిగారి 'కురుక్షేత్రం', చలంగారి 'సావిత్రి', ఈ కోవలోవే. అప్పటి నాటకాలలో పద్యాలకూ, పాటలకూ అధిక ప్రాధాన్యం హెచ్చింది. పద్యాలు పాడేనటులే రాణించే స్థితి ఏర్పడింది. పురుషులే స్త్రీ పాత్రలు ధరించేవారు. పౌరాణిక, చారిత్రక నాటకాలు ఎక్కువగా ఆదరింపబడేవి.

1940 నుండీ చలనచిత్రాలు అధికసంఖ్యలోరావటంతో గాయకనటులు సినిమారంగంవైపు ఆకర్షితులయ్యారు. మహోజ్జ్వలంగా వెలిగిన నాటకరంగం క్రమంగా క్షీణించసాగింది. వ్యాపార దృష్టితో వేయించే కంట్రాక్టర్ల నాటకాలంటేజనం అసహ్యించుకునేవారు. పోతే జాతీయోద్యమ ప్రభావం ప్రజలపై కవులపై విపరీతంగా పడింది. తత్ఫలితంగా అనేక చారిత్రక నాటకాలు, రాజకీయ నాటకాలు వెలుగుచూసాయి. విశ్వనాథ వారి త్రిశూలం, గ్రంథి వెంకటసుబ్బరాయగుప్తగారి 'ఆంధ్రమాత' మొదలైన నాటకాలు ఈ కోవలోకి చెందినవే.

1935 నుండి దేశంలో రేడియోప్రసారాలు ఆరంభమైనాయి. అప్పటి నుండీ శ్రవ్య నాటికలు విరివిగా రాసాగాయి. స్వాతంత్ర్య సముపార్జన కోసం సత్యాగ్రహాలు, సమ్మెలు సాగేవి. ఆ రోజుల్లోనే నాటికాప్రక్రియ ఆవిర్భవించింది. ఏకాంకికలు, నాటికలూ ప్రచారంలోకి వచ్చాయి. ఈ రోజుల్లోనే సాంఘిక నాటకాలు. స్వభావవాదానికి అనుగుణంగా, వాస్తవికతకు అద్దం పట్టే విధంగా పూర్తి వ్యావహారిక భాషలో కేవలం వచనంతో వ్రాయటం వ్యాప్తిలోకి వచ్చింది. 1943లో ఆంధ్రనాటక కళాపరిషత్తు పునరుద్ధరించబడటంతో ఔత్సాహిక

నాటకరంగంలో విప్లవాత్మకమార్పులు వచ్చాయి. ఈ దశాబ్దంలోనే మూడు వందల నాటకాలు, ఐదు వందల నాటికలూ వెలుగుచూసాయి. ప్రతిభా వంతులైన కవులంతా నాటకాలు రచించటానికిష్టపడేవారు. ఈ సమయంలో తమ చదువును ముగించుటకున్న కే.యల్.నరసింహారావు గారు గ్రామీణ వ్యవస్థాపునర్వికాసంకోసం నాటక రచన చేపట్టారు.

1. దశరూపక సారము. గడియారం రామకృష్ణశర్మ పే. 2

2. సాహిత్య దర్శనము కె.వి. ఆర్. నరసింహం. పే. 527

3. వాల్మీకి రామాయణం, అయోధ్యకాండ, 67 వ సర్గ. శ్లో. 15.

4. తెలుగు నాటక వికాసము. పి.యస్సార్. అప్పారావు. పే 82.

5. తెలుగు నాటక వికాసము. పి.యస్సార్. అప్పారావు. పే. 20

# కే. ఎల్. నరసింహారావుగారి నాటకాలు

## సాంఘిక నాటకాలు

సంఘంలోని వ్యక్తులను గురించి, సమస్యలను గురించి, హక్కులు బాధ్యతలను గురించి, ఒకటని కాకుండా సంఘానికి చెందిన అన్ని విషయాలను తనలో ఇముడ్చుకున్న పదం సాంఘికం. ఒక వర్గానికి చెందిన కొన్ని జీవులతో ఏర్పడేది సంఘం. ముఖ్యంగా మానవజాతి జీవితం మొత్తం సంఘంతోనే ముడిపడి ఉంది. మానవసంఘం కొన్ని నిర్దుష్టమైన విలువలనూ, సంస్కృతినీ కలిగి ఉన్నది. పశుపక్ష్యాదులకు లేని సాంఘికపరమైన ఎన్నో బాధ్యతలను, కీర్తిప్రతిష్ఠలను, సాంఘికపరమైన భద్రతను మనం పొందుతున్నాం.

సంఘజీవనం చేసే ప్రతి వ్యక్తికీ, తన యిల్లు, తనసంఘం, తనదేశంపట్ల ప్రేమాభిమానాలుంటాయి. వాటిని ఇతరులకు పంచుతూ, తనువారినుండి ప్రేమను పొందుతూ, ఒక సాంఘిక భద్రతా వాతావరణాన్ని తానే సృష్టించు కున్నాడు. వ్యక్తిలేనిదే సంఘంలేదు. సంఘానికి వ్యతిరేకంగా ఏజీవీ నిలవలేదు. ఒక సంఘాన్ని గూర్చి తెలిపే ముఖ్యమైన ఆధారాలు సంస్కృతి, సంప్రదాయాలు. ఏజాతి సంస్కృతీ సంపదను, సాంఘిక పరిణామాన్ని తెలుసు కోవాలనుకున్నా, ఆ జాతి సంస్కృతీ సంప్రదాయాలను క్షుణ్ణంగా తెలుసుకోవటం తప్పని సరైందే కాక, ఆ జాతి సాహిత్యాన్ని కూడా అవగాహన చేసుకోవాలి. తెలుగువారి సాంఘిక పరిణామాన్ని సాంస్కృతిక పరివర్తననూ, సంప్రదాయాన్నీ తనలో ఇముడ్చుకుని మహోత్కృష్టమైన జీవనదిలా ప్రవహిస్తున్నది తెలుగు సాహిత్యస్రవంతి.

తెలుగు సాహిత్యం ఆదికవినన్నయ నుండి ఆధునిక కవుల వరకు సువిశాలంగా విస్తరించింది. ఆ విస్తరణలో తెలుగుజాతి సాంఘికాంశాల నెన్నిటినో స్పృశించింది. సంప్రదాయాన్ని మథించి రసామృతాన్ని చిందించింది. సంఘం, సాహిత్యమూ అవినాభావమైనవి. సాంఘిక పరివర్తనకు సాహిత్యం వ్యక్త పరుస్తుంది. నవ్య సాహిత్యోద్భవానికి సంఘం కారణమవుతుంటది. రచయిత సంఘజీవి. తాను చూసిన దృశ్యాలను తన కల్పనాశక్తితో రంగరించి సంఘాని కందిస్తాడు. సంఘం అతని రచనాశక్తిని ఆస్వాదించి తద్వారా రసానందాన్నేకాక విచక్షణాజ్ఞానాన్నీ పొందుతుంది. ఇలా సంఘమూ, సాహిత్యమూ అనుబంధాన్ని పెంచుకున్నాయి. ఏ కావ్యమయినా సాహిత్యప్రయోజనాన్ని సాధించాలంటే

వుందుగా సాంఘిక ప్రయోజనాన్ని సాధించాలని వెయ్యిసంవత్సరాలు తెలుగుసాహిత్యచరిత్ర నిరూపించింది. "సాంఘిక రూపకములందలి ఇతి వృత్తములు కల్పితములు. సంస్కృత రూపకములందలి ప్రకరణము, ప్రహసనము అట్టివే. ఆధునిక కాలమున తొలి తెలుగుసాంఘిక రూపకము వావిలాలవారి 'నందకరాజ్యము' (1880) ఇందు నాటి బ్రాహ్మణుల్లోని నియోగి – వైదిక శాఖల వారి విరోధములు, అధికారుల దౌర్జన్యములు విపులముగా వర్ణితము లయినవి''[1]. అంకాలను రంగాలుగా విభజించటం మొదలైన చిన్నచిన్న మార్పులు తప్ప ఆంగ్లరూపక ప్రభావం ఇందులో ఎక్కువగాలేదు. తేటగీతిలో వ్రాయబడిన నాటకమిది. తరువాత కందుకూరి వారి బ్రాహ్మవివాహ- వ్యవహార ధర్మబోధిని, వివేకదీపికలు ప్రధానమైనవి. వ్యవహార ధర్మబోధిని వ్యావహారిక భాషలో వ్రాయబడిందేగాక, మొట్టమొదట ప్రదర్శన భాగ్యాన్ని పొందిన తొలి తెలుగురూపకం. వీటితరువాత వరుసలో సాంఖ్యాయన శర్మగారి 'మనోరమ', వల్లూరివారి 'సాగరిక' లపై ఆంగ్లరూపక ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది.''

వీటి తరువాత నాటికీ, నేటికీ అద్వితీయం సాంఘిక నాటకంగా పేర్కొనబడుతున్న 'కన్యాశుల్కం' (1892) ప్రాంతంలో రచించబడి, ఎన్నో ప్రదర్శనలు పొంది 1897 లో పుస్తకరూపంగా వెలువడింది. ఆ తరువాత ఎన్నో సాంఘిక రూపకాలకు ప్రాణప్రతిష్ఠ చేసింది. కన్యాశుల్కం తర్వాత పేర్కొనదగినవి పానుగంటి వారి 'కంఠాభరణము' 1920 తరువాతే తెలుగులో సాంఘికరూపకము లెక్కువగా వచ్చాయి. సమాజానికి హానికరంగా తయారైన మూఢాచారాలను, ఆధునిక నాగరికత వల్ల ఏర్పడిన కృత్రిమత్వాన్నీ, వ్యక్తుల్నీ వ్యసనాలనీ ఈ కాలంలోని నాటకాలు చిత్రించినవి. కేవలం సంఘసంస్కరణమే ప్రధానోద్దేశ్యంగా నాటకరచన చేసిన వారిలో కాళ్ళకూరి నారాయణరావుగారు ప్రముఖులు. వీరి 'చింతామణి', 'వరవిక్రయము' ప్రసిద్ధి పొందిన సాంఘిక నాటకాలు.

1928 నుండి ఆంగ్లనాటక కర్తలైన ఇబ్సెన్, మేథర్ లింక్, షా,వైల్డ్ మొదలైనవారి ప్రభావం తెలుగునాటకాలపై పడి, సాంఘికనాటకాలన్నీ సమస్యాప్రధానమైననాటకాలుగా రూపుదిద్దుకున్నాయి. ఈ సమస్యా ప్రధాననాటకాలు రచించిన వారిలో ప్రథములు శ్రీపి.వి.రాజమన్నారుగారు.

సాంఘిక జీవనాన్ననుసరించే సాహిత్యంలో సంప్రదాయాను గుణమైన మార్పులు జరుగుతాయి. ప్రథమంగా చతుర్వేదాలు, క్రమంగా ఉపనిషత్తులు.

శ్రౌతసూత్రాలు. బ్రాహ్మణాలు, వ్యాకరణ, ఛందస్సూత్రవ్యాఖ్యానాలూ, షట్ దర్శనాలు, గౌతమబుద్ధుని బోధలూ, కాళిదాసాది సంస్కృత కవుల అపూర్వ నాటకాలు మొదలైన సమస్త సాహిత్యమూ సంఘాన్ననుసరించి సృష్టించబడిందే. 'యుగధర్మాన్ని పాలించనప్పుడు వ్యక్తికిగానీ, సంఘానికిగానీ మనుగడే లేదు. ఇది ప్రజాస్వామ్యయుగమని నేను చెప్పవలసిన పనిలేదు. రాజుల రోజులు వెళ్ళిపోయాయి. ఇప్పుడు ప్రజలేరాజులు, ఇందువల్ల సారస్వతం రాజాదరణకై దేవురాడరాదు ప్రజాదరణను సంపాదించుకోవాలి. ప్రజాభిరుచులను తృణీకరించనపుడే అది లభ్యమవుతుంది.''[2]

రచయిత సంఘసంస్కరణాభిలాషి. సాంఘికసమస్యలను చూసినప్పుడు అతని మనోనేత్రం చలించి సాహిత్యపుజల్లులను కురిపిస్తుంది. సాహిత్యం ప్రజాహితంకోసమే అనినమ్మే నరసింహారావు గారి సాంఘిక నాటకాలు సమస్యాప్రధానమైనవి. ముఖ్యంగా వీరి సాంఘిక నాటకాలపై కీ.శే. గోపీచంద్‌గారి ప్రభావం చాలా ఉంది. ఈ విషయం రచయిత స్వయంగా చెప్పుకున్నారు. వీరిని ప్రత్యక్ష స్నేహంతోనూ, పరోక్షంగా రచనలతోనూ ప్రభావితులను చేసిన గోపీచంద్ సుప్రసిద్ధ మానసిక విశ్లేషకుడు, తాత్వికుడు. తెలుగుసాహిత్యంలో భౌతిక పరిస్థితులను గాక, మానసిక పరిస్థితులను, వైయక్తికసమస్యలను తన రచనలద్వారా ప్రవేశపెట్టింది వీరే. ఎంతో ప్రసిద్ధి పొందిన వీరి రచనలలో 'అసమర్థుని జీవితయాత్ర' తత్వవేత్తలు, 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' మొదలైనవి తెలుగు సాహిత్యంలో చిరకాలంనిలిచే ఆణిముత్యాలు. వీరి చేత ప్రభావితులైన నరసింహారావుగారి సాంఘిక నాటకాలలోనూ ఇతి వృత్తంలో సంఘ సంస్కరణాభిలాషా, సంభాషణలలో అంతర్లీనమైన హాస్యం. ముగింపులో ఆశావాదంతో పాటు ఆధ్యాత్మికతా గోచరిస్తాయి. వీరి ముద్రిత సాంఘిక నాటకాలు (1)ఆదర్శలోకాలు (2) అభాగ్యులు (3) స్వార్థం.

## 1. ఆదర్శలోకాలు

జాతీయసమైక్యతను చాటే ఈ నాటకాన్ని ప్రప్రథమంగా గాంధీస్మారకదిన సందర్భంలో పదివేల మంది ప్రజలసమక్షంలో పరగణా కాంగ్రెస్, స్టేట్‌కాంగ్రెస్ వారి సహాయంతో 12-2-48వ తేదీన ప్రదర్శించారు. ప్రదర్శనకు కొద్ది రోజులముందే (వారంలోపు) ఈ నాటకాన్ని గాంధీస్మారకసభ కోసం వ్రాశారు.

కులమత రహితమైన సమసమాజాన్ని స్థాపించాలని ప్రగతివాదులు, మహాత్ములూ ప్రాణాలొడ్డి కృషిచేస్తున్నా మతంపేరుతో కొందరు స్వార్థపరులు ప్రజల మధ్య మనోవైషమ్యాలు సృష్టించి వాటి అదునులో తమ అవినీతి కార్యకలాపాలను నిర్విఘ్నంగా సాగిస్తున్న వైనాన్ని ఈ నాటకంలో చిత్రించారు. మతకల్లోలాలు ప్రధానసమస్యగాసాగే ఈ నాటకంలో హిందూముస్లింల మధ్య మతవిభేదాలను కలిగించే పరిస్థితులను రచయిత భీభత్సప్రధానంగా చూపించారు.

భిన్నత్వంలో ఏకత్వానికి ప్రతీక అయిన మన భరతావనిలో సోదరుల్లాంటి హిందూ ముస్లిములు వైషమ్యాలు పెంచుకోవటానికీ వాటిని రాజకీయనాయకులు తమస్వార్థానికి ఉపయోగించుకోవటానికీ గల ముఖ్యకారణాలు చరిత్రలో స్పష్టంగా లిఖించబడ్డాయి. "భారతదేశంలో స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొననివారిలో అతి ముఖ్యమైన వర్గం మహమ్మదీయులు. దీనికి రెండు కారణాల వలన అధికప్రాధాన్యం ఉంది. అస్వతంత్ర భారతంలో ముస్లిముల జనాభా 25% గా ఉండటం మొదటిది. ఇంతపెద్ద సంఖ్యలో ఉన్న ఈ వర్గం స్వాతంత్ర్యపోరాటానికి దూరంగా ఉండటమేగాక. వ్యతిరేకించట మనేది జాతీయనాయకులకు చాలా ఇబ్బందిగా తయారయింది. ఇందువల్ల అనేక సమస్యలు తలెత్తాయి. మరొక కారణం వారివ్యతిరేకత వలన దేశవిభజన తప్పనిసరై అనేక దౌర్భాగ్యకర ఫలితాలకు దారితీసింది''.[3]

ముస్లింలు స్వాతంత్ర్యపోరాటాన్ని వ్యతిరేకించటానికి కారణం దాదాపు ఏడువందల సంవత్సరాలు భరత ఖండంపై మహమ్మదీయుల అవిచ్ఛన్నమైన పరిపాలన. వీరికి ఇతర మతాల పట్ల చెప్పరాని అసహనం. ఏ పనికైనా సాహసించి, ఎంత దుర్మార్గానికైనా ఒడిగట్టే మనస్తత్వంతో కూడిన వారుగా, కేవలం మతానికి సంబంధించిన వారుగా ఈ దేశంలోకివచ్చారు. వారి దండయాత్ర ప్రథమస్థాయిలో హిందువులను, వారిమతాన్నిఅణచి, విగ్రహారాధనను అంతమొందించటంతో మొదలయి, హిందువులపై పెత్తనం చేయటానికి, తమ ఏకాకి తనాన్ని ప్రదర్శించుకోవటంతో వారి దురాక్రమణ కొనసాగింది. అలాంటి సంఘటన భారతదేశం తిరిగిచూడలేదు. దాన్ని మరచిపోలేదు కూడా. ఈ సంఘటనే ఈ రెండుమతాలమధ్య శాశ్వతమైన శత్రుత్వాన్ని సృష్టించింది. ఈ స్థాయి గడచి పోయంతరువాత సూఫీమత ప్రచారకుల ప్రభావం పెరిగింది. వీరే ఇస్లాం మతాన్ని భారతదేశ సాధారణ ప్రజల్లో ఎక్కువ ప్రచారంచేసి మతాంతీకరణ చేయగలిగారు. హిందూ. ముసిం మతాల

మధ్య సమన్వయం సాధించటానికి వీరెక్కువ ప్రయత్నించారు. వీలకాలంలోనే ఈ రెండుమతాల మధ్యసన్నిహిత సంబంధాలు విస్తరించాయి. ఈ ఉద్యమం విస్తరిల్లి, విస్తరిల్లి అక్బరుచక్రవర్తి కాలం నాటికి తారస్థాయికి చేరింది. ఆయన సాగించిన చైతన్యవిజ్ఞానపూరిత పరిపాలనను ఆయన మనుమడు 'దారా' కొనసాగించాడు. వారసత్వ యుద్ధంలో దారాపరాజితుడు కాగానే ఈ సమ్మైక్యతా ఉద్యమంనీరుకారి పోయింది. ఔరంగజేబు ప్రజాపాలకుడయిన నాటినుండే ముస్లింల వేర్పాటువాద ఉద్యమం ప్రేళ్ళూనటం ప్రారంభమయింది.

ఔరంగజేబు పాలనలో భారతదేశంఇస్లాము రాజ్యంగా, అంతర్జాతీయ దారల్ఇస్లాంలో భాగంగా నిలిచిపోయింది. ఇందులో అధిక సంఖ్యలో ముస్లిమేతరులున్నారనీ వారిని తాను దయాకటాక్షలతో పాలించి, ఆదరిస్తున్నానీ ఔరంగజేబు భావించారు. ఈ సిద్ధాంతాన్నే పాకిస్తాన్ కొనసాగించింది. అత్యంత భయానకపరిస్థితిని ఈ పరిణామం కొనితెచ్చింది. ఔరంగజేబు మరణానంతరం కొద్ది కాలానికే అతడి సామ్రాజ్యం కూలిపోయింది. ఈ పతనంతో భారతదేశంలో ముస్లింల చరిత్రలో నూతనాధ్యాయం మొదలైంది. రాజకీయాధికారం అస్తమించటంతో ముస్లింలు నిరాశానిస్పృహలకు లోనయ్యారు. దిగజారి పోయారు. ఒకనాటి పరిపాలకులు బ్రిటీష్ ప్రభుత్వంలో పాలితులుగామారారు. ఈ స్థితి హిందూమత పునర్విజృంభణకు అవకాశమిచ్చింది. భారతదేశంలోని ఇస్లాంమతం తన ప్రత్యేకతను కోల్పోయి, హిందూమతంలో ఏదో ఒక సర్దుబాటు చేసుకోల్సి వచ్చింది. గతంలో మనదేశంపైకి దండెత్తి వచ్చిన వారందరినీ భారతసమాజం ఈ విధంగానే తనలో ఇముడ్చుకుని వారికున్న ప్రత్యేకతలను వమ్ముచేసింది. కానీ ఈ ప్రమాదంనుండి ఇస్లాం తప్పకోగలిగింది. ఆ సమాజాన్ని మళ్ళీ పునరుద్ధరించే ఉద్యమాలు సాగాయి. ఇస్లాంమతం నూతనశక్తియుక్తులను సంతరించుకోగలిగింది.

ఈ ఉద్యమాలలో సంప్రదాయ ఉలేమాలు నాయకత్వం తీసుకున్నారు. వీరి ఆధ్వర్యంలో సాగిన ఉద్యమాలు భారతరాజకీయచరిత్రనే మార్చేసాయి. ఈ మతనాయకత్వమే మహమ్మదీయులను వేర్పాటువాదులుగా తయారుచేసింది. ఈ ఉద్యమధ్యేయం ఇస్లాం పై ఎలాంటి హిందూఛాయలు పడకుండా క్షాళన చేయటం. దానికున్న వ్యక్తిత్వాన్నీ, ప్రజ్ఞనూ బాహాటంగా చాటుకోవటం. 1870 తరువాత మామూలుగా వారి నాయకత్వం వచ్చినా ఈ ధోరణిని అది మరింత బలపరచిందే గానీ తగ్గించ లేదు. ఈ రకమైన నాయకుల్లో సర్ సయ్యద్ అహమ్మద్, ఆలీ సోదరులు, సర్ మహమ్మద్ ఇక్బాల్, జిన్నా ప్రభృతులున్నారు.

సర్ సయ్యద్ బ్రిటీష్ వారికొకలేఖ వ్రాస్తూ, ముస్లిములను ఒక ప్రత్యేక జాతిగా, మతవిషయంగానే గాక, రాజకీయంపరిపాలనా విషయంకంగా కూడా గుర్తించమని ఆయన బ్రిటీష్ ప్రభుత్వాన్ని వేడుకున్నారు. ఈ కారణం చేత ద్విజాతీయసిద్ధాంతానికి మూల పురుషుడు ఇక్బాల్ గానీ, జిన్నాకానీకాదు. సయ్యద్‌అహమ్మద్‌ఖాన్.

సర్‌మహమ్మద్ ఇక్బాల్ నాయకుడు కాగానే ముస్లింల వేర్పాటుధోరణి మరింతబలం పుంజుకుంది. ఆయనే పాన్ ఇస్లామిక్ అంటే, భారతదేశంలోని ముస్లింలు ఇక్కడి జాతీయ సమాజంలో భాగంకారనీ, ప్రపంచముస్లిం సమాజంలో సభ్యులనీ, భారత్‌లోని ముస్లింలు సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో మసలాలంటే వాయవ్య సరిహద్దు ప్రాంతం, సింద్, బెలూచిస్థాన్‌లతో కలసిన ఒక భూభాగాన్ని భారతదేశంనుండి విడదీసి వారికి సంక్రమింపచేయాలనే సిద్ధాంతాన్ని ఆయన ప్రతిపాదించాడు. ముస్లింలకు 'ప్రత్యేకదేశం' అన్న ఈ వేర్పాటువాదాన్ని కేంబ్రిడ్జ్‌లో చదివివచ్చిన ఒక యువకుడు, 'రహమ్మద్ ఆలీ' బలపరచాడు. హిందువులు, మహమ్మదీయులు మౌలికంగా రెండు ప్రత్యేకజాతులన్నది ఇతని వాదన. భారతదేశంలో అన్ని ముస్లింకేంద్రాలలోనూ అతడీ ప్రచారకేంద్రాలను నెలకొల్పాడు. రెండో ప్రపంచసంగ్రామంలో దేశంలో వచ్చిన అనేక మార్పుల వలన, కాంగ్రెస్‌వారు చేసిన ఘోరతప్పిదాల వలన 'జిన్నా' ఈ వేర్పాటు ధోరణికి మద్దతుదారుగా మారి 1947 లో పాకిస్థాన్ సాధించు కున్నాడు.

ఈ విధంగా ఎన్నోకారణాలవలన హిందూముస్లింల వివాదం రావణ కాష్టంగా రగులుతూ, రాజకీయ నాయకుల హవిస్సులతో మరింతబలం పుంజుకుంది. అలనాటి ఔరంగజేబు నుండి మొదలై నిన్నటి పాకిస్థాన్ విభజనకు కారణమై, నేటి రామజన్మభూమి వివాదం వరకూ ఈ వేర్పాటు ధోరణికోరలు సాచి, ఎందరో అమాయకజీవులను బలితీసుకుంటూ, రాజకీయనాయకులకు హోదాను పెంచే సాధనంగా మారింది.

నరసింహారావు గారి 'ఆదర్శలోకాలు' నాటకం ఈ విషయాన్నే ప్రతిపా దిస్తుంది. సమస్యాత్మకమైన ఈ నాటకంలోని ప్రధానరసం 'భీభత్సం'. ఇందులో హాస్య, కరుణరసాలు అంగిరసాలుగా నిలిచాయి. పదిరంగాల్లో సాగే ఈ నాటకానికి జనరంజకమైన గేయాలను శ్రీరామకవచం సత్యనారాయణగారు, కొన్ని పద్యాలను వారణాసి వెంకటేశ్వర శాస్త్రి రచించారు.

నాటకం ప్రథమరంగంలో హిందూముస్లింల కలహాలపై కథానాయకుడైన మధుసూదన్ ఉపన్యాసంతో కథకు 'నాంది' జరుగుతుంది. ఆ రోజుల్లో ఉత్కంఠభరితమైన ఈ ఉపన్యాసం ప్రేక్షకులనెంతో ఉత్తేజపరచేది. ఆ పాత్రను ఏ నటుడు ధరించినా ఈ సంభాషణ 'వన్స్‌మోర్' లనందుకునేది. ఈ సందర్భంలో జాతీయ సమైక్యతపట్ల రచయిత భావాలను ప్రస్ఫుటింపచేస్తుంది. రెండవ రంగంలో కథకు ప్రతినాయకులైన 'సేఠ్‌జీ', 'బలరాం', 'రఘుపతు' ల సంభాషణల ద్వారా బీజావాపనం జరిగి, ముందుముందు వారు చేయబోయే విధ్వంసకాండను సూచ్యప్రాయంగా తెలియచేస్తుంది. మూడవ రంగంనుండి చివరిరంగంవరకూ భీభత్సంగా ప్రతి నాయకులు చేస్తున్న ప్రజాఘాతుకాలనూ, దుర్మార్గాలనూ నాయకుడు సహచరుల సహాయంతో వీరోచితంగా ఎదుర్కోవటంతో మొదలై చివరకు దోపిడీదారులను, అప్రజాస్వామికవాదులనూ పోలీసులు అరెస్ట్‌చేయుటంతోనూ, నాయకుని వివాహంతోనూ నాటకం సుఖాంతంగా ముగుస్తుంది.

స్వాతంత్ర్యానంతరం చెలరేగిన మతకల్లోలసమయంలో ఈ నాటకం రచించబడింది. కాయకష్టం చేసుకుంటూ, ప్రక్కవారితో సామరస్యంగా సహజీవనం చేసుకునే ప్రజల మధ్య ఏ వైషమ్యాలూ లేనప్పటికీ రాజకీయవాదుల స్వార్థంతో సోదరుల్లాంటిప్రజలమధ్య గుండాలతో, దాదాలతో మతద్వేషాలు సృష్టించబడ్డాయి. ప్రభుత్వం శాంతిరక్షణ సంఘాలెన్ని ఏర్పాటుచేసినా, ఆయుధానికి భయపడే ప్రజలకు గుండాలహింసాకాండలలో సుఖశాంతులు లేకుండా పోయిన సమయంలో చదువుకున్న యువతీయువకులు ముందుకు వచ్చి, ప్రజల్లో ఆత్మస్థైర్యాన్ని నింపి, దౌర్జన్యకారులను ఎదుర్కొనే ధైర్యాన్ని, శక్తుయుక్తులనూ, పంచటానికి ఎంతో కృషి చేస్తారు. అలాంటివారిలో ప్రధములు మధుసూధన్, అబ్బాస్, ప్రభ, లీల ముఖ్యులు.

ఛాందసుడైన మధుతండ్రి శివరామయ్య ఈ గొడవల్లో తలదూర్చితే ముస్లిములేం చేస్తారోననీ, పోనీ సహాయపడితే హిందూ వీరసర్దార్లేంచేస్తారోననీ భయపడుతూ కొడుకును శాంతి రక్షణ సంఘానికి వెళ్ళొద్దని కట్టడిచేస్తాడు. కానీ మధు, అబ్బాస్‌లు ఆ బాల్యమిత్రులు. దేశ రక్షణ కోసం ఏం చేయటానికైనా సిద్ధపడేవారు. భీతావహులైన ప్రజలకు ధైర్యంచెప్తూ ప్రభుత్వసహాయంతో దౌర్జన్యకారుల ఆటకట్టించటంతో సఫలీకృతులవుతారు. ఆ ప్రయత్నంలో రౌడీలు వీరి మీద హత్యాప్రయత్నం చేయబూనినప్పటికీ దాన్ని సమర్థవంతంగా తిప్పికొట్టి, వారినే బంధించి ప్రభుత్వానికి అప్పచెబుతారు. తరచుగా సభలూ సమావేశాలూ

ఏర్పాటు చేస్తూ ప్రజలకు రాజకీయచైతన్యాన్నీ, సామాజిక భద్రతనూ నూరిపోస్తుంటారు.

ఈ నాటకంలో కథానాయిక 'ప్రభ' ధైర్యవంతురాలు. తానిష్టపడే సంగీతాన్ని మధు దగ్గర నేర్చుకుంటుంది. సామాన్య మహిళలకు ధైర్యసాహసాలను బోధిస్తూ గూండాలకు ఎదురు తిరిగి ఆత్మరక్షణ చేసుకునే మార్గాలను చూపుతుంది. తను ప్రేమించి పెళ్ళిచేసుకోవాలనుకునే మధును తండ్రి ఇష్టపడక వేరే పెళ్ళి చేయాలని ప్రయత్నిస్తే, ఆ ప్రయత్నాన్ని వమ్ముచేసి తానే ధైర్యంగా మధును చేరుకుంటుంది.

సేఠ్ జీ కూతురైన లీల చదువుకునే రోజులనుండీ అబ్బాస్ ధైర్య సాహసాలనూ, తెలివి తేటలను చూసి ప్రేమిస్తుంది. గూండా రఘుపతి తనను పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నిస్తే, భయపడకుండా ఎదుర్కొని తన అయిష్టాన్ని స్పష్టం చేస్తుంది. అబ్బాస్ మీద హత్యాప్రయత్నం జరిగి, గాయాలైనప్పుడు అతను కోలుకోవటానికి రేయింబవళ్ళు కృషి చేస్తుంది. తన తండ్రే రౌడీలకు ఆయుధాల్ని సమకూర్చుతున్న విషయాన్ని అబ్బాస్‌తో చెప్పి, తండ్రినీ రౌడీలనూ పోలీసులకప్పగిస్తుంది. అబ్బాస్‌ను పెళ్ళాడి, మధు,ప్రభల వివాహం జరిగి వారు ఆనందంగా ఉండటానికి ఎంతో ప్రయత్నిస్తుంది. తెలుగునాటక సాహిత్యంలో స్వాతంత్ర్యానంతరం హిందూముస్లింల ఐక్యతను చాటే నాటకాలెన్నో వచ్చాయి. వాటిలో ఇచ్ఛాపురం యజ్ఞనారాయణగారి 'రసపుత్ర విజయము'. కొప్పరపు సుబ్బారావుగారి 'నూర్జహాన్', 'రోషనార', 'అల్లీముతా', గుండిమెడ వారి 'ఖిల్జీరాజ్యపతనము' మొదలైనవి. ఈ నాటకాలన్నిట్లోనూ హిందూముస్లింల వేర్పాటుధోరణి జాతీయసమైక్యతకు ఎంత అనర్థమో, సమైక్యతాభావం దేశానికెంత అవసరమో చెప్పబడింది. నరసింహారావు గారి ఆదర్శలోకాలు నాటకం కూడా ఆకోవకే చెందుతుంది.

వేర్పాటుధోరణితో దేశాన్నినాశనంచేసి ముక్కలుచేద్దా మనుకునే రాజకీయ నాయకులకు ప్రజలచేతిలో పరాభవం తప్పదనీ, ప్రజలు హింసాకాండతో తాత్కాలికంగా భయభ్రాంతులైనా, ఎల్లకాలం సహించబోరనీ వారికి సంస్కృతీ పరిరక్షణ, శాంతిసౌఖ్యాలు కావాలనీ, వాటిని సాధించేదాకా ప్రజలు నిరంతరం శ్రమిస్తారనీ మత మౌఢ్యాలు లేని ఆదర్శలోకాలను రేపటి తరానికి అందిస్తారనీ ఈ నాటకం ద్వారా రచయిత ఆశావాదం ప్రకటించారు. మహత్తరభారతదేశం తరతరాల విదేశీపాలనలో మగ్గినందుకు కొన్ని అవ లక్షణాలకు గురయినా,

సువిశాలభారతదేశం మతసహనానికే ప్రతీకగా నిల్చి, భిన్నాచార సంప్రదాయాలున్నా, భిన్నభాషాసంస్కృతులున్నా, భిన్నత్వంలో ఏకత్వానికే ప్రాధాన్యతనిచ్చింది. ఆ విషయాన్నే తన 'ఆదర్శలోకాలు' నాటకం ద్వారా నరసింహారావుగారు మరోసారి నిరూపించారు.

## స్వార్థం

౧౨౫౪ వ సంవత్సరంలో వట్టికోట ఆళ్వారుస్వామి దేశోద్ధారక గ్రంథమాలా ప్రచురణసంస్థను నెలకొల్పి 'కళాసౌధం' అనే నాటికాసంపుటంలో కె.యల్.నరసింహారావుగారి నాటికలను ప్రచురించారు. ఆ సందర్భంలో వ్రాసిన నాటకమే ఈ 'స్వార్థం'.

ఈ నాటికలో ఇతి వృత్తం మనిషిని సర్వనాశనం చేసే స్వార్థమనే భూతం. భూస్వామి లక్ష్మయ్య తరతరాలు పెత్తందార్ల అహంకారానికీ, అనాగరిక ప్రవృత్తికీ ప్రతీక. ఏ మనిషినైనా కేవలం డబ్బుతోనే కొలవటం ఇతని ప్రత్యేకత. ప్రపంచంలోని ఏ వ్యక్తినయినా, వస్తువునయినా సంఘటననైనా కేవలం తన స్వార్థం కోసం ఉపయోగించుకోగల ప్రభుద్ధుడు. వీరి ఇద్దరు కొడుకుల్లో పెద్దవాడైన భాస్కరం ఆ ఊళ్ళోనే మందుల షాపు పెట్టుకుంటాడు. చిన్నవాడు మూర్తికూడా ఆ ఊళ్ళోనే సబ్ఇన్స్పెక్టర్. తన కొడుకులు తనమాట జవదాటరని లక్ష్మయ్య నిశ్చితాభిప్రాయం. తన చిన్నకొడుకు పోలీసు హోదాతో తనకు వ్యతిరేకులందరినీ లాకప్‌లో పెడతాడనీ, కాబట్టి తానంటే ఊరివారంతా భయభక్తులతో మెదలాలనీ తనకు ఎదురు చెప్పరాదనీ ఇతని అభిప్రాయం. ఆ ఉద్దేశ్యంతోనే అందరిమీదా తన అధికారాన్ని ప్రదర్శిస్తుంటాడు. కానీ ఇతనికి వ్యతిరేకంగా చిన్నకొడుకు మూర్తి న్యాయబద్ధమైన జీవితాన్ని అభిలషించేవాడు. ఊళ్ళో అన్యాయాలను ఎదుర్కొని శాంతిభద్రతలు కాపాడటానికి కృషి చేసేవాడు. మానవత్వాన్ని మరచి, ప్రాణావసరాలకు అవసరమే మందులు ఎక్కువధరకోసం అక్రమంగా నిల్వచేస్తున్నాడనీ, మందులధరలను అన్యాయంగా పెంచుతున్నాడనీ స్వంత అన్నయ్యనే అరెస్ట్ చేస్తాడు. తత్ఫలితంగా అన్న స్వార్థానికి బలయిపోయి ఊరినుండి బదిలీ చేయబడతాడు.

ఇక పెద్దకొడుకు భాస్కరం అచ్చం తండ్రి గుణాలను పుణికిపుచ్చుకున్నవాడు. ఏ రకంగానైనా డబ్బు సంపాదించాలని ఇతని కోరిక. అందుకోసం నీతి, అవినీతిని, న్యాయాన్యాయాలను లెక్కచేయని మూర్ఖుడు. తను చేసిన అన్యాయాలను కప్పిపుచ్చుకుని స్వంతతమ్ముడనయినా చూడక భాస్కర్ బదిలీకి

కారణమవుతాడు. అంతేగాక, తనమార్గానికి అడ్డువస్తే, ఊరినించేగాక, ఉద్యోగం నుండి కూడా తప్పిస్తానని బెదిరిస్తాడు. మందుల షాపు ఓనరు శివరావుకు తను బాకీ ఉన్న డబ్బునివ్వననీ, ఎక్కువ మాట్లాడితే తన కొడుకుతో చెప్పి లాకప్‌లో పెట్టిస్తాననీ బెదిరిస్తూ ఇవ్వవలసిన చిన్న మొత్తం కోసం ఆ షాపువారిని ఊరికేతనింటిచుట్టూ తిప్పకుంటుంటాడు.

ఈ వ్యవహారంతో బాధపడిన శివరావు ప్రభుత్వాధికారులకు భాస్కరం షాపులో జరుగుతున్న అవినీతి కార్యకలాపాలను వివరించి, అతని షాపును తనిఖీచేయించి అక్రమాలు నిరూపణఅవటం చేత సీలువేయించేస్తాడు. కొడుకుల్ని చూసుకుని తన స్వార్థంకోసం ఊరి వారందరినీ బెదిరించే లక్ష్మయ్యకు తగిన శాస్తి జరిగి ఒక కొడుకు బదిలీతోనూ, మరో కొడుకు జీవనోపాధిని కోలుపోవటంతోను చింతిస్తుండగా నాటకం సమాప్తమవుతుంది. సంఘటనా ప్రధానమ్మైన ఈ నాటిక ఒకే రంగంతో, సమాప్తమవుతుంది. వాస్తవికతకు అద్దంపట్టే ఈ నాటకంలోని పాత్రలన్నీ నిత్యజీవితంలో మనకు సుపరిచితమ్మైనవే. ఎన్నోసార్లు విజయవంతంగా ప్రదర్శించబడిన ఈ నాటకం అరిషడ్వర్గాలలో స్వార్థం (లోభం) ఎంత అనర్థహేతువో, రక్తసంబంధీకుల మధ్యకూడా ఈ మహమ్మారి అప్యాయతానురాగాలను విరిచి, అసూయాద్వేషాలను ఎలా రగుల్చుతుందో నిరూపిస్తుంది.

## అభాగ్యులు

1960లోనే వ్రాసిన మరోనాటిక ఇది. మధ్యతరగతి మనుష్యుల దయనీయ గాథను కళ్ళకుకట్టినట్టుగా ఇందులో చిత్రించారు కే.యల్.గారు. కరుణరసాత్మకమ్మైన ఈ నాటికలో డబ్బుమనుషులనెలా ఆడిస్తుందో అది లేనివాళ్ళు ఈ సమాజంలో ఎంతహీనమ్మైన పరిస్థితులను ఎదుర్కొంటారో ఆయన వివరించారు.

ఆదర్శవాది భద్రయ్య స్కూలు టీచరు. ఆయన సంపాదించినన్నాళ్ళూ జులాయిగా తిరిగే తమ్ముడూ, గంపెడుసంతానంతో అన్న అతనిమీద ఆధారపడి బ్రతికేవారు. విధివశాత్తూ అతనికి పక్షవాతం వస్తే, అన్న వేరుకాపురం పెడతాడు. సాటిజనంహేళన చేస్తారు. పిల్లను చేసుకుని సంబంధంకలుపుకుంటానన్న 'బావ' వీరి దరిద్రాన్ని అసహ్యించుకుని, తనకొడుక్కి భద్రయ్య అన్నకూతుర్ని ఖాయం [illegible]నని చెపుతాడు. తమ్ముడు రామంమాత్రం లారీనడుపుతూ ఇంటికి కొంత [illegible], వ్యాధిగ్రస్తుడైన అన్నను ఆదుకుంటాడు.

నాటికలోని మరోపాత్ర డాక్టరు. హాయిగా సాగిపోవలసిన వారి కాపురంలో భద్రయ్య వ్యాధితో రగిలిన ఆరని చిచ్చును బాధగా గమనించేవాడు. ప్రతిఫలాపేక్షను ఆశించక భద్రయ్యకు ఉచితంగా వైద్యం చేసేవాడు. గౌరిని పెళ్ళి చేసుకుంటానన్న మేనమామ కొడుకు వేణు తండ్రిమాటను కాదనలేక తటస్థంగా ఉండిపోతాడు. ఆ అవమానం భరించలేని గౌరి బావిలోదూకి ఆత్మహత్యకు ప్రయత్నిస్తుంది. రామం ఆమెను రక్షిస్తాడు. ఈ పరిణామాలన్నీ డాక్టరు దయార్ద్రహృదయాన్ని చాలా బాధిస్తాయి. భద్రయ్య ఎప్పుడూ విషపుగోళీ ఎందుకిమ్మంటాడో అర్థమవుతుంది. చివరకు భద్రయ్యను విషపుగోళీ ఇచ్చానని నమ్మించి, నిద్రమాత్ర ఇచ్చి, అతనికి చావుమీద ద్వేషాన్ని, బ్రతుకులోని పరమార్థాన్ని చూపిస్తాడు.

సమస్యాప్రధానమైన ఈ నాటికలో బీదరికం ప్రధానసమస్య గోపీచంద్ గారి 'అసమర్థుని జీవితయాత్ర' ప్రభావం ఈ నాటికమీద పడక తప్పిందిగాదు. నవలలో పాత్రగతమైన కరుణరసం ఈ నాటికలో సన్నివేశ రూపంగా మలచబడి కరుణరసాన్ని ఆవిష్కరించింది. భద్రయ్య మేష్టారు ఆరోగ్యంగా ఉన్నప్పుడు అందరూ ఆయన వ్యక్తిత్వాన్ని కొనియాడేవారు. మాస్టారు తమ పిల్లలకు ఒక్క గంట చదువుచెప్పినా తల్లిదండ్రులు అదే వరంగా భావించేవారు. వృత్తిలోనూ, ఇంట్లోనూ అందరూ ఆయన సేవల్ని అందుకున్నారు. కానీ ఆయన మూలబడటంతో విద్యార్థులు పై చదువులకు వెళ్ళిపోయారు. బంధువులు ముఖం చాటేసేవారు. బీదరికాన్ని హేళన చేసే సంఘంలో, కష్టజీవులను అవమానించే లోకంలో ఏ చిన్న సహాయంగానీ, ఆప్యాయతతో కూడుకున్న ఏ చిన్న మాటగానీ పొందని ఎందరో అభాగ్యులకు ఈ నాటిక వాస్తవచిత్రణలా కన్పిస్తుంది. చివరికి డాక్టరు ఆ కుటుంబానికి తనవంతు సాయంగా రామాన్ని తన అసిస్టెంటుగా నియమించుకుని, గౌరి వివాహం వేణుతో జరిపించటానికి ప్రయత్నించటంతో ఆ అభాగ్యుల జీవితాల్లో చిన్న ఆశారేఖను చిగురింపచేసారు రచయిత. గ్రామజీవి ఐన రచయిత ఆ వాతావరణం లోని మధ్య, క్రింది తరగతి వారి బాధలన్నింటినీ ఈ నాటికలో కరుణ రసార్ద్రంగా చిత్రించారు. భిక్షుకునికి ఒక చిన్న కబళం ఎంత అవసరమో కష్టంలో ఉన్న ఆర్తులకు కొంచెం వాత్సల్యమూ అంతే అవసరం. అటువంటి అభాగ్యులకు ఎంత సాయం చేసినా తక్కువేననీ, జంతుజాతులనెన్నింటినో ప్రేమగా మచ్చిక చేసుకున్న మనిషి తోటి మానవుల కష్టసుఖాలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటంలేదనీ రచయిత వ్యధాపూరితంగా ఈ నాటికలో వ్యక్తం చేశారు.

ఐనా ఆయన ఆశావాది గనుక అంతంలో చిరు ఆశను ఆ అభాగ్యులకు కానుకగా ఇచ్చి మనుషులు తమ కర్తవ్యాన్ని గుర్తుంచుకునేటట్లుగా నాటికను మలచారు.

1. తెలుగునాటక వికాసము. పి. యస్సార్. అప్పారావు. పే. 475.

2. కదంబం. నార్ల వెంకటేశ్వరరావు. పే. 41.

3. చరిత్ర చెప్పిన పాఠాలు. యం. వెంకటరంగయ్య. పే. 183.

# గ్రామీణ నాటకాలు

"దేశమంటే మట్టికాదోయి దేశమంటే మనుషులోయ్" అన్న మహాకవి గురజాడ మాటల్ని నిజం చేస్తూ, ఆ పొలాల్నిగూడా మట్టిలో శ్రమించి మన ఆకలినితీర్చి జాతికి అన్నదానంచేసే కర్షక[illegible] గ్రామసీమ దేశజనాభాలో సగభాగం గ్రామాల్లోనే నివసించే వ్యవసాయ ప్రాధాన్యతగలదేశం మనది. అత్యధిక సంఖ్యలో నిరక్షరాస్యులున్న గ్రామసీమల్లో ప్రజాస్వామ్యం గురించిగానీ మనరాజ్యాంగంగురించిగానీ, ప్రభుత్వం గ్రామీణులకోసం రూపొందిస్తున్న పథకాలుగానీ,, వాటికి సరిగా అర్థంకాకపోవటానికి నిరక్షరాస్యత, సరైన ప్రచారసాధనాలలోపం[illegible] తమ పనితాము చేసుకుంటూపోవటమేగానీ ఇతరవిషయాలను పట్టించుకోని గ్రామీణుల మనస్తత్వమే అందుకు కారణాలు. వీటికితోడు అనాదిగా మనలో నిక్షిప్తమైన సంప్రదాయపుటుచ్చులు. మూఢాచారాల వలలు కొంత కారణమవుతున్నాయి.

పల్లెల్లో నివసిస్తున్న గ్రామీణులకోసం అక్కడిసమస్యల్నీ, కష్టసుఖాల్నీ, బంగారంలాంటివారి మనసులనీ, పచ్చిపాలలాంటి వారి అమాయకత్వాన్నీ, కష్టించి పనిచేసే శ్రమజీవనాన్నీ, తప్పంటే దేవుడినయినా నిలదీసే నిజాయితీని తన నాటకాలకు ఇతివృత్తంగా ఎన్నుకుని దాదాపు అర్థశతాబ్దానికిపైగా నాటక రచనారంగంలో శ్రమించి గ్రామీణ ప్రాంతాల్లో తమ నాటక ప్రదర్శనలద్వారా ఎంతో ప్రగతిని సాధించిన మహనీయులు శ్రీ కోదాటి లక్ష్మీనరసింహారావుగారు. వీరే నేటి కే.యల్. గా ప్రజలకు సుపరిచితులు.

స్వతంత్ర భారతావనిని పటిష్ఠంగా తీర్చిదిద్దటానికి ప్రతి ఒక్కరూ కృషిచేయాలన్న సూత్రాన్ని గాఢంగా నమ్మే ఈ రచయిత దేశానికి తనవంతు సేవగా ఒక సంస్థను స్థాపించారు. ఆ సంస్థపేరే 'గ్రామ వెలుగు నాట్యమండలి'. అభ్యుదయ సాధన కృషిలో దేశం పురోగమిస్తున్న శుభతరుణంలో సామాన్య ప్రజల్లో సామాజిక చైతన్యదీప్తులు ప్రసరింప చేయటం ఎంతో అవసరమనీ, ఆ అవసరం గ్రామీణ ప్రాంతాల్లో మరీముఖ్యమనీ నరసింహారావు గ్రహించారు. మహాత్మా గాంధీ కలలుకన్న సమసమాజ స్థాపనకు ప్రతి ఒక్కరూ నడుంకట్టి శ్రమించాలనీ ఆ శ్రమ సాఫల్యపు వెలుగులో నవభారతం పునీతం కావాలనీ వీరి వాంఛ. ఆ ,కృషికిక ప్రజల మనసు నాయత్త పరచటానికి శక్తివంతమైన సాధనం నిజజీవితాన్ని ప్రతిబింబింపచేసే నాటకమేననీ నరసింహారావుగారు విశ్వసించారు. అందుకే

మారుమూలనున్న పల్లెప్రజలకుకూడా మన రాజ్యాంగం మన ప్రణాళికలు, ప్రజాస్వామ్య భావన, తేటతెల్లంగా అర్థమై దేశపురోగతిలో వారు భాగస్వాములు కావాలన్న ధ్యేయంతో గ్రామీణ భాషలో యాసలో, గ్రామీణ రీతిలో ఎన్నో నాటకాలు వ్రాసి ప్రదర్శన లిప్పించారు. అందులో కొన్ని నాటకాలు కొన్ని వందసార్లకుపైగా ప్రదర్శించబడ్డాయంటే నరసింహారావుగారు నాటక ర చనారంగంలో ఎంత ఆరితేరినవారో గ్రహించవచ్చును.

నరసింహారావుగారి స్వగ్రామమైన రేపాల నల్గొండజిల్లా మునగాల మండలంలో ఉంది. హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ పోరాటంలో నల్గొండ జిల్లాకూ, ఖమ్మంజిల్లా కొంత భాగానికీ ఈ రేపాల కేంద్రంగా నిలిచింది. తమ స్వగ్రామమైన రేపాలగూర్చి చెబుతూ శ్రీ కోదాటి నారాయణరావుగారు ( రచయిత బంధువు) ఈ విధంగా అన్నారు. ''నా స్వగ్రామమని ప్రశంసించటంకాదుగానీ, రేపాలలో రసికత, విద్వత్తుమొదలైనగుణాలు, ప్రజా ఉద్యమాభిలాషా, అంతోఇంతో అనుశ్రుతంగా కాకపోయినా, చాలాకాలంగానే వేరూనుకున్నట్లు కన్పిస్తుంది. గ్రంథాలయమూ, సభలూ సమావేశాలూ, ఆటల పోటీలు, నాటక ప్రదర్శనలు, భజనలూ మొదలైనవి నా చిన్నతనంనుంచీ చూస్తూనే ఉన్నాను. నాచిన్నతనమంటే దాదాపు అర్థశతాబ్దం క్రితం ఆనాటిస్థితిగతులూ నేటి దేశకాలపరిస్థితులకూ హస్తిమశకాంతరం కంటే ఎక్కువ వ్యత్యాసమే ఉందని నాకు తెలుసు. ఆనాడు మునగాల పరగణా బయటి ప్రపంచంతో సంబంధంలేని ద్వీపం అయితే రేపాల అందులో ఒక కూపం అనవచ్చు. ఇంత వెనుకబడ్డప్పటికీ విశ్వమంతా వ్యాపించిన ఒకతేజస్సు ఈ కూపంలోనూ కొద్దిగానైనా ప్రసరించింది. బహుముఖంగా ప్రకాశించిన ఈతేజఃపుంజంలోనరసింహుని నాటకోద్యమం ఒక స్వాతికిరణం.''

తన పదహారవయేట జగ్గయ్యపేట చదువుముగించుకుని రేపాల వచ్చిన నరసింహారావు తనకు సమకాలీనులైన యువకులను జట్టుగా చేసుకుని 'గ్రామవెలుగు' అనే బహుముఖోద్యమాన్ని ప్రారంభించారు. అందులో భాగంగా గ్రామవెలుగు అనేలిఖితమాస పత్రిక 'గ్రామవెలుగు గ్రంథాలయం, గ్రామవెలుగు నాట్యమండలి' నాట్యమండలికి నాటక రచయితా, ముఖ్యపాత్రధారీ, దర్శకుడూ, నిర్వాహకుడూ అన్నీ నరసింహారావుగారే. ఇందులోని నటబృందం కులం. అంతస్థు అనే భేదాలు లేకుండా వివిధ కులవర్గాల వారుండేవారు. వీరందరికీ ఇంగ్లీష్ పొడి అక్షరాలతో కూడిన సగం సగం తెలుగు పేర్లు తగిలించి. ఎవరో పరాయిదేశంనుండి వచ్చినవారివలె గ్రామస్థులను

నమ్మించేవారు. రేపాలలో చాలా ప్రదర్శనలు ఇవ్వటమేగాక, పరిసర గ్రామాలకూవెళ్ళి నాటకప్రదర్శనలిచ్చేవారు. కాలగతినీ, కుమారునికి గ్రామాభివృద్ధిపైగల ఆకాంక్షనూ గమనించే వీరి జనకులు శ్రీ కోదాటి వెంకటనరసింహారావుగారు కుమారుని ఎన్నడూ వారించలేదు.

ఇంతలో స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యాన హైదరాబాద్ ప్రజా పోరాటం రావటమూ, రేపాల పోరాటపు కేంద్రంగా ఉండటమూ తటస్థించింది. స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలలో అనేకమంది కళాకారులుకూడా ఉండేవారు. వారిలో స్వర్గీయ తేరాల సూర్యనారాయణశర్మగారు చక్కని నటులేగాక, బహుముఖ ప్రజ్ఞాశాలి. వీరూ, వారణాసి వెంకటనారాయణ శాస్త్రిగారూ, నారాయణరావు గారూ కలసి పీపుల్స్ థియేటర్ వంటి ఒక ఉద్యమాన్ని జాతీయోద్యమ ప్రాతిపదికగా తేవాలని నిశ్చయించారు.

ఆ సంస్థకు ''జనతాకళామండలి'' అని నామకరణం చేశారు. అందులో అనేకమంది యువకులు చేరారు. జనతాకళామండలి కార్యస్థానం సూర్యాపేటలో నెలకొల్పి నరసింహారావుగారితో సహా గ్రామ వెలుగు ముఖ్యనటులంతా చేరారు. ఆనాడు కమ్యూనిస్టులు చేస్తున్న అత్యాచారాలకూ, ప్రజాస్వామ్యానికీగల విభేదాల్ని నిరూపిస్తూ నరసింహారవు గారొక నాటకం వ్రాశారు. దీన్ని తమసంస్థద్వారా ప్రదర్శించటానికి పూనుకున్నారు. వీరి నాటకం రక్తికట్టేలా తయారైంది. ఈ నాటకానికి కోదాటి నారాయణరావుగారు నామకరణంచేసి ముగింపు వాక్యాలు వ్రాశారు. ఆ నాటకానికి చేసిన అద్భుతమైన నామకరణం నాటక రచనారంగంలో నరసింహారావుగారిని ఆశీర్వదించే విధంగా ''గెలుపునీదే'' అని.

ఈ నాటకం హైద్రాబాద్‌లో జరిగిన ''అఖిల హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సమితి'' ప్రథమ సమావేశ సందర్భంలో మొట్టమొదటి ప్రదర్శన జరిగింది. ఈ ప్రదర్శనకు ఎన్నో ప్రశంసా వర్షాలు కురిశాయి. ఆనాడు జనతాకళామండలి పేరు తెలంగాణమంతటా మార్మోగింది. ఈ నాటకాన్ని ఎన్నోవందలసార్లు ప్రదర్శించారు. అనేకచోట్ల ఈ మండలిని చూసి స్ఫూర్తి చెందిన యువకులెందరో ఔత్సాహిక నాటక సంస్థలను నెలకొల్పారు. దీనితో తెలంగాణలో నాటకోద్యమానికి బ్రహ్మాండమైన ఊపు వచ్చింది. నరసింహారావుగారు ఆలిండియా రేడియోలోచేరి దాదాపు ఏడు సంవత్సరాలు హైద్రాబాద్‌లో ఉన్నారు

గ్రామంలోగల యువకులను జాతిమతభేదమే గాక, అంతస్థు భేదంకూడా లేకుండా నరసింహారావుగారు చేరదీశారు. గ్రామవెలుగు నాట్యమండలి అంటే

జాతి, మత, వర్గ రహితమైన ఆదర్శయువ సమాజంగా ఆరోజుల్లో రూపు దిద్దుకుంది. రేపాలలోని ప్రజల కష్టసుఖాలనూ, గ్రామీణ సమస్యలనూ అర్థం చేసుకున్న రావుగారు ఆ సమస్యల ఆధారంగానే తన నాటక రచన సాగించారు. నిత్యజీవితంలో అనుభవిస్తున్న విషయాలనే రంగస్థలంపై ప్రదర్శించే అవకాశం కలిగేసరికి సునాయాసంగా, అతిసహజంగా గ్రామీణ ప్రజలను ఎంతో ఆకట్టుకునేట్టుగా నాటకాలనురచించి ప్రదర్శించే వారు. సమస్యా ప్రధానమైన ఇతివృత్తాలనే తననాటక రచనకు స్వీకరించే నరసింహారావు గ్రామీణ ప్రాంతాలలోని నటులను, వారి నటనా సామర్థ్యాలనూ దృష్టిలో ఉంచుకునికూడా నాటకరచన చేస్తూండటంవల్ల నాటకాలు రక్తికట్టటం సులభమైంది. నాటకరచనకు స్వకపోలకల్పితాలయిన ఊహాలోకాలలోని విషయాలను కాకుండా, అచ్చమైన గ్రామసమస్యలనూ, గ్రామీణులపాత్రోచిత భాషనూ, మాండలికమైన యాసనూ, జానపదుల పలుకుబడులనూ, ఉపయోగించేవారు. ఆ పరిసర ప్రాంతాల ప్రజలకు ఈ నూతన ప్రయోగాలన్నీ ఎంతో నచ్చాయి. ఆంధ్ర నాటక రంగంలోని అనేకమంది పెద్దలు ఈ ప్రదర్శన చూసి ఈ యువనట బృందాన్ని ఆశీర్వదించారు. ఎంతోమంది ఇతోధికంగా అనేక హంగులను కూర్చి పెట్టారు. గ్రామస్థులు అభిమానంతో మరిన్నిహంగులు సమకూర్చారు. ఉన్నతాధికారులు, వెండితెర తారలు,సినీ దర్శకులు వీరి ప్రదర్శనలను చూసి ప్రశంసించి, ఎన్నో ఆశీర్వాదాలనిచ్చారు. నాటకరూపంలో తమకు తెలియని ఎన్నో సమస్యలను, వాటి పరిష్కారమార్గాలనూ చూసి గ్రామీణ జనం చైతన్యవంతులయారు.

ఈ గ్రామ వెలుగు నాట్యమండలి నిర్వర్తించినది బాహ్యదృష్టిలో నాటకరంగంగా అన్పించినా, అనేక సాంఘిక సమస్యలకు ఇది పరిష్కారం చూపింది. విభిన్నమైన రాజకీయ దృక్పథంగలవారు ఇందులో సభ్యులు. ఐనా ఈ సమాజంలోని విభేదాలకు తావీయకుండా మెలిగేవారు. ప్రజాస్వామ్యానికీ, ప్రజానీకంలో కలిగిన సాంఘిక చైతన్యానికీ ఈ నాట్యమండలి చేసిన సేవలే కొనియాడదగినవి రాజకీయంగాకూడా ఎంతో సంచలనం రేపుతున్న నరసింహారావుగారి నాటకాలనూ, ఆయన గ్రామాభ్యుదయంకోసం నెలకొలిపే కార్యక్రమాలనూ, ఎంతో ప్రశంసిస్తూ, తనకెన్నిపనులున్నా తనెంతపెద్దహోదాలో ఉన్నా తప్పనిసరిగా తిలకించి, సమీక్షించేవారొకరుండేవారు. వారే సాక్షాత్తూ ఇప్పటి మన ప్రధానమంత్రి. అప్పటి (١٩٦٥) ప్రభుత్వ న్యాయ, జైళ్ళ శాఖామాత్యులు శ్రీ పి.వి. నరసింహారావుగారు. ఈ రచయిత వ్రాసిన

చాలానాటకాలకు పి.వి. పీఠికలు వ్రాశారు. తమ 'కాకతీయ' పత్రికలో నరసింహారావుగారి ప్రదర్శిత నాటకాలను సమీక్ష చేసేవారు.

కె.యల్. నరసింహారావుగారి నాటకరచనా వ్యాసంగాన్ని పీఠికలో గోరాశాస్త్రిగారిలా వివరించారు. ''తాత్కాలిక పరిస్థితిని ఇతివృత్తంగా తీసుకుని విశ్వజనీనమైన మానవ విలువలను జోడిస్తూ, దృశ్యకావ్యాలను రూపొందించటం శ్రీ కె.యల్. కే చెల్లింది. రాజకీయపు సమస్యలను కూలంకషంగా అర్థంచేసుకుని.. బిగువైన ఇతివృత్తాలతో వాటిని మానవత్వపు విలువలలోనికి మార్చటం, మారుస్తూ సహజత్వాన్ని పోషించటం ఇవన్నీ మామూలు విషయాలు కావు. సున్నితమైన హాస్యం. గాఢమైన ఆవేదన వీరి నాటకాలలో మనల్ని కదిలిస్తుంది. వీరి నాటకాలలోని గ్రామీణ భాష, గుండెలను హత్తుకుంటుంది. దాంతో ప్రచార నాటకానికి సాహిత్యస్థాయి వచ్చింది. సింబాలిజాన్ని కె.యల్. అత్యద్భుతంగా వాడుకుంటారు. సంభాషణలు చురుగ్గా నడుస్తాయి. వెయ్యి ప్రచార గ్రంథాలు వ్రాసినా వివరించలేని అసలు సమస్యలను నాటక ప్రక్రియద్వారా శ్రీ కె.యల్. ఆబాలగోపాలానికీ అర్థమయ్యేట్టు చేస్తున్నారు.'' అంటు ప్రశంసించారు.

నాటకరచనారంగంలో ఇంత ప్రశంసాపాత్రులైన నరసింహారావు గారు ప్రత్యేకించి ఎన్నో గ్రామీణ నాటకాలను రచించారు. వీరు రచించిన ముఖ్యమైన గ్రామీణ నాటకాలలో ప్రదర్శనా సౌలభ్యంచేతా, ఇతివృత్తపు బిగువుచేతా, ఎంతోమంది సాహిత్య విమర్శకులచేత అభినందించబడినవి అవటంచేతనూ కొన్నినాటకాలు వారికీ, సామాన్యుడి జీవితానికీ చాలా ప్రసిద్ధిని తెచ్చిపెట్టాయి. అలాంటివాటిలో ముఖ్యమైనవి గెలుపునీదే, అగ్నిపరీక్ష, కొత్తగుడి, భారతి, అడుగుజాడలు మొదలైన నాటకాలు.

**గెలుపు నీదే :** ఈ నాటకం సాయుధ పోరాటం పేరుతో సంఘానికి హింసాప్రవృత్తిని నేర్పే అలవాటును ఖండిస్తూ వ్రాశారు. అలాంటి స్వార్థపూరిత పోరాటాలవల్ల గ్రామీణ ప్రాంతాల్లో జరిగిన హింసను కళ్ళకుకట్టినట్టు వివరించారు. ఈ నాటకం వందసార్లకుపైగా ప్రదర్శించబడింది.

**అడుగుజాడలు :** గ్రామాలలో నివసించే ప్రజలకు ప్రభుత్వ ప్రణాళికల్ని వివరిస్తూ, శ్రమశక్తిలోని పరమార్థాన్ని నిరూపించేవిధంగా ఈ నాటకాన్ని రచించారు. ఈ నాటకం గ్రామీణప్రాంతాలలో చాలాసార్లు ప్రదర్శింపబడి ఎందరో సాహిత్య విమర్శకుల మన్ననలందుకున్నది.

**కొత్తగుడి :** నాగార్జునసాగర్ లాంటి ప్రాజెక్టులతో గ్రామీణ జీవితాల్లోనూ, గ్రామీణ ప్రాంతాల్లోనూ, వస్తున్న మార్పులను వాస్తవికంగా చిత్రించారు. ఈ నాటకం రేపాల పరిసర ప్రాంతాలలో ఎన్నోసార్లు ప్రదర్శింపబడుతూ విజయవంతంగా సాగిపోతున్నది.

**అగ్నిపరీక్ష :** భారతదేశంపై చైనాదాడిని నిరసిస్తూ గ్రామీణుల జీవితంలో యుద్ధంపట్ల మనోభావాలను యథాతథంగా చిత్రించారు. ఈ నాటకానికి శ్రీ గోరాశాస్త్రిగారూ, శ్రీ పి. వి. గారూ అభినందనలు తెలిపి, నాటకం అచ్చయి వెలుగులోకి రావటానికి ఎంతో కృషి చేశారు.

**భారతి :** ఈ నాటకాన్ని రాష్ట్ర ప్రభుత్వం కోరికపై నక్సలైట్ల ఘాతుకాలను ఖండిస్తూ రచించారు. గ్రామీణ ప్రాంతాలలో నక్సలైట్ల ఘాతుకాలవల్ల జరిగే ధన, ప్రాణ నష్టాలను బాధగా, హృదయవిదారక కరుణరసాత్మకంగా తెలియచేశారు. రచయితకెంతో పేరుప్రఖ్యాతులను తెచ్చిన ఈ నాటకం ప్రభుత్వంచేత ప్రశంసింపబడి ఇప్పటికీదాదాపు రెండువందలసార్లకుపైగా ప్రదర్శించబడింది.

**గెలుపునీదే :** నరసింహారావుగారు దాదాపు యాభై నాటకాలను వ్రాసినా పైన పేర్కొన్న నాటకాలు ఒక ప్రత్యేకతను సంతరించుకున్నవి. ఎన్నేళ్ళయినా, ఎన్నాళ్ళయినా ఈ నాటకాలు రసజ్ఞులైన పఠితల (ప్రేక్షకుల) హృదయపీఠాలలో ఎన్నటికీ వాడిపోని సుగంధ కుసుమాలు. ఈ నాటకాలలో ఆయన గ్రామీణ సమాజపు సర్వంసహా సమస్యలను చర్చించటమేగాక, లోతులకువెళ్ళి అక్కడి కల్మషాలను వెలికితీయటానికి చీకటిలో చిరుదీపం వెలిగించటానికీ ప్రయత్నించి సఫలీకృతులైనారు.

నరసింహారావుగారి మొదటి నాటకమైన 'గెలుపునీదే' లోని ఇతివృత్తం ఈ విధంగా ఉంది. గ్రామంలోని మోతుబరి రైతు రాఘవయ్యకు ఇద్దరు కొడుకులు. పెద్దకొడుకు డాక్టర్ విశ్వం వైద్యవృత్తిలో ఉండి పేదప్రజలకు వైద్యంచేస్తూ వారి బాగోగులను గమనిస్తుంటాడు. మనిషిగా పుట్టినవారందరూ ఎవరి పనులు వారే చేసుకోవాలనీ, మనిషికి మనిషే సేవకుడు కారాదనీ ఇతని వాంఛ. మనుషులంతా ఒక్కటేననీ, కష్టించి దున్నేవానిదే భూమి అని ఇతని వాదం.

రెండవ కొడుకైన ప్రభాకర్ ఆనాటి కమ్యూనిస్ట్ సిద్ధాంతాలకాకర్షింపబడి ప్రజాసేవ చేయాలని కమ్యూనిస్ట్ సంఘంలో చేరుతాడు. తుపాకీతోనే మనుషులు బాగుపడతారనీ, తమ సిద్ధాంతాల వల్లనే జనాన్ని బాగుచేయగులుగుతామనీ అతని నమ్మకం. కుహనావాదులైన బ్రహ్మం, పుష్పలను కమ్యూనిస్ట్ సంఘంలో చేర్చుకుని

ఆ తరువాత జరిగే అనర్థాలకు తానే కారకుడవుతాడు. గ్రామంలోని అమాయకులనూ, కండపుష్టికలిగి దోపిడీలు, దొంగతనాలు చేయగలిగినవారిని తనదళంలో చేర్చుకుని వారితోఅడవుల్లోనూ, రహస్య ప్రదేశాల్లోనూ ఉంటారు. సమసమాజస్థాపనకు ధనవంతులు అడ్డంకులనీ, పేదలు బతకాలంటే బూర్జువా వ్యవస్థ నాశనంకావాలనీ ఇతని వాదం. 'ప్రజా సేవాసంఘపు' ముసుగులో సిద్ధాంతాల పేరిట దొంగతనాలూ, పార్టీ ఫండ్ పేరిట ఎన్నో అకృత్యాలూ చేయిస్తుంటాడు. తమ కార్యకలాపాలను అడ్డుకునే ఊళ్ళోని వారిని వర్గశత్రువులనీ, తమసిద్ధాంతాలకు వ్యతిరేకులనీ వంకలుబెట్టి ప్రజాసేవపేరుతో పార్టీ అండదండలతో దౌర్జన్యంగా ఎన్నో కఠినశిక్షలపాలు చేస్తుంటాడు. కాళ్ళుచేతులు తీసేయటం, కళ్ళూడబెరడం, ఇళ్ళుకూల్చడం బిడ్డాపాపలను చంపటం మొదలైనవి ఆ శిక్షలోని భాగాలు.

తనతండ్రి ఆస్థంతా పార్టీ ఫండ్‌కు విరాళంగా ఇవ్వాలనీ లేకపోతే హైకమాండ్ ద్వారా ఆస్థినంతా జప్తుచేయించి, భూములను స్వాధీనం చేసుకుంటామని తండ్రిని బెదిరించి వెళతాడు. ఆ బెదిరింపులకు లొంగని తల్లి దండ్రులను కాల్చి చంపుతాడు. వక్ర సిద్ధాంతాల మత్తులో అన్నావదినలుంటున్న ఇంటికే నిప్పంటిస్తాడు. అన్న తనకు వ్యతిరేకి అనీ పార్టీలోని పుష్ప అనే సభ్యురాలితో అతనిమీద నీతిమాలిన అభాండాలు వేయిస్తాడు. ప్రజాకోర్టులనీ, ప్రజాసేవా సంఘపు సిద్ధాంతాలనీ ఎంతోమందిని నిర్దాక్షిణ్యంగా బలితీసుకుంటాడు. ఎందరో పార్టీనుండి పైదొలుతామన్న నేరానికి, మరొకరిచే చంపిస్తాడు. అమాయకులను దోచి డబ్బుకోసం తమలో తామే పోట్లాడుకుని పారిపోబోతున్న బ్రహ్మం, పుష్పలను చూస్తాడు ప్రభాకర్. బ్రహ్మాన్ని కాల్చబోగా పొరపాటున పుష్ప మరణిస్తుంది. బ్రహ్మాన్ని పోలీసులు పట్టుకుని అన్యాయంగా దొంగిలించిన ఆస్థులను స్వాధీనం చేసుకుంటారు. ఆ ఘర్షణలో గాయాలై పోలీసుల బారినుండి తప్పించుకుని అన్నను చేరుతాడు. పశ్చాత్తాపంతో క్షమించమని బ్రతిమాలి, పోలీసులుపట్టుకోవటానికి రాబోతే తన పిస్టల్‌తో తానే కాల్చుకుని మరణిస్తాడు. అంతటితో నాటకం సమాప్తమవుతుంది.

ఈ నాటకాన్ని ప్రతీకాత్మకంగా చిత్రించారు రచయిత. కథానాయకుడు విశ్వంఅప్పటి మూఢాచారాలతో, ఛాందసభావాలతో విసిగిపోయి అభ్యుదయంకోసం ఆరాటపడుతున్న ఆనాటి యువకులకు చక్కటి ప్రతీక. మనుష్యుల్లో బీదాగొప్పా అనే వర్గభేదంనశించినప్పుడే ప్రపంచదేశాలకు దీటుగా భారతదేశం అభివృద్ధిని సాధించగలదని ఇతని విశ్వాసం. సమాజంపై అందరికీ

అంతో ఇంతో సదభిప్రాయమే ఉంటుంది. ఎటొచ్చి వాటి సాధనలోనే ఎన్నో అడ్డంకులు ఎదురవుతాయి. చాలా కొద్దిమందికి మాత్రమే తమ లక్ష్యసాధనకోసం జీవితాంతం కష్టపడగల ఆత్మస్థైర్యం ఉంటుంది. అభివృద్ధిని కాంక్షించే ఉపన్యాసాలెన్నయినా ఇవ్వవచ్చుగానీ, సమాజాభివృద్ధికోసం ఏ ఒక్క కార్యాక్రమాన్ని చేపట్టినా దాన్ని సఫలం చేయటానికి జీవితకాలం శ్రమించవలసి ఉంటుంది. ఆ శ్రమ జీవనానికి అలవాటుపడినవారే అవతలివారి శ్రమను గుర్తించి మహనీయులవుతారు. ఆ కోవలోనివాడే విశ్వం. తమ పనులుతామే చేసుకోవాలనీ, తమ భూమిని తమింటివారే సాగుచెయ్యాలనీ విశ్వం ఉద్దేశం. అందుకోసం తాను ఎంతోకష్టపడి సాధించిన డాక్టరు వృత్తినే వదులుకుని తమ భూమిని సాగుచేయటానికి పూనుకుంటాడు.

కూలీ అనే మనిషిపుట్టలేదనీ ఎవరి పనులు వారు చేసుకునే శక్తియుక్తులు లేక, అవి పుష్కలంగా ఉండి, కేవలం డబ్బులేని బీదవారిని సాటి మనుషులనైనా చూడకుండా, తమ స్వార్థంకోసం పశువులకన్నా హీనంగా హింస బెడుతూ వారి శ్రమనుపిండుకుని తమలాభంలో వెయ్యోవంతయినా వారికివ్వటానికి ఇష్టపడని ఆనాటి భూస్వాములకు విశ్వం సింహస్వప్నం. ఒక దశలో కూలీని కొడుతున్న తండ్రిని వారించబోయి పొరపాటున తానే ఆ దెబ్బలుతిని, గాయపడిన సందర్భంలో తండ్రితో '' ఇక మనింట్లో కూలీలు ఉండరు నాన్నా! దున్నేవానిదే భూమి, మనదిసుఖపడే పాట్లా! అతనిది కష్టపడే పాట్లా నాన్నా! కష్టపడి పనిచేయకుండా తిండెలా వస్తుంది. మన తాతలు ముత్తాతలు నాగలిబట్టి వ్యవసాయం చేసినవారే. మరి మనమెందుకిలా మనపనిని ఇతరులచేత చేయిస్తూ సోమరిపోతులమైనాము..'' అంటూ ఆవేదనగా ప్రశ్నించి, '' కూడుబెట్టే భూములే పోతుంటే ఎందుకీ వృత్తి?'' మనలో ఎవరో ఒకరు నాగలిబట్టి దున్నుతుంటే ఈ వైద్యవృత్తిలో కాలం గడుపుదామనుకున్నాను. కానీ ఇక లాభంలేదు.'' అంటాడు విశ్వం. ఆనాడున్న స్వార్థపరులైన బూర్జువాలకు ప్రతినిధిలా ఉన్నతండ్రిని కాలానుగుణంగా మారాలని సూచించి, ఆయనలో మంచి మార్పును తీసుకురాగలుగుతాడు విశ్వం. చిన్నవాడైనా గొప్పగా ఆలోచించే విశ్వం మాటవిని చివరకు రాఘవయ్యే, నాగలిబట్టి దున్ని వ్యవసాయం చేస్తుంటాడు.

కడుపునబుట్టిన బిడ్డలే తమనుక్రూరంగా హింసిస్తూ ప్రాణాలను బలితీసుకునే రాక్షసులవుతుంటే, ఆనాటి ఘోరహింసాకాండకు సాయుధ పోరాటపు ముసుగులో బలైపోయిన ఎంతోమంది కన్నతల్లులకు ప్రతీక విశ్వం తలి వెంకమ్మ.. ఇక ప్రతినాయకుడైన ప్రభాకర్ విషయానికి వస్తే

రక్తపాతంజరిపైనాసరే, అధర్మమార్గమైనాసరే తాననుకున్నపనిని సాధించటానికి ఎంతకైనా వెనకాడని మనస్తత్వం గలవాడు. ప్రజాస్వామ్యం పేరిట, ప్రజాసేవక పంతో, వక్రసిద్ధాంతాన్ని జనంమీద రుద్దటానికి అతను చేయని ఘోరాలు లేవు. సిద్ధాంతాల ముసుగులో దేశాన్ని ఉద్ధరిస్తున్నాననే గుడ్డినమ్మకంతో ఎంతోమంది అమాయకులను తుపాకికి బలిచేస్తాడు.

సాయుధ పోరాటపు రోజుల్లో పెనుతుఫానులా విజృంభించిన కమ్యూనిస్ట్ పార్టీ సిద్ధాంతాల ఆకర్షణలోపడి సుడిగాలిలో గడ్డిపోచల్లా, సామాన్య జనం అల్లాడిపోయారు. కొత్త ఒక వింతలా ఆ పార్టీలోచేరి దేశాన్నిబాగుచేయాలనీ సమసమాజస్థాపనకు కృషిచేయాలనీ జనం, ముఖ్యంగా యువకులు ఉవ్విళ్లూరుతుండేవారు. అసలైన పార్టీ ఉద్దేశ్యాలను, సిద్ధాంతాలను సరిగా అవగాహన చేసుకోలేని చాలామంది కూడా అదే ముసుగులో తమ దుర్మార్గాన్ని, అకృత్యాలనూ, పార్టీపేరుతో ముడిపెట్టి తమతప్పులు కప్పిపుచ్చుకునేందుకు ప్రయత్నించేవారు. ఐతే ప్రజలే వీరి సిద్ధాంతాలను ఒప్పుకోక, తరిమి తరిమి కొడతారు. ఒకవంక ప్రభుత్వం వీరికోసం గాలిస్తుంటుంది. ప్రజలూ కన్పిస్తే కాల్చివేయాలని చూస్తారు. అలా ఎంతోకాలం అడవుల్లోనూ, రహస్య స్థావరాలలోనూ, తలదాచుకోలేక రెంటికీ చెడిన కుహనాసంఘపు యువకులకు ఈ ప్రభాకర్ చక్కటి ప్రతీక.

ఎనిమిది రంగాలుగా సాగే ఈ నాటకం వెయ్యిసార్లకుపైగా ప్రదర్శించ బడింది. విద్యార్థి దశలో కమ్యూనిస్ట్ సిద్ధాంతాలను చదివిఎంతో మురిసిపోయిన నరసింహారావుగారు ఆ సిద్ధాంతాల ముసుగులో అన్యాయంగా బలైపోయిన తన ఆత్మీయులను బంధువులను తలచుకుని ఎంతో కుమిలిపోయారు. తను చదివిన సిద్ధాంతాలకు కళ్లముందు జరుగుతున్న ఘోరరాద్ధాంతాలకూ పొత్తుకుదరక ఎంతో మానసిక వ్యధకు గురై కేవలం, ఒకటిన్నర రోజులలోనే ఈ నాటకాన్ని రచించారు.

ఒకే ఇంట్లోని ఇద్దరన్నదమ్ములనే తన నాటకంలో నాయుక, ప్రతి నాయకులుగా తీసుకోవటానికి కారణం వీరిష్టపడే నిజమైన సిద్ధాంతానికీ, అవిపరిణమించిన విధానానికీ నిదర్శనంగా భావించటమే. ప్రజా సేవకసంఘం పేరుతో బ్రహ్మం, పుష్ప, ప్రభాకర్‌ల బృందంచేసే దుష్కృత్యాలకు హద్దుల్లేవు. వారి పనులకు అడ్డం వచ్చినవారిని ప్రజాకోర్టులో తీర్పనిచెప్పి చంపటం, పార్టీఫండ్, పేరుతో అందరూ విరాళాలివ్వాలని బెదిరించటం, చివరకు తల్లిదండ్రులనైనా చూడకుండా క్రూరంగా హింసించి చంపటం వంటివి వారి పనులకు సాక్ష్యాలు.

ఈ నాటకంలో 'భీభత్సం' ప్రధానరసం. దానికి అంగిరసాలుగా హాస్య కరుణరసాలు ఆవిష్కరింపబడ్డాయి. నాటకమంతలా పాత్రోచితభాషద్వారా, హాస్యరసం అంతర్లీనంగా ఉంటుంది. హాస్యానికి ముఖ్యంగా చెప్పికోవలసింది 'చెవిటి లింగన్న' పాత్ర. విశ్వం కుటుంబాన్ని కష్టసుఖాలలో తోడునీడలా వెన్నంటి ఉండి, వారి బాధలను పంచుకునే వెన్నలాంటి మనసున్న మంచిపాత్ర. లింగన్న విశ్వంతో

'' ఏదో సతంతర మొచ్చింది, సతంతర మొచ్చిందంటే ఊరంత

ఎతికిన్నే, యాడదొరకలే, ఆనక్కి తెచ్చింది. అదంటేందో

మనతో ఎట్టి చేపిచ్చుకునే దొరోళ్ళూ, గొర్లూ, మేకపోతులూ

తీస్కపోయేష్ఛ జమీందోర్లు పోతరని''. ఇంకోచోట స్వామి చదువుచెబుతుంటే 'సంఘం' అనే పదానికి వత్తిపలకడు.

లింగ : సంగంల వతాడుందే ?

స్వామి : వత్తు పలకాలి. లేకుంటే తప్పన్నమాట.

లింగ : మరి సంగంల తప్పగాకుంటే, వప్పేడుందేం ?

అంటూ చిన్నపాత్రలచేత చిన్న చిన్న సంభాషణలతో ఎంతో అర్థం స్ఫురించేట్టుగా రచించటం రచయిత శిల్పసామర్థ్యానికి ఉదాహరణ. లింగన్న స్వచ్ఛమైన జానపదుడు. మనసులో ఉన్న విషయాన్ని ఉన్నట్టుగా ఏ భాషాడంబరం లేకుండా వ్యాకరణ విధులను పాటించక ఉన్నవిషయాన్ని ఉన్నట్టుగా స్వతంత్రంగా చెప్పగలగడం జానపదులకు దేవుడిచ్చినవరం. లింగన్న భాగవత కథను జానపదగీతంలా ఆలపిస్తాడు.

లింగః- రెండు గొంతులతో పాడతా.

''యాటామార్గము మనమూ- ఎలదిరోపోయొత్తు ఆదిలచ్మీ, యాటా మార్గము మనమూ-ఎన్నడూ ఎరగమూ పాననాథా. గిరగిరా తిరిగొత్తు - చింతానీకెందుకే ఆదిలచ్మీ''. ఈ విధంగా సాగుతుంది లింగన్నపాట. నాటకంలో ఇంకోకసారి లింగన్న పాత్రే ''సంగమేం సంగం. కాకులగొట్టి. గద్దలకేసే సంగం. నీవొలెవ్వంది లిచ్చి రోగాలునయ్యం చేత్తున్నదా? బల్లుపెట్టి సదువులు సెప్పిత్తున్నరా? ఏం పజాదోవులన్నా, వంచి వంచోల్లనందరినీ దొంగోతుపట్కపోవటం. సావనూకటం. సచి.నోలంత ఎసుంటివుడుసులే.

వరాలమూటలుగాదె? ఎన్నిలచ్చలిచ్చినా ఈ బూమ్మీద గట్టాంటి మడుసులు పుడుతారే'' అని అమాయకంగా ప్రశ్నింపచేస్తారు రచయిత. పోరాటంపేరుతో తన ఆత్మీయులను హతమార్చారన్న బాధను ఈ రకంగా పాత్ర చేత చెప్పిస్తాడు.

గెలుపునీదే నాటకంలో భీభత్సాన్ని కళ్ళకు కట్టినట్టుగా వర్ణించారు రచయిత. అమాయకులను తుపాకికి బలి చెయ్యడం కళ్ళుపెరికెయటం. కాళ్ళు చేతులూ విరిచేయటం కన్నవారనిఐనా చూడకుండా హతమార్చటం. ప్రజలకోసం, ప్రజాకోర్టులో తీర్పుల పేరిట, ప్రజాసంక్షేమాలపేరిట వీరు చెయ్యని అకృత్యాలు లేవు. వీరి దౌష్ట్యాలకు బలైపోయిన ఎందరో నిస్సహాయులమొరలను బాధగా చూపించారు రచయిత. ప్రజాకోర్టుల తీర్పులీ విధంగా ఉంటాయి.

రావూరివెంకయ్యః- మొన్న మనవాండ్లను పోలీసులకు పట్టించటానికి ప్రయత్నించిన తొత్తు. శిక్ష. చేతులు నరకటం.

సామ్యవాదపు రాజారావుః- మన పాలసీని ఖండిస్తూ, వెధవ నిర్మాణ కార్యక్రమాలంటూ, గాంధీ అడుగుజాడల్లో నడిచే ప్రబుద్ధుడు. కనుగుడ్లు తీయటం, చెట్టుకు విరిచికట్టి, తుపాకితో కాల్చి చంపటం.

వేణీధరపు రంగయ్యః- మనం మహిళలను సంఘంలోనికి తీసుకు వస్తుంటే హేళనచేసిన దుర్మార్గుడు. కత్తితోగాట్లు పడేటట్లు పొడిచిచంపటం.

చోడవరపు రంగమ్మః- పోలీసుల కళ్ళలో కారంచల్లాల్సిందిపోయి మన కళ్ళలోనే చల్లుతాననే నీచురాలు. చిన్నశిక్షే, ఏక్‌దమ్మున తలనరకటం.

ఘరానా సోమప్పః- మన ప్రజాసేవ సాగనియ్యకుండా పాటలూ, పద్యాలూ వ్రాస్తూ, ప్రచారం చేస్తున్న ద్రోహి. వాడికళ్ళు తొలగించి, చావమోది రావటం.

ఇలాంటి శిక్షలు వింటుంటే భయంతో వళ్ళుగగుర్పాటు చెందుతున్నా ఇంతకన్నాఘోరమైన శిక్షలు ఆనాడు సర్వసాధారణం. ఈ నాటకంలోని పాటలుకూడా సంభాషణారీతులకు అతికేట్టుగా, భావస్ఫోరకంగా ఉన్నాయి. జలతాకళామండలి సభ్యులూ, దర్శకులూఐన శ్రీ వారణాసి వెంకటనారాయణ శాస్త్రిగారూ, సభ్యులైన డాక్టర్ ఆలవాల వెంకయ్యగారూ ఈ నాటకానికి పాటలు వ్రాశారు. ఈ నాటకంలో పదిగేయాలున్నాయి. వాటిలో ఆనాడు ప్రజలందరినోళ్ళలోనూనలిగిన పాటలు ఇవి.

(1) సంగమయా సంగమూ - మాయదారిసంగమూ.

(2) సంగంలజేరితో ఓరన్న బల్ సర్దార్లూ ఐతరే లింగన్నా.

(3) ప్రజాసేవ ప్రజాసేవ వదలకురా ఓ పేదా.

(4) మేడలన్ని కూలగొట్టి గూడలన్ని నొప్పిబుట్టె.

మొదలైన పాటలు బహుళ ప్రజాదరణ పొందినవి. ఆనాటి సాయుధ పోరాటపు ముసుగులో, పార్టీ సిద్ధాంతాల పేరుతో, జరిగే ఘోరహింసాకాండకు ఈ పాటలు నిదర్శనాలుగా నిలిచాయి.

ఇంకా ఈ నాటకంలో చనిపోయిన కుటుంబాల వారి ఆర్తనాదాల్లో, పేదప్రజల ఆక్రందనలలో కరుణరసం వెల్లువై ప్రవహించింది. బలవంతంగా సంఘంలో చేర్చుకోబడి ఆ ఘోరాలను చెయ్యలేక కుమిలి కుమిలి ఏడ్చే 'పెంటయ్య' లాంటి పాత్రలు కరకు గుండెలను సైతం కరిగించేవిధంగా ఉన్నాయి. అమాయకుడయిన పెంటన్న సాటి సభ్యుడైన సుబ్బన్నతో తన బాధను హృదయవిదారకంగా వెళ్ళబోసుకుంటాడు. ''చుజ్జిగా ఏం సంఘంరా ఇది? ఎరక్క చేరిన, యాడబోయిన గంటసేపుండేది లేదాయె. సరిగ్గా బువ్వదినేది లేదాయె. చెంటర్లు కాచి, కాచి, మేడలు కూల్చి, కూల్చి, మడుసుల కోసి, కోసి తుపాకీలొట్టలు మోసి మోసి నా ఒల్లంతా పాడైందేహే'' అంటూ ఆక్రోశిస్తాడు. మరోపాత్ర '' ముందుగల పోలీసోల్లు పట్టుకోరని అబద్దమాడితిరాలీ, ఇయ్యాల్లే మల్లింట్లంటరు. ఓటీసెర్రైపోతాండదిగదా? మొన్న ఓ బస్సురా, బస్సు బర్రున పోతాంటె ఈ దుల్లంగపడి మలుపులు దిరుక్కుంట ఓటే ఉరుకుడు. బస్సట్టనే ఎంటబడి లగెత్తుతాంటె గబాల్నబోయి, కొచ్చెటిరాయిమీనబడితే సూడాలీ ముక్కంత పచ్చడాయె''- అని బాధపడతాడు.

గెలుపునీదే నాటకం యొక్క అర్థ ప్రకృతులను ఈ విధంగా వివరించవచ్చు. ప్రధాన కథకు మూలభూతమైన కథను సూచించటం బీజావాపనం. భూస్వామి రాఘవయ్యనూ, అతని ఇద్దరు కొడుకులయిన డాక్టర్ విశ్వం, ప్రభాకర్‌లను వారివారి ఉద్దేశ్యాలను, వారి ఇంటి పరిస్థితినీ సూచ్యప్రాయంగా తెలియచేసారు రచయిత. కాబట్టి మొదటిరంగం కథారంభానికి బీజమై ముఖసంధి ఏర్పడింది.

బీజరూపకమైన కథకు మరిన్ని సంఘటనలను జోడించగా ఏర్పడేది బిందువు. రెండవరంగంలో ప్రతినాయకుడు ప్రభాకర్ రహస్య

సమాలోచననూ వారు ముందు ముందు చేయబోయే కార్యక్రమాల ప్రణాళికలు సిద్ధంచేసుకోవటాన్నీ మూడవరంగంలో నాయకుడైన విశ్వం మీద అపనింద మోపటానికి ప్రయత్నించిన పుష్ప కారణంగా నాటకం క్రమంగా పతాక, ప్రకరిలకు అనుగుణంగా మారింది. ఐదు ఆరు రంగాలలో తమ కృత్యాలతో భయపడే జనాన్ని చూసి, తమ పనులను పునరాలోచించుకునేట్టుగా సుబ్బన్న, వెంటన్నల చేత కథను అన్యాయానికి అంతంగానూ, కథానాయకునికి విజయం చేకూర్చే విధంగానూ మలచటాన్ని సూచిస్తూ, నియతాప్తిని ప్రదర్శించి, అవమర్శసంధికి అనుగుణంగా మలచారు.

చివరిరంగాలైన ఏడు, ఎనిమిది రంగాలలో పూర్తిగా ఫలాగమనాన్ని నిర్దేశించి, దుష్టశిక్షణ, శిష్టరక్షణలతో సమాప్తానికి సన్నద్ధమయింది. దుష్టుడయిన ప్రభాకర్ తన అన్నకాళ్ళపై బడి గెలుపునీదే నని, తనను పట్టుకోవటానికి వచ్చిన పోలీసులకు చిక్కకుండా, తన పిస్టల్‌తో తనే కాల్చుకుని మరణించడంతో ఈ నాటకం సమాప్తమవుతుంది.

· తెలుగులో నాటకరచనఐదురకాలుగా సాగుతుంది. అవి. కథాప్రధానం, సాహిత్యప్రధానం, సమస్యాప్రధానం, పాత్రప్రధానం, మనస్తత్వనిరూపణ ప్రధానం. ఈ ఐదు విభాగాలలో నరసింహారావు నాటకాలు చాలావరకూ సమస్యాప్రధాననాటకాలే. గెలుపునీదే లో ఒక తాత్కాలిక సమస్యను ఇతివృత్తంగా ఎన్నుకొని మలచబడింది కథ. తాత్కాలిక సమస్యకు శాశ్వతమైన సాహిత్య విలువలను జోడించి రచనలు చేయటం స్వాతంత్ర్యానంతరం సర్వసాధారణం. మామూలుగా ఒక పరిస్థితిని తన నిజ జీవితంలో చూసి చలించని మనిషి. అదే పరిస్థితిని ఒక నాటకంలో చూసి తదనుగుణంగా స్పందించటం రసావిష్కారానికి ప్రతీక. అందుకే రసప్రధానమయిన సన్నివేశాలను చూసి ప్రేక్షకులు ఎంతో స్పందిస్తారు.

"' ఒంటినిండా బట్టలుకూడా లేకుండా చింపిరి జుట్టుతో అసహ్యంగా ఉన్న బిచ్చగత్తె మన దగ్గరికొచ్చి, బిచ్చమడిగితే కసిరి పంపుతాం. అదే సీను కావ్యంలో పెడితే కరుణరసావిష్కరణము జరిగి మన మనసులు కదిలిపోయి కళ్ళలో నీటిచుక్కలు నిండుతాయి. ఇదే జీవితానికీ, కావ్యానికీ ఉన్నతేడా''.[4]

ఇదే విధంగా ఆ పోరాటపు రోజుల్లోని బాధను, ఆవేదనను, రచయిత ప్రత్యక్షంగా అనుభవించి పరిష్కారం కోసం మనస్సును మథిస్తే, ఆ మథనంలోనుండి అమృతంలా వెలువడిన నాటకం గెలుపునీదే. తరతరాల ప్రాచీన

సంస్కృతిని తనలో నిల్పుకుని, కాలానుగుణంగా వచ్చే నూతన మార్పులను తనకనుగుణంగా మార్చుకుని, ముందుకుసాగే సజీవస్రవంతి సత్సంప్రదాయం. భౌతికంగా అయినా, మానసికంగా అయినా ప్రజల్లో కలిగేమార్పు సంప్రదాయానుగుణంగా వచ్చిందయితే అది చిరకాలం నిలుస్తుంది. ఎన్నో కొత్త మార్పులకు శ్రీకారం చుడుతుంది. అలాకాక రాత్రికి రాత్రే విప్లవమనీ, వర్గపోరాటమనీ వ్యవస్థను మార్చాలని చూస్తే మిగిలేది వ్యధేనని చెప్పటానికి ఈ నాటకం చక్కని ఉదాహరణ. ఈ నాటకంలోని ప్రభాకర్ పాత్ర ఆనాటిఎంతోమంది యువకులకు ప్రతీక. పార్టీలసిద్ధాంతాలను చూసి, భ్రమపడి, వ్రాతలకనుగుణంగా ప్రజలగీతలను మార్చాలని ప్రయత్నిస్తే అది వ్యర్థ ప్రయత్నమేనని రచయిత ఈ నాటకంలో ఋజువు చేశారు.

మంచిమార్పు ఎప్పుడూ మనుషుల మనసుల్లో పుట్టి, ఆరోగ్యవంతమైన పసిబిడ్డలా పెరుగుతుంది. అలాగాక బలవంతంగా ప్రజలపై రుద్దబడే సైద్ధాంతిక లక్ష్యాలు 'మంఖిలోపుట్టి పుబ్బలోపోయే' కలుపుమొక్కలేనని చెప్పటానికే నరసింహారావుగారీ నాటకాన్ని రచించారనిపిస్తుంది. మన ప్రాచీన ఆలంకారికులు ఉద్ఘాటించిన సుప్రామాణికమైన సాహిత్యపు విలువలకు గీటురాయిగా ఈ నాటకం నిలువలేకపోయినా, ప్రదర్శనను తెరపై చూస్తున్నా, పుస్తకంగా చదువుకున్నా, రచయిత అనుభవాన్నీ, ఆనాటి చరిత్రనూ, పాత్రల పరిణామాన్ని, చివరగా రచయిత ఇవ్వదల్చుకున్న సందేశాన్ని, అన్నింటికీ మించి, మంచిమానసిక ఆనందాన్ని ఈ నాటకం ద్వారా పొందగలము.

## అగ్నిపరీక్ష

నరసింహారావుగారి అన్నినాటకాల్లాగే ఈ నాటకం కూడా గ్రామీణ నేపథ్యంలోనే సాగింది. చైనావారితో యుద్ధం జరిగే సమయంలో ఈ నాటకం రచించారు. 14-2-63 మాజీ ప్రధాని శ్రీ.పి.వి. నరసింహారావుగారి సమక్షంలో 'రవీంద్ర భారతి' లో ప్రప్రథమంగా ప్రదర్శించబడిన ఈ నాటకం దాదాపు యాభైసార్లకు పైగా ప్రదర్శించబడి విజయవంతమయింది.

దేశభక్తి ప్రధానంగా ఉన్న నాటకాలు తెలుగులో చాలా ఉన్నప్పటికీ కేవలంభక్తితో మాత్రమేగాక, సంస్కరణాత్మకంగా రచించగలగటం నరసింహారావు ప్రత్యేకత. మాతృదేశంపైన అమితమైన భక్తి ఉన్నప్పుడు కేవలం మానసిక భావనతో అది నిరూపణకాదు. ఆ ఆశయసాధనకోసం చేసిన 'కృషి' మాత్రమే ఆ భావాన్ని వెల్లడించగలిగే ఏకైకమార్గం. అప్పుడా అభిమానం

తాత్కాలికంగా వ్యక్తిగతమేఐనా, ఆ రంగంలో కృషి శాశ్వతంగా నిలుస్తుంది. సాంఘిక దురాచారాలవల్ల ప్రజలకప్పడు కలిగిన అంతులేని మనోవ్యధ ఆకాలంలోనివాళ్లకే తెలుస్తుంది. కానీ అదే విషయాన్ని ఇతివృత్తంగా తీసుకుని దానికి సాహిత్యవిలువలు జోడించి, నాటకంగా రూపుదిద్దుకున్న గురజాడవారి కన్యాశుల్కం వందసంవత్సరాలు గడచినా వన్నెతరగకుండా ఉండటంతోనే శాశ్వతత్వానికి గల అపారమైన విలువను తెలియపరుస్తుంది. ఇంతకన్నా మించిన సంస్కరణాత్మకం ఏముంటుంది? సమస్య యొక్క తీవ్రత అంతర్మథనమై హాలాహలంలాంటి శ్రమనోర్చినప్పడే సంస్కరణాత్మకమైన చక్కని పరిష్కారమార్గమనే అమృతాన్ని ప్రపంచానికి నివేదించ గలుగుతుంది.

చైనావారితో యుద్ధం మనకు అగ్నిపరీక్ష అని కాకపోయినా ఆ సమయంలో గ్రామనేపథ్యంలో మారుతున్న ప్రజల మనోభావాలకు తనపరిశీలనాశక్తిని జోడించి, దేశభక్తిని కలిపి, నూతనసిద్ధాంతాలమీద మోజుతో కమ్యూనిజం ఇనపకోరలలో చిక్కువడిన ఆనాటి నవయువకులకు ఆ పార్టీలోని సాధకబాధకాలను వీలైనంత విశ్లేషణాత్మకంగా చూపించిన నాటకమే అగ్నిపరీక్ష.

'''తెలుగులో దేశభక్తినాటకాలు మూడువిధాలుగా ఉన్నాయి. మొదటిది పౌరాణిక నాటకాలు, రెండవది, చారిత్రక నాటకాలు, మూడవది సంఘసంస్కరణాత్మకాలు''. [3] పౌరాణికాలలో రచయితలు ఆయా పాత్రలతోనే స్వాతంత్ర్యాన్ని గురించి, స్వేచ్ఛనుగూర్చి, పరోక్షంగా బోధించేవారు. గాంధీగారి నాయకత్వం మొదలయ్యేదాకా స్వాతంత్ర్యభావ ప్రకటన ప్రచ్ఛన్నంగానే సాగింది. ఆ విధమైన ప్రచ్ఛన్న భావప్రకటనలను పౌరాణికనాటకాలే ఉత్తమ సాధనాలుగా రూపొందేవి. చారిత్రాత్మక నాటకాల విషయానికివస్తే, చారిత్రక వీరుల కథలు కూడా ప్రజల్లో ఉత్సాహాన్ని నింపేవి. శివాజీ, రాణా ప్రతాప్, మొదలైన వీరుల కథలను, బొబ్బిలి యుద్ధంలాంటి సాంఘిక చరిత్రలను రచయితలు నాటకీకరించేవారు. పాఠకులు, ప్రేక్షకులు చారిత్రకనాటకాలను ఎంతో ప్రోత్సహించేవారు. ఫలితంగా నాటకకర్తలు అధికంగా ఈ నాటకాలను రచించేవారు.

సంఘసంస్కరణాత్మకమైన నాటకాలలో కూడా ప్రబోధం కొంత ప్రత్యక్షంగానూ, కొంతపరోక్షంగానూ ప్రారంభమైంది. వీరేశలింగం పంతులుగారి బ్రాహ్మణవివాహం వంటి ప్రహసనాలను కేవలం వినోదానికేగాక, దురాచారాలవల్లా, మూఢనమ్మకాలవల్ల జరిగే అనర్థాలను నిరూపించటానికే రచించారు కేవలం సాంఘిక దురాచారాలను ఖండించటం కోసమే

సంస్కరణాత్మకమైన నాటకాలను రచించిన ప్రసిద్ధులైన రచయితలు ఆ కాలంలో చాలామంది ఉండేవారు. అలాంటివారి కోవలోకే కె. యల్. నరసింహారావుగారు సంస్కరణ ప్రధానమైన ఇతి వృత్తాలతోనే నాటకరచన చేసే రచయితగా పేరు పొందారు.

తెలంగాణా ప్రాంతపు గ్రామాలలో పునర్వికాసానికి వీరు చేసిన నాటక రచనా ప్రయత్నాలు, ప్రదర్శనలూ ఎంత చెప్పినా తక్కువే. ''నిజాం రాష్ట్రంలోని తెలంగాణాలోసాగిన జాతీయోద్యమాల ప్రభావం ఆనాటి సాహిత్యంపైపడక తప్పింది కాదు. రాజకీయంగా ఎన్ని కట్టుబాట్లున్నా, అధికారులు ఎంతగా హింసించినా ఎందరి ప్రాణాలు బలిగొన్నా, కవుల కంఠాలకు ఆనాటి నిజాం ప్రభుత్వం తాళం వేయలేక పోయింది. ప్రజావాణికి మైకులమర్చి, కవులు విజయదుందుభులు మ్రోగించినారు. వారు పాడిన గీతాలు వాయుతరంగాల్లో ప్రయాణించి తెలుగువాడిని మేల్కొలిపినాయి. చివరకు కవివాక్కు ఫలించి నిజాం ప్రభుత్వం నిలువునా కుప్పకూలింది.''

అలాంటి రక్కసి ప్రభుత్వంఅంతరించినా తెలంగాణా ప్రజల్లో ఆ కష్టాలనీలినీడలు మనసుల్లో చిరస్థాయిగా నిలిచే ఉన్నాయి. 'నీ బాంచెన్‌కాల్మొక్త' ఆనాటి తెలంగాణా రైతుకు ఊతపదం. పుష్కలంగా పంటలు పండించినా పెత్తందార్ల కాళ్ళు సట్టుకుంటేనేగానీ పూటగడవనిస్థితి. నిజాంప్రభుత్వం అంతరించినా అంతర్జాతీయంగా వచ్చిన చైనా విప్లవం తెలంగాణంలో మార్మోగింది. ఆ పరిస్థితుల్లో కమ్యూనిస్ట్ సిద్ధాంతానికి లొంగని యువకులు లేరు. చైనా దాడి జరుపుతున్నా, భయంకర యుద్ధ వాతావరణం నెలకొన్నా, కొందరు కమ్యూనిస్టులు చైనానే బలపరిచేవిధంగా మెదలసాగారు. వారినుంచి ఉత్పత్తి కాబడే ఆయుధాలబలంతోనే తెలంగాణాలో మారణహోమం పరాకాష్టకు చేరింది. సరిగ్గా అలాంటి సమయంలోనే జరుగుతున్న మారణకాండను కళ్ళారా చూడలేక, మహోన్నతమనుకున్న సిద్ధాంతాలు మట్టిలో కలిసిపోతుంటే, ఆ బాధను అణచుకోలేక, ఈ నాటకాన్ని రచించిన ధీరుడు నరసింహారావు. సాహిత్య సృష్టి చేయటానికి ఉత్తమ రచయితల మనస్సులెప్పుడూ సమకాలీన సమస్యల్నే చేపడతాయి. ఈ నాటకానికి పీఠిక వ్రాసిన పి.వి. నరసింహారావు.

''కె. యల్. నరసింహారావును ఆంధ్రదేశానికి పరిచయం చేయనవసరం లేదు. ముఖ్యంగా తెలంగాణా ప్రాంతాల్లో మారుమూలల వరకూ ప్రసిద్ధికెక్కిన గెలుపునీదే నాటకం ఈ రచయిత రచనాప్రావీణ్యాన్ని పదహారు సంవత్సరాలకు పూర్వమే ప్రకటించింది. [illegible] భాషలలో

ప్రభావోత్పాదకత, సన్నివేశ వైచిత్ర్యం ఏఅంశంలోచూసినా శ్రీ కే.యల్. తనసొంతపద్ధతిని రూపొం దించుకున్నారు. ఆయన నాటకాలు చూస్తే పోతపోసిన జీవిత ఖండాన్ని చూసినట్లే ఉంటుంది. కానీ వాస్తవజీవితాన్ని చూసి విసుగుపుట్టిన ప్రేక్షకునికి ఈ నాటకంచూసి మాత్రం విసుగుపుట్టదు సరికదా ఒక విశిష్టమైన అనుభూతి కలుగుతుంది. ఇదే కళాత్మకమైన వాస్తవికతలోని ప్రత్యేకత. ఇది కే.యల్.కు బాగా అబ్బింది''.[9]

అగ్నిపరీక్ష నాటకాన్ని గెలుపునీదే నాటకానికి పరిణత ప్రతిగా భావించ వచ్చు. ఈ నాటక ప్రదర్శన హైదరాబాద్ రవీంద్రభారతిలో జరిగినప్పుడు వివిధ రాజకీయ వర్గాలనుండి సమాచారశాఖ మంత్రి హోదాలో నాకు వచ్చిన లేఖలు, విమర్శలు, ప్రశంసాపరంపరలు, పత్రికలలో అభిప్రాయాలు ఇవన్నీ ఈ రచనా ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ చాటాయి. ముఖ్యంగా ఒక రాజకీయపార్టీకి సంబంధించిన మిత్రులకు కల్గిన ఆగ్రహమే శ్రీకె.యల్.కు నిజమైన ప్రశంసాపత్రమంటే అతిశయోక్తికాదు. శుష్కరాజకీయ ఇతివృత్తాల్లో మార్మికమైన హృదయాన్ని స్పందింపచేసే చాతుర్యం ఈ నాటకంలో అడుగడుగునా కనిపిస్తుంది.

ఐనా ఈ నాటకాన్ని ప్రచార సాహిత్యంలో జమకట్టటము సాధ్యంకాదు. సమంజసమూ కాదు. ఇలా కాక పోవటం ఎంతయినా ముదావహం. కానీ ఈ నాటకాన్ని ఒకసారి చూసిన ప్రేక్షకుడికి అపారమైన రాజకీయ పరిజ్ఞానంతోపాటు దేశభక్తికూడా అలవడుతుంది. కాబట్టి ప్రచార సాహిత్యంద్వారా మనంసాధించే సత్ఫలితాలను ఆ కోవకు చెందని ఈ నాటకం ఎంతో విజయవంతం గానూ ప్రభావోత్పాతకంగానూ సాధించటం గమనార్హం. ఈ నాటకాన్ని విరివిగా ప్రజల్లోకి తెచ్చే ప్రయత్నం ప్రభుత్వ పక్షానగానీ, రాజకీయ పక్షాలద్వారా గానీ జరగకపోవటం మాత్రం విచారకరమని చెప్పక తప్పదు అంటూ అగ్నిపరీక్ష నాటకం ప్రచార సాహిత్యం కాకపోయినా ప్రజల్లోకి చొచ్చుకుపోయి వారిని సక్రమ మార్గంలో ఆలోచింపచేయటానికి ఎంతో ఉపయోగిస్తుంది అన్నారు.

ఈ నాటకం మీద తన అభిప్రాయాన్ని సద్విమర్శకుడైన గోరాగారు వినాయకుడి వీణలో ప్రకటించారు. అందులో తాత్కాలికమైన పరిస్థితిని ఇతి వృత్తంగా తీసుకుని దానికి విశ్వజనీనమైన మానవత్వపు విలువలను జోడించి చక్కటి దృశ్యకావ్యాన్ని కె.యల్. నరసింహారావు గారు రచించారన్నారు. రాజకీయ సమస్యలను కూలంకషంగా అర్థం చేసుకొని బిగువైన ఇతి వృత్తంతో, మానవత్వపు విలువలలోనికి మారుస్తూ సహజత్వాన్ని పోషించారనీ, సున్నితమైన హాస్యంతో,

గాఢమైన ఆవేదనతో ఈ నాటకం మనసును హత్తుకునే విధంగా ఉందన్నారు. సమకాలీన నవలలను, గజిబిజి ఇతి వృత్తాలతో తడబడుతూ నడిచే నాటకాలను, ఘాటుగా విమర్శిస్తూ, వాటిని మరో కాశీమజిలీ కథలుగా అభివర్ణించే గోరా ఈ నాటకం నవశకానికి నాంది అన్నారు.

అగ్నిపరీక్ష నాటకంపై ఆనాడు అన్ని పత్రికలలోనూ ప్రశంసలు వెలువడ్డాయి ఒక్క డక్కన్ క్రానికల్ పేపర్ మాత్రం లభ్యమైంది. అందులో Agni Pariksha is easily one of the best plays tobe written as a result of the national indignation falt at the unprovoked and treacherasis chainese aggression. written in the rural selting with families one which contributed as ordent determined soldier to the Indian army and the other wich produced, a dedicated red rivolutionary, the play exposes with crisp, simple dialogues, the chainese ccynical betrayal of Indian friendship and self-deeciving pro-chinese entusiasts within the country.

-Deccan Chronicle, 18-2-64.

''ఏ గతిరచయించితి మేని సమకాలము వారలు మెచ్చరెచ్చటన్'' అని చేమకూర వారన్నప్పటికీ నిజమైన సాహిత్యాభిమానులూ, సద్విమర్శకులూ, తమకర్తవ్యాన్ని ఎన్నడూ మరచిపోరు. మంచి సాహిత్యసృష్టికి సజ్జనుల అభిమాన ప్రోత్సాహాలెలా ఉంటాయో ఈ అభిప్రాయాల ద్వారా విశదమవుతోంది.

అగ్నిపరీక్ష గ్రామీణనేపథ్యంలోసాగినకథే ఐనా సంఘటనా ప్రధానంగా కాక, మనోవిశ్లేషణాత్మకంగా ఉంది. చైనాదాడి కాక, ఆ సమయంలో గ్రామీణప్రజల మనోభావాలను ఎంతో సహజంగా చిత్రీకరించారు రచయిత. గ్రామంలో ఉన్నతకుటుంబానికి చెందిన బ్రహ్మయ్య, సీతమ్మలు అన్నాచెల్లెళ్ళు. మధు,సరోజ బ్రహ్మయ్య సంతానం. కోడలు శశి చెల్లెలి కూతురు. వేణు, రఘులు కూడా సీతమ్మ, రామయ్యల సంతానమే. బావమరందులిద్దరూ స్వాతంత్ర్యపోరాటంలో జైలు జీవితాన్ననుభవించిన వారే. దేశశ్రేయస్సు కోసం ప్రాణాలను సైతం ధారపోయగల ధీరులు వీరిద్దరూ.

బ్రహ్మయ్యకొడుకు మధు ఈ నాటకానికి కథానాయకుడు. మంచి దేశాభిమాని. మిలటరీలో పనిచేస్తూ సెలవులో ఇంటికి వస్తాడు. ఈ లోగా చైనా దురాక్రమణ వల్ల మళ్ళీ సైన్యంలోకి వెళ్ళవలసివస్తుంది. భార్య శశి అంటే అమితమైన ప్రేమ ఉన్నా దేశశ్రేయస్సునూ, కర్తవ్యాన్ని ఎన్నడూ మరువని దేశాభిమాని. తమ ఇంటి నౌకరైన వెంకన్నకు దేశరక్షణగురించి చెపుతూ చిన్న చిన్న మాటలతో

దేశరక్షణ విభాగాన్నే వివరిస్తాడు. గ్రామీణులను సులిగా అర్థంచేసుకున్న ఈ నాటకరచయిత వారికర్థమయ్యే విధంగానే ఇలాంటిసంభాషణ ద్వారా వివరించారు.

వెంకన్న:- నువ్విడికెల్లి అంతదూరం పోకపోతేంది మధుబాబు?

మధు:- దొంగలుపడరని పంటకుప్పదగ్గర కావలి మాను కుంటామా?

వెంక:- ఎందుకు మానుకంటం? తెల్లార్లూ సలివుంట లేసుకుని ఓరుగాకపోతే ఓర్లైనా కండ్లల్ల ఒత్తులేసుకుని కాపలాకాయరూ. దుడ్డుకర్ర దెగ్గరపెట్టుకుంటే ఏ దొంగైనా ఒస్తడా మల్ల?

మధు:- మరికావలికాయటం చేతకానివారేం చేస్తారు?

వెంక:- కావలున్నోల్లకు సలిబువ్వగాక, ఉడుకుడుకు బువ్వబంపాలె. మంచి జవులు దుప్పటి పంపాలె. వాల్లిండ్లల్ల పిల్లామేకల్ని జరనజరుబెట్టి జూడాలె. వాళ్ళు కావలున్నన్ని రోజులు అల్లకేం బాధరాకుంట చూస్తె కావలోల్లు సల్లంగకావలుండి పంటకాపాడతరు.

మధు:- చూసావా? అలాగే మేము కూడా దేశరక్షణకు వెళ్ళినా మీరంతా మా కుటుంబాలను చూస్తారన్న నిశ్చింతతో పనిచేయ గలుగుతాం.

ఎంతో గొప్ప విషయాలను అమాయకుడైన పాలేరుకు చెప్పవలసివచ్చినప్పుడు చిన్నచిన్న మాటలతో కూడా నిగూఢార్థాన్ని వ్యక్తపరచారు రచయిత. దేశరక్షణ అంటే మనకు సంబంధించిన విషయంకాదనుకునే గ్రామీణులకు దేశమంటే మన గ్రామం లాంటిదేననీ, దేశరక్షణ మనింటిని కాపలాకాసుకున్నట్టేననీ విపులీకరించి చూపిన రచయిత సునిశితదృష్టి ప్రతినాటకంలోనూ వ్యక్తమయింది. చైనా దాడివల్ల మధు వెళ్ళిపోతాడు. సీతమ్మకొడుకు వేణు కమ్యూనిస్ట్ సిద్ధాంతాల మోజులో తలమునకలై ఉంటాడు. దీనికి చాలా కారణాలున్నాయి.

"రెండో ప్రపంచసంగ్రామం ఆరంభమైనప్పుడు కమ్యూనిస్ట్‌లు దాన్ని సామ్రాజ్య వాద కూటాల పోరాటంగా చిత్రించారు. అదే విధంగా వలసవ్యతిరేక విప్లవాన్ని ఉధృతం చేయాలనుకున్నారు. తెలంగాణాలో కమ్యూనిస్ట్ నాయకత్వానికి నైజాం వ్యతిరేక పోరాటం కొన్ని జిల్లాల్లో సఫలమైంది. అలాగే ఈ పార్టీ కేరళ, బెంగాల్‌రాష్ట్రాల్లో పాదుకునిపోయిన సమయంలో చైనా- ఇండియా సరిహద్దు వచ్చింది. మెక్‌మోహన్ రేఖదాటి చైనా భారత భూభాగాన్ని ఆక్రమించటంలో కమ్యూనిస్ట్‌పార్టీలో తీవ్ర వ్యతిరేకాభిప్రాయాలు ఏర్పడ్డాయి. పార్టీ రెండుగా చీలిపోయింది."[9]

ఈ చీలికవర్గం చైనాకు అనుకూలంగా మారి అసలు పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థనే, దుయ్యబడుతూ ప్రత్యక్ష పోరాటంతో అధికారాన్ని సాధించాలని గెరిల్లా పోరాటపరిస్థితి అవలంబించారు. వారు ముజుందార్, కానూసన్యాల్, తరిమెల నాగిరెడ్డి మొదలైన వారి పోరాటానికి నాయకత్వంవహించారు. మెరుపుదాడులతో విద్యార్థులనూ, యువకులనూ విపరీతంగా ఆకర్షించేవారు. పశ్చిమబెంగాల్, ఆంధ్ర, కేరళలతోపాటు, తెలంగాణాలో కూడా మనుషులను చంపే ప్రక్రియ చేపట్టారు. కమ్యూనిస్ట్ నాయకులు యువకుల ఉత్సాహాన్ని చక్కగా వాడుకున్నారు. అలా ప్రేరేపించబడినవారిలో గ్రామాల్లోని యువకులే ఎక్కువగా ఉన్నారు. అలాంటి యువకులకు ప్రతీక ఈ నాటకంలోని వేణు.

విముక్తి ప్రజల విధాత 'మావో' అంటే ఇతనికెంతో అభిమానం. గ్రామంలో ఎన్నో రహస్యకార్యక్రమాలు సమావేశాలూ జరుపుతుంటాడు. తనకాబోయే భార్య సరోజను కూడా తన వర్గంలో చేర్చుకుంటాడు. కేవలం సోషలిజం వల్లనే భారతదేశం బాగుపడాలని అతని ఆకాంక్ష. చైనా విప్లవాన్నిచూసి ఇతనెంతో ఉత్తేజితుడవుతాడు. చేతిలో ఆయుధంతో దేన్ని అయినా సాధించవచ్చునని ఇతని ఊహ. ఈ ప్రజలకు పదిమంది నాయకులున్న ప్రజాస్వామ్యం కన్నా ఒక్క నియంతచాలని ఇతని ఉద్దేశ్యం. చైనా వారు మతగురువులమని భారతదేశంలో పర్యటిస్తుంటారు. వారినింటికి తీసుకువచ్చి, ఆతిథ్యమిచ్చి, సమావేశాలు జరిపి, వారివల్ల ఆయుధాలు పొందుతారు. చైనా తప్ప ఈ దేశాన్ని ఎవరూ బాగుచేయలేరనీ, హత్యలూ, విప్లవమూ, తప్పవని ఇతని ధృఢాభిప్రాయం. అదే కుటుంబంలోని వేణు తమ్ముడు రఘు, చెల్లెలు శశి నిజమైన దేశభక్తులు. నాయకునికి సహాయపాత్రలు వీరు. యుద్ధంలో పనిచేసేవీరులకు ఆయుధాలందించటానికి రఘు తన శక్తియుక్తులన్నింటినీ ధారపోస్తూ ఆయుధాల కర్మాగారంలో పనిచేస్తుంటాడు. శశి ఇంట్లో ఉంటూనే యుద్ధవీరులకోసం ఆహారపదార్థాలూ, స్వెట్టర్లూ తయారు చేస్తుంటుంది. దేశరక్షణనిధికి తన నగలన్నిటినీ విరాళంగా ఇవ్వటమేగాక ఇంటింటికీ తిరిగి విరాళాలు సేకరిస్తూ పరోక్షంగా యుద్ధవీరులకు సహాయసహకారాలందిస్తుంటుంది. తన భర్త పరిస్థితిని ప్రతిక్షణం గుర్తుకుతెచ్చుకుంటూ, గ్రామీణులకు యుద్ధవివరాలందిస్తూ సాటి ఇల్లాళ్ళకు దేశపరిస్థితి వివరించి చెపుతూ దేశాభ్యుదయ కార్యక్రమాల్లోనూ, ఊరేగింపుల లోనూ చురుగ్గా పాల్గొంటుంది. చివరకు తనతో బుట్టువే దేశద్రోహి అని తెల్సుకొని తానుకూడా యుద్ధ ప్రదేశానికి

నర్సుగా వెళుతుంది. భర్తకష్టంలో పాలుపంచుకునే సహధర్మచారిణిగా, దేశానికి కష్టంవస్తే ధైర్యంతో ఎదురునిలిచే వీరవనితలా శశి పాత్రను కథానాయిక పాత్రకు సరిపోయేలా సృష్టించారు రచయిత.

సరోజ మధు చెల్లెలు. వేణును ప్రేమిస్తుంది. అతనేంచెబితే అది వింటుంది. అతని సమావేశాలకు హాజరవుతూ పార్టీకార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటుంది. ఐనా అంతరాంతరాల్లో ఎక్కడో ఇది తప్పు అన్న బాధను అనుభవిస్తుంటుంది. చైనా మతగురువు పేరిటవచ్చిన కమ్యూనిస్ట్ సభ్యుడు తన అనుచరులను 'ఎర్రజ్వరం' వచ్చిందని తనముందే నానాహింసలు పెట్టి దారుణంగా హతమార్చటంతో భయభ్రాంతురాలై వేణుపై భయాన్ని, కోపాన్ని పెంచుకుంటుంది. చివరికి వదిన శశి మాటలలో దేశంకోసం ఏదైనా చెయ్యాలని నిశ్చయించుకుని యుద్ధవీరులకు సహాయసహకారాలందచేయటానికి ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తుంటుంది. వేణు కార్యకలాపాలు , హత్యలు, అధికం కావటంతో ఆగ్రహించిన ప్రజలు అతనికి దేహశుద్ధి చేస్తారు. చివరికి కన్నతల్లికూడా కాపాడటానికి నిరాకరిస్తుంది. రెచ్చిపోయిన జనం వేణును చంపబోతుండగా పోలీసులు వచ్చి అరెస్ట్ చేసి తీసుకెళ్ళటంతో నాటకం సమాప్తం అవుతుంది.

ఈ నాటకంలోని సంభాషణలు స్త్రీ స్వాభిమానం, ఆత్మ విశ్వాసముగల వ్యక్తుల మనసుల్లోంచి మల్లెల్లాగా విచ్చిన సుమాలు. మామూలుగా ఎవరైనా భావస్ఫోరకంగా, దీర్ఘంగా మాట్లాడుతూంటే, ఇదేంనాటకమా? చాంతాడంత డైలాగులతో మాట్లాడుతున్నావు? అంటూ పరిహసిస్తాం. నాటకాల్లోని సంభాషణలు దీర్ఘంగా నాటకీయంగా, సామాన్య ప్రజలకు దురంగా ఉండబట్టే, ఈ నానుడి వచ్చింది. కానీ నరసింహారావు తననాటకాల్లో ఆ ప్రమాదంరాకుండా మొదట్నించీ జాగ్రత్తపడ్డారు. దేశాభిమానం అంటే, దేశంలోని ప్రజలమీద అభిమానమే. ఆ అభిమానంతోనే దేశంలో' అత్యధిక సంఖ్యాకులైన సామాన్యజనం కోసమే వీరు నాటకరచన చేపట్టారు. తనచుట్టూ ఉన్నవాళ్ళకు తేలికగా అర్థమయ్యేవిధంగానాటకాలు రాయటమే గాక, తనే నిర్మాతగా, దర్శకుడిగా ఎన్నో ప్రదర్శన లిప్పించారు.

వీరేశలింగంగారు తమ స్వీయచరిత్రలో '' క్రూరములైన కులాచారములకు దాసులమై, మన చుట్టూ ఉన్నజనుల బాధలను, సమస్యలను సరిదిద్దలేనివారము. మనఇంటనుండుస్త్రీల కష్టముల నివారింపలేనివారము రాజ్యాంగ స్వాతంత్ర్యము పొందితే లాభమేమి? భావస్వాతంత్ర్యము మనకు

అత్యంతావశ్యకము''.' అంటూ దేశంప్రగతిని సాధించాలంటే ఎక్కడో దూరాన ఉన్న సమస్యలను చర్చించటం కాదు. మన చుట్టూ ఉన్న సమస్యాకంటకాలను కొన్నింటిని పరిష్కరించ గలిగినా దేశం సుభిక్షమవుతుంది. సరిగ్గా నరసింహారావు ఉద్దేశ్యమదే. పల్లెసీమల్లోని పాడిపంటలను అనుభవిస్తూ పల్లె వాసులు ఏమీ తెలియనివారని నిరసించకుండా, వారిని చైతన్యవంతులను చేయుటంలో భాగంగానే అక్కడి రైతులనే నటులుగా ఎన్నుకున్నారు. వారిలోని కళల్ని వెలికితీసే ప్రయత్నంలోనే సంగీత, సాహిత్యాలకూ, పక్కవాద్యాలకూ గ్రామస్థులనే ఎన్నుకున్నారు.

యాభై సంవత్సరాలుగా ఎన్నో ప్రజోపయోగమైన కార్యక్రమాలను చేపట్టి, నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నారు. గ్రామాల్లో ఇప్పటికీ ఏ అవసరం వచ్చినా, ఏ కష్టంవచ్చినా సాధ్యమైనంతగా తీర్చటానికి ప్రయత్నించే వీరు నిజమైనమానవతావాది. ఒకగాంధీ, ఒక రాజారామ్మోహన్‌రాయ్, ఒక వీరేశలింగంపంతులు ఎక్కడినుండో రాలేదు. మన మధ్యే పుట్టారు. మనలోనే ఉన్నారు. స్వార్థంవీడితే నిస్వార్థమైన మానవసేవకు పునాదులు పడతాయని నిరూపించారు. నరసింహారావుగారు నిర్ద్వంద్వంగా తన జీవితాన్ని గ్రామీణులసేవకే అంకితంచేసిన మహనీయులు. వీరికీర్తికి ఈ అగ్నిపరీక్ష నాటకం ఒక కలికితురాయి. వారి నాటక రచనా జీవితంలో మైలురాయి.

**అడుగు జాడలు :**

ఈ నాటకం 1958 నవంబర్ 5వ తారీకున ప్రప్రథమంగా అఖిల భారత సహకార సప్తాహ సందర్భంలో ఇండియన్ నేషనల్ ఆర్ట్స్ థియేటర్ వారిచే ప్రదర్శించబడి పలువురి ప్రశంసలను అందుకుంది. ప్రణాళికా పోటీలలో ఈ నాటకం ప్రథమ బహుమతిని కైవసం చేసుకుంది. కొత్తగా రచించిన నాటకాన్ని ప్రదర్శించకుండా పోటీకి పంపటం నరసింహారావుగారికిష్టం లేకపోయినా మిత్రుడయిన శ్రీ. డి. రాజేశ్వరరావుగారి ప్రోద్బలంతో పోటీలకు పంపించారు.

స్వాతంత్ర్యానంతరం స్వభావవాద నాటకాలలో ప్రధాన మైనవర్గాలు రెండు. ఒకవర్గం రచయితలు నగరాలలోని వాస్తవ పరిస్థితులను చిత్రించగా, రెండవవర్గానికి చెందిన రచయితలు తమ రచనలలో పల్లెలకూ, పల్లీయుల జీవితవిధానాలకూ ప్రాముఖ్యం కల్పించారు. స్వభావవాదానికిచెందిన నాటకాలలో ముఖ్యంగా కనిపించే అంశాలు. పరిస్థితుల యదార్థ చిత్రణ, ప్రదర్శనా సౌలభ్యం కల్గి ఉండటం పూర్తి వ్యావహారికంలో నాటకాలను

రచించటం. స్త్రీపాత్రలు లేకుండానే నాటకాలను రచించటం. కేవలం సమకాలీన సమస్యలనే నాటకాలుగా చిత్రించటం. సంప్రదాయికమైన కట్టుబాట్లపైనా, మూఢాచారాలపైనా తిరుగుబాటు మొదలైన అంశాలు.

ఈ స్వభావవాదానికి ఊపిరిపోసిన ఇరువర్గాల నాటక రచయితలూ ఎంతో అభినందనీయులు. వీరి నాటకాలలో రానున్న కాలంలో సామాన్యుడే సాహిత్యంలో కథానాయకుడవుతాడనీ, ధనస్వామ్యం నశించి, సమసమాజం స్థాపించబడుతుందనే ఆశాభావం గోచరిస్తుంది. వీరి ఆశయసౌధాలపై శాంతిపతాకం ఎగురవేశారు. తరువాతితరం రచయితలు వారూహించి నట్టుగానే వారి రచనల పునాదులపై ఉన్నత సౌధాలుగా నేటి రచయితల నాటకాలుపేదల సమస్యలను చిత్రించటంలోనూ సమసమాజ స్థాపనలోనూ ఎంతో సహకరించాయనటంలో సందేహం లేదు.

స్వభావ వాదనాటకరచనలలో నగరజీవనాన్ని చిత్రించిన ప్రముఖు లెందరో ఉన్నారు. వారినాటకాలు నేటికీ ఆదరింప బడుతున్నాయి. వాటిలో ముఖ్యమయినవి.

శ్రీ కొండముది గోపాలరాయశర్మగారి ఎదురీత, ఇదీలోకం, న్యాయం, ఏకదేశం మొదలైనవి.

ఆచార్య ఆత్రేయగారి నాటకాలలో ఎన్.జీ.వో. పరివర్తన, ఈనాడు, సంఘర్షణా ప్రధానమైన నాటకాలు.

అనిశెట్టి సుబ్బారావుగారి గాలిమేడలు, మావూరు.

పినిశెట్టి శ్రీ రామమూర్తి గారి ఆదర్శ జ్యోతి, కులంలేనిపిల్ల, కన్నకొడుకు, తల్లిదండ్రులు, పల్లెపడుచు.

బెల్లంకొండ రామదాసుగారి, ఆకాశరామన్న, మాష్టర్జీ, పునర్జన్మ, అతిథి.

అవసరాల సూర్యారావుగారి పంజరం, నల్లబూట్లు.

ధనికొండ హనుమంతరావు గారి పవిత్రులు, చికిత్స, ఉల్టాసీదా మొదలైన నాటకాలన్నీ నగర జీవన చిత్రాన్ని సజీవంగా చిత్రించటంలో సఫలీకృతులయినారు. స్వభావ వాదంలోని రెండో వర్గం రచయితలు సృష్టించిన ఆణిముత్యాలు.

సుంకర, వాసిరెడ్డిగారల ముందడుగు, అపనింద, మాభూమి.

బోయి భీమన్న గారి కూలిరాజు, పాలేరు.

కొడాలి గోపాలరావు గారి పేదరైతు, కూలీ, తిరుగుబాటు, నిరుద్యోగి, రైతుబిడ్డడు, లంకెలబిందెలు, దొంగవీరడు మొదలైనవి.

''కె. యల్. నరసింహారావుగారి నాటకాలు అన్నీ స్వభావ వాదమనే కొమ్మకు పూసిన ముద్దమందారాలు. పదాడంబరం గానీ, గ్రంథవిస్తరణగానీ లేకుండా చెప్పదల్చుకున్న విషయాన్ని క్లుప్తంగా చెప్పటంలో సమర్థులు వీరు. వీరినాటకాలన్నీ తెలంగాణా ప్రాంతపు మారుమూల పల్లెల్లోని ఇతివృత్తాలతో కూడినవే. వీరి అడుగుజాడలు గ్రామపునర్నిర్మాణానికి సంబంధించిన నాటకం'' " అని పి. యస్. ఆర్. అప్పారావు గారు తెలుగు నాటక వికాసానికి కరదీపిక అనదగిన తమ సిద్ధాంత వ్యాసంలో రచయితను అభినందించారు. నరసింహారావుగారి నాటకాలన్నీ స్వభావ వాదానికి చెందుతాయని వర్గీకరించారు. ముఖ్యంగా వీరి అడుగుజాడలు గ్రామపునర్నిర్మాణానికీ గ్రామప్రజల బాధ్యతను శ్రమదానాన్నీ కథానాయకుడు ఎలా తెలియజెప్పాడో ఈ నాటకంలో విపులీకరించారు. ఈ నాటకానికి పీఠికనిస్తూ కపిల కాశీపతి '' తెలంగాణలో దౌర్జన్యం పెరిగినప్పుడు ప్రజల్లో శాంతిప్రియత్వం కల్గించటానికి నరసింహారావుగారి రచనలు చాలా ఉపయోగపడ్డాయి. తెలుగుపల్లె హృదయం వీరికి బాగా తెలుసు. అందుకే ప్రభుత్వం వారు ఏర్పరచిన నాటకరచన పోటీలో వీరిరచనకు అగ్రస్థానం లభించింది. నవభారతనిర్మాణానికి మార్గమైన ప్రణాళికల పరమార్థం ప్రజలకు తెలియచేయటంలో సాహిత్యంఎంతైనా తోడ్పడగలదు. అసలు సద్భావ ప్రచారమే సాహిత్య ప్రయోజనం. ఈ ప్రచారంసాహిత్యస్థాయికి వచ్చినపుడే సంతోషహేతువై ప్రజానీకానికి నచ్చుతుంది. ఈమార్గంలో ఎంతో సాధించిన నరసింహారావుగారు అడుగుజాడలు సాధించిన విజయప్రోత్సాహంతో ఇంకా ఎన్నో రచనలు చేయాలని నా ఆకాంక్ష''-[౨]

అడుగుజాడలు నాటకం స్వభావ వాదలక్షణాల్ని పుణికి పుచ్చుకున్నటువంటిది. ఈ నాటకం ఇతివృత్తం మోతుబరి రైతు గోపయ్య మేనల్లుడయినచంద్రం ఈ నాటకానికి కథానాయకుడు. ఇతనికి తల్లీతండ్రీ లేరు. మేనమామే చదువు చెప్పించి తనపలుకుబడితో ఉద్యోగం వేయిస్తాడు. కానీ గ్రామాభ్యుదయవాదియైన చంద్రం ఆ ఉద్యోగాన్ని వదులుకుని స్వయంకృషితో గ్రామాన్ని అభివృద్ధిపరచటానికి పూనుకుంటాడు. ఒక కుటుంబంలోని వ్యక్తులు ఎలా కలిసుంటారో గ్రామస్థులందరు కూడా అలాగే ఉండాలని చంద్రం కోరుకునేవాడు. గృహావసరాలు తీర్చటానికి గృహోపకరణాలు ఎంత అవసరమో గ్రామాభ్యుదయానికి కొన్ని సౌకర్యాలు అంతే అవసరం. గ్రామంలో మంచినీటి

బావులు, పిల్లలకు పాఠశాల, వ్యాధులు నయం చేయటానికి ఆసుపత్రి, పల్లె సౌకర్యాలు మెరుగుపరచటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నా గ్రామీణుల సహకారం లేనిదే ఏ ప్రభుత్వమూ సంపూర్ణ సౌకర్యాలను సమకూర్చలేదు. సరిగా ఈ వాదనను మూలాధారంగా చేసుకున్నదే ఈ నాటకం. ఇందులో గ్రామ సౌకర్యాలను మెరుగు పరచటానికి కథానాయకుడు చేసేకృషి, దానికి వచ్చే లెక్కలేనన్ని అవాంతరాలు. వాటిని అధిగమించిన అతని స్థిరచిత్తం చివరగా అతనాశించిన మార్పుని గ్రామ ప్రజల్లో తీసుకురావటంతో నాటకం పరిసమాప్తమవుతుంది.

స్వాతంత్ర్యానంతరం సాహిత్యం రాజుల ఆస్థానాలనుండీ, పండితుల గోష్ఠుల నుండీ, చకచకా నడిచి, సామాన్యుని ముంగిట్లో అడుగుమోపింది. ఇదివరకులా ఇప్పుడు రచయితలకు రాజులు, బలవంతులు, కథానాయకులు కారు. వారికథలన్నీ సామాన్యుని చుట్టూ అల్లుకోవటం ప్రారంభమైంది. సహజవాదంలోని ముఖ్య లక్షణమే ఇది. ఇలా సామాన్యుడు సాహిత్యానికి కథానాయకుడయినాడు. సహజంగా రాళ్ళువిసిరే జనానికి పిరికివాడు భయపడతాడు. ధైర్యవంతుడు వాటినెదుర్కుంటాడు. ఆ విసుర్లతోనే తన దుర్గం నిర్మించుకుంటాడు మేధావి. ఆ విసుర్లతో విసిరే జనాలకు సమసమాజసౌధాన్ని నిర్మిస్తాడు మానవతావాది. నరసింహారావుగారు చక్కని మానవతావాది ముఖ్యంగా పల్లెలలో జీవాలకూ, జీవితాలకు తేడా చూపినవారు. మనుషుల సకల భోగభాగ్యాలతో దేవతల్లా జీవితాలు గడపకపోయినా కనీసం (బలి) పశువుల్లా బ్రతక్కుండా ఉంటే చాలని అభిప్రాయపడేవారు. ఆనాటి రజాకారులు, కమ్యూనిస్టుల బారినుండి కోలుకుంటున్న గ్రామీణవ్యవస్థను, తనమాటలతో, చేతలతో, చేతనైనంతగా మెరుగుపరచటానికి ఆయన శక్తివంచన లేకుండా కృషి చేసారనటానికి వారు వ్రాసిన, ప్రదర్శింపచేసిన నాటకాలే సజీవసాక్ష్యాలు.

సాహిత్యపరంగా ఈ నాటకంలో సమాసాలధగధగలూ, విప్లవకవిత్వపు భుగ భుగలూ లేనప్పటికీ, సంస్కరణ (సంఘ) దృష్ట్యా ఈ నాటకంహిమాలయమంత ఉన్నతమైనది. తన చదువు తన కష్టార్జితమే ఐనా తన విజ్ఞానం విశ్వానికి చిరుదీపమైనా కావాలని మనిషి భావించినప్పుడే సమసమాజ నిర్మాణం సాధ్యమవుతుంది. ఏ డిగ్రీ ఉన్నసరే, ఏ మాత్రం అవకాశంవచ్చినా లేక కల్పించుకునే ఐనాసరే తాము పుట్టిన గడ్డనూ, తమను నమ్ముకున్న వాళ్ళనూ నిర్దాక్షిణ్యంగా నడిసముద్రంలాంటి సంసారంలో వదలి, రెక్కలు కట్టుకుని విదేశాలకు ఎగిరిపోతున్న నేటి యువతరానికి ఈ నాటకం చక్కని తనుశిక్ష

''ఊరికి చేసినఉపకారం పీనుక్కిచేసిన శృంగారం'' ఒకటే అనుకునే రోజుల్లో గ్రామాభ్యుదయమే తమజీవితాదర్శంగా ఎంచుకుని అదిసఫలమవాలని అహోరాత్రులు శ్రమించిన నవయువతరం కథే ఈ అడుగు జాడలు. ఈ నాటకంలో కథానాయకుడైన చంద్రం చదువు ముగించి, మామ వేయించిన ఉద్యోగం చేయలేక, తన కిష్టమైనపనికే వృత్తిగా భావించి పల్లెటూరైన తన గ్రామానికే వస్తాడు. విద్య యొక్క నిజమైన లక్ష్యం డిగ్రీలుకావు. ఎదుటిమనిషిని గౌరవించగల సహృదయ సంస్కారాన్ని నేర్పేదే ఉన్నత విద్య. సాటిమనుషుల కష్టనష్టాలను, పరిస్థితులను, అవగాహన చేసుకుని, తన శక్తివంచన లేకుండా వారికి సహాయపడాలని చూసేవాడే నిజమైన విద్యావంతుడు.

కావ్యలక్షణాల దృష్ట్యా, ధీరోదాత్తాది చతుర్విధ నాయకలక్షణాలను కలిగి ఉండటం ప్రాచీన సంప్రదాయమే ఐనప్పటికీ ఎప్పటికైనా, ఏ కథకయినా మామూలు మనుషులమీద దయగలిగి, లోక ధర్మాన్ని తెలిసినవాడూ, సహనశీలి, ప్రతిభావంతుడయిన వాడే నాయకుడు. అసలు కథానాయకుడు అనేకన్నా నాయకుని కథ అనటమే సముచితం. నాయకునికి అన్నిటికన్నా ముఖ్యంగా ఆశయసాధన, లక్ష్యసిద్ధి ముఖ్యలక్షణాలు. ఆ సాధనలో అహర్నిశలూ శ్రమించి అన్ని అవరోధాలనూ అధిగమించగలవాడే నిజమైన కథానాయకుడు. అడుగుజాడలు నాటకంలో చంద్రంకూడా పై లక్షణాలన్నీ కలిగినవాడు. నాయక పాత్రకు అత్యంతార్హుడు. సమాజశ్రేయస్సే అతని లక్ష్యం. ఆ లక్ష్యసాధనకు అతను తన ధన, మానప్రాణాలను, చివరికి తానుప్రేమించిన సీతనుసైతం వదులు కోవటానికి వెనుకాడడు. కార్యసిద్ధికోసం ఎన్ని అపనిందలపాలైనా లెక్క చేయడు.

గ్రామాన్ని సంస్కరించాలని ఉద్యోగం వదిలివచ్చిన తనను గోపయ్య దుయ్యబట్టినపుడు ఈనాడు మనదేశం ఎంతో అభివృద్ధి చెందవలసి ఉందనీ, దానికిముఖ్యంగా గ్రామాల్లోనే పనిజరగాలనీ, అందుకే తన చేతనైనంతవరకూ గ్రామాలకు సేవచేస్తాననీ, బ్రతుకు తెరువు చూసుకోకుండా ఉద్రేకంతో, ఆవేశంతో తానీపనిలోకి దిగలేదనీ పోస్టాఫీసుకు ప్రయత్నిస్తే వచ్చిందనీ ఈనాడు పల్లెల్లో చేయడానికెన్నో పనులున్నాయనీ అవసరమైతే వాటిలో చేరి డబ్బూ సంపాదిస్తాననీ చెబుతాడు. ఆ ఉద్యోగం వల్ల ఇంతకన్నా సుఖముండదనీ అందుకే ఈ నిర్ణయానికి వచ్చాననీ చెబుతాడు మరోచోట. మన ఊళ్ళకు మనం రోడ్లు వెయ్యటం మన పిల్లలకు బళ్ళు కట్టుకోవటం. మన పంటలకు భూములు దున్నుకోవటం, మన ఆరోగ్యానికి ఆస్పత్రులు కట్టుకోవటం దోషమా? అని ప్రశ్నిస్తాడు.

కథానాయక సీత కన్నతండ్రితోనే "మీకీ గ్రామాలు బాగుపడటం ఇష్టంలేదు నాన్నా. గ్రామస్థులు చదువులు లేక అజ్ఞానంతో, అనారోగ్యంతో, దరిద్రంతో బ్రతకాలనే మీ ఉద్దేశ్యం. వారుచదివితే మీ మాటలు వినరనీ, మీ పెద్దరికం సాగదనీ, మీ కుట్రలు కుదరవనీ భయం" అంటుంది.

ఈ నాటకంలో పాతతరానికీ, కొత్తతరానికీ వారధి లాంటివాడు నరసయ్యన్న. ఈ పాత్ర గురజాడవారి కన్యాశుల్కంలోని కరటక శాస్త్రి పాత్రలాంటిది. తన తరంలోని సత్సంప్రదాయాన్ని, యువతరపు సదుద్దేశ్యాలనూ, వారు తెస్తున్న ప్రయోజనకరమైన మార్పుల్ని మనస్ఫూర్తిగా అంగీకరించి వాటిని తన తరంవారికి సర్దిచెప్పి వప్పించే బాధ్యతాయుతమైన పాత్ర. ఈ పాత్రలో అంతర్లీనంగా రచయిత గోచరిస్తారు. ఒకచోట నరసయ్యన్న మరీ అంత చీకట్లో ఏమీ పట్టనట్టు ఉండవద్దనీ, స్వయంగా మనిషినిపంపితే గానీ ఉత్తరం చేరదనుకునే రోజులుపోయి, అణాలోపుతో దేశమంతటికీ ఉత్తరాలు చేరేరోజులు వచ్చాయి. ఒకటవ తరగతి కూడా పదిమైళ్ళు నడవాల్సిన గతి తప్పి పై క్లాసులదాకా చదివేబళ్ళు అన్ని ఊళ్ళలోనూ ఏర్పడుతున్నాయి. ప్రాణాలుపోతున్నా చేయి చూసే నాథుడుండని పల్లెటూర్లకు మంచి వైద్యులు వస్తున్నారు. గొడ్లకు వాతలు వేసి చంపుకునే రోజులుపోయి, అవి చల్లగాబతికేందుకు ముందే మందులు వేసుకునే అవకాశాలొస్తున్నాయి. నిలువులోతు బురదలో కూరుకుపోయి నడిచేవారు. ఇప్పుడవి చక్కటిరోడ్లుగా రూపొందుతున్నాయి. చిమ్మచీకట్లతో నిండే వీధులు చక్కని దీపాలతో కళకళలాడుతున్నాయి. ఇవన్నీ కొత్త సౌకర్యాలు కావా? వీటివల్ల మనమూ లాభంపొందుతున్నాముగా ఇంతకన్నా మనం కోరే సుఖాలేమిటి? ఊరికే చంద్రానికి అడ్డుతగిలి విసిగించవద్దనే భావంతో సంభాషిస్తూ, మూర్ఖపు వాదనను తర్కబద్ధంగా, సహేతుకంగా సమాధానమవరుస్తాడు. అంతేగాక, తెలివి తక్కువతనంతో మాట్లాడే గోపయ్య కళ్ళుతెరిపించే ప్రయత్నంలో అతనికి నచ్చచెప్పజూస్తాడు. ఎప్పుడూ పెరటిచెట్టు మందుకు పనికిరాదంటారు. అలాగే నీ చేతుల్లో పెరిగిన చంద్రం గొప్పదనం నీకు తెలియదు. మనకున్న కొద్దిపాటి జ్ఞానంతో అతనికి విలువ కట్టడంలో అర్థంలేదు. అసలు గొప్పతనమంటే ఎలా ఉంటుందని నీ ఉద్దేశ్యం? తాను నమ్మిన ఒక మంచిపనికోసం ఉద్యోగాన్నీ, డబ్బునూ, సుఖాలను చివరికి తన ప్రాణాలను కూడా త్యాగంచేయటమే గొప్పదనం. ఐతే ఇతరుల గొప్పదనాన్ని కళ్ళారా గుర్తించే యోగ్యత ఉండాలనీ, అన్నీ తెలిసినవాడు గనకే కలెక్టరు తన పిల్లనివ్వటానికి ముందుకు వచ్చాడనీ గోపయ్యను చురుకు మనిపిస్తాడు.

బల్లదగ్గర కూర్చుని పనిచేయుటమే గొప్పనుకునే రోజులు ఎప్పుడో పోయాయి. తోటి మానవజాతి శ్రేయస్సుకోసం తన విజ్ఞానాన్ని ధారపోయటమే ఘనత. ఈనాడు ఫిర్కా అంతా చంద్రం చెప్పినట్టు వింటున్నారు. కేవలం కొద్ది రోజుల్లోనే వారికీ ఘనత ఎలా వచ్చింది? మనం ఇన్నేండ్లనుండీ ఇక్కడే ఉంటున్నాం. మనల్నెవరూ తలచేవారేలేరే? మనం ఎవరికీ ఎలాంటి ఉపకారమూ చేయలేదు. పైగా అపకారం కూడా చేసే ఉంటాం. మన బ్రతుకులను మనం వెళ్ళదీసుకున్నాం. వాళ్ళు తమ గ్రామాల బ్రతుకునే తమబ్రతుకుగా భావించి కృషి చేశారు. తమ కష్టంతో, సత్ప్రవర్తనతో వారికీర్తికి పునాదులు వేసుకున్నారు. ఇన్నేళ్ళ నుండీ మనం కొంచెం కూడా ఆలోచించని కొత్తమార్గంలో వాళ్ళు నడుస్తున్నారు. చంద్రం దాసులను చూస్తుంటే, మనుషుల్లో ఇంతశక్తి ఉన్నదా అన్పిస్తుంది. ఈ వేళ చెరువుకు కట్టబోయటానికి ఇంతమందిని ఎలాకూడగట్టారో? జనం దండులాగా పూనుకుంటే యుగ యుగాలుగా ఆగిపోయిన పనులు క్షణాల్లో అయిపోవూ? వాళ్ళంతా ఉత్సాహంగా పాటలుపాడుతూ రాళ్ళు మోస్తుంటే ఊరుకోలేకపోయాను. ఇదంతా చూస్తుంటే మన జన్మసార్థకం అయ్యేరోజులు వస్తున్నాయన్పిస్తుంది. ఇన్నాళ్ళూ మనం సోమరుల్లా కూర్చున్నాం. పిల్లతగాదాలతోనూ, పిచ్చికబుర్లతోనూ విలువైన కాలాన్ని వృధా చేసాం. మనంకూడా వీరిలా శ్రమించి ఉంటే, మన ఊళ్ళు ఎప్పుడో నందనవనాలయ్యేవి. మనకు రైళ్ళు వచ్చేవి. మన ఊళ్ళన్నీ చదివేవి. సంస్కారయుతంగా బ్రతికేవి. అంటూ ప్రగతివాదాన్ని విన్పిస్తాడు.

గ్రామాభ్యుదయానికి అనవసరమైన ఉపన్యాసాలిచ్చేకన్నా అవసరమైన పనిని కష్టపడిసాధించాలన్నదే చంద్రం ఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యపూర్తికి నిజమైన సహకారి దాసు. ఇతను డాక్టరు. ఆ ఊళ్ళోనే పుట్టి పెరిగిన వాడు. పట్నాలలో సుఖపడాలని కాకుండా తన జన్మ స్థలాన్ని ప్రగతిపథంలో నడిపించాలనీ, గ్రామస్థులకు వైద్యం అందించాలనీ సత్సంకల్పంతో ఆ పల్లెకు వస్తాడు.

గ్రామంలో మనుష్యులకు కలరా రాకుండా, పశువులకు రోగాలు రాకుండా రోగనిరోధక టీకాలు ఇవ్వటానికి ఆ డాక్టరు పడ్డ అవస్థలు అన్నీ ఇన్నీ గావు. ఐనా సమస్యలకెదురు నిలిచి, తనను చంపాలని చూసిన భూస్వామి వెంకటపతిని, తిరిగితనే డాక్టరుగా సేవచేసి బ్రతికిస్తాడు. ఉపకారికి ఉపకారం చెయ్యకపోయినా అపకారికి తప్పకుండా ఉపకారం చేసి, వారి మనసులోని మాలిన్యాన్ని కడిగివేయటం భారతీయ ఆధ్యాత్మికతను స్పష్టం చేస్తుంది. ఆ సిద్ధాంతాన్ని నరనరానా జీర్ణించుకున్న భారతీయులు మాత్రమే తమకు కష్టం

కలిగించినాకూడా ఎదుటివారి సుఖాన్ని మనస్ఫూర్తిగా కోరుకుంటారు. ఈ లక్షణాలన్నీ సహనాయకుడైన దాసుపాత్రద్వారా పాఠకులకు పరిచయంచేశారు.

సమాజంలోని వ్యక్తులందరూ కలసికట్టుగా ఉంటే ఏ పనైనా జరిగితీరుతుందని ఈ నాటకం తెలియచేస్తుంది. తమ పొలాల్లో బంగారం పండించటానికి చెరువుకు తెగిన కట్టను పోయుటం, విద్యావంతులు నిరక్షరాస్యులైనవారికి విద్యనేర్పటం, గ్రామానికి రోడ్డు వేయుటం, పాఠశాల కట్టుకోవటం కోసం గ్రామంలోని వ్యక్తులంతా కష్టపడి పనిచేయుటం. తద్వారా గ్రామపురోభివృద్ధికి, దేశ సౌభాగ్యానికి కృషి చేయుటం ఎంతో హర్షణీయ విషయంగా చిత్రించారు. ఈ మార్పు గ్రామాల్లో రావటానికి చంద్రం లాంటివారెందరో దేశానికి అవసరమని రచయిత అభిప్రాయపడ్డారు.

శ్రమైకజీవన సౌందర్యానికి సమానమైనదేదీ లేదని ఒక గ్రామంలో ప్రజలుండవలసిన పద్ధతినీ, గ్రామంలోని చీడపురుగుల్లాంటి అధికారదాహం గల పెద్దలను, విద్యావంతులు విజ్ఞానవంతులైన గ్రామస్థులచేతిలో ఎలా అవమానింపబడతారో ఆ విధానాన్ని, ఒకటని కాకుండా ఒక గ్రామవ్యవస్థనే గాక సమకాలీన సమస్యలను మనకళ్ళముందు సాక్షాత్కరింపచేస్తుంది అడుగుజాడలు నాటకం.

ఎంతోకొంత చదివి, శారీరకంగా, మానసికంగా ఏ మాత్రం కష్టపడకుండా ప్రభుత్వోద్యోగాల్లో కులాసాగా విశ్రాంతి తీసుకుంటూ అటు ప్రజలనూ, ఇటు ప్రభుత్వాన్నీ మోసం చేస్తూ బ్రతుకుతున్న అసమర్ధజీవులకు ఈ నాటకం కొరడాదెబ్బ. ప్రతి చోటా సమాజాన్ని అభివృద్ధి పరచటానికి ఏ ఒకరో, ఇద్దరో తమ జీవితాంతం కష్టపడవలసి వస్తుంది.కానీ ఈ నాటకంలో నరసింహారావుగారు కొత్తపుంత తొక్కారు. ఒక దీపం వేయిదీపాలను వెలిగించినట్లు ఒక చంద్రంతో ఊరినంతటినీ శరజ్జ్యోత్స్నలతో వెలిగింపచేస్తాడు. అతని అడుగుజాడలలో ఊరంతా ప్రగతి పథంవైపు దూసుకుపోతుంది. ఇంతటితో రచయితలక్ష్యం కూడా నెరవేరింది.

ఈ దశాబ్దంలో అంటే ౧౯౯౮ జనవరి ౧ న గౌరవనీయులైన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గారిచే ప్రారంభింపబడిన 'శ్రమదానోద్యమం' అనే ప్రక్రియను సరిగ్గా నలభై సంవత్సరాలకు ముందే ౧౯౫౮ లోనే 'శ్రమశక్తి' గ్రామాలకు ఎంత అవసరమో నాటకరూపంలో రచించిన నరసింహారావుగారు క్రాంతదర్శి. ఆ రోజుల్లోనే శ్రమశక్తి విలువను చాటిచెప్పిన మహానుభావుడు. ఈనాడు కూడా ప్రతిగ్రామంలోనూ ఎన్నో సమస్యలు ఎదురవుతున్నాయి

ప్రతిదానికీ ప్రభుత్వాన్ని తూర్పారబట్టకుండా స్వయంకృషితో సమస్యలను పరిష్కరించే యువతరానికి ఈ నాటకంఒక ప్రశంసాపత్రమవుతుంది. ఇప్పటికీ ఎన్నోసార్లు ప్రదర్శింపబడిన ఈ 'అడుగుజాడలు' నాటకం ఇంకా అక్కడక్కడా ప్రదర్శితమవుతోంది. ముఖ్యంగా పల్లెల్లోని బడుగువర్గాలు ఎవరో వస్తారనీ, తమకు ఏదో చేస్తారనీ ఎదురుచూసి మోసపోకుండా ఉండటానికి ఈ నాటకప్రదర్శన ఎంతో అవసరం.

అందరికోసం ఒక్కడిలా ఒక్కడికోసం అందరూ అన్న సామెతను నిజం చేస్తూ, ఉపకారమే ఊపిరిగా, సహకారమే వైఖరిగా ప్రగతిపథంవైపు దూసుకువెళ్ళే నేటి గ్రామాలే రేపటి కొత్త ప్రపంచానికి సరికొత్త ద్వారాలు తెరుస్తాయని రచయిత ఈ నాటకం ద్వారా గ్రామీణుల కళ్ళు తెరిపించడానికి చేసిన ప్రయత్నమే ఈ 'అడుగు జాడలు' నాటకం.

**భారతి :**

రాష్ట్ర ప్రభుత్వం కోరికపై 1984లో నక్సలైట్ ఘాతుకాలను ఖండిస్తూ రచింపబడిన నాటకం ఇది. మూడువందల సార్లకు పైగా విజయవంతంగా ప్రదర్శింపబడిన ఈ నాటకం ప్రభుత్వం చేతకూడా ప్రశంసలందుకున్నది. క్రూరమైన నక్సలైట్ ఘాతుకాలను ఖండించి, సామ్యవాదానికి నిజమైన అర్థమూ, పరమార్థము తెలియచేయటమే ఈ నాటకం యొక్క లక్ష్యం.

'''మానవుడు మొదట్లో తన రక్త సంబంధీకులతో సహకరిస్తూ, మిగతావాళ్ళతో పోరాడాడు. తరువాత తన దేశస్థులతో కలిసి మిగిలిన వారిని ఎదిరించాడు. ప్రస్తుతం తాను నమ్మిన సిద్ధాంతాలకు అనుకూలురతో సహకరిస్తూ, వ్యతిరేకులతో పోరాడుతున్నాడు.'''[10] ఈ వాదనను అనుసరించే భారతి నాటకం రచింపబడింది. మనిషి స్వార్థంకోసం ఒక సిద్ధాంతాన్ని ఏర్పరచుకుని దానికి సహకరించే అంగబలంతో సమాజాన్ని ఎప్పుడయితే పీడించటం మొదలుపెడతాడో అప్పుడే నైతికంగా అధఃపాతాళానికి నెట్టివేయబడతాడు. విప్లవకారులం అని చెప్పుకునే ప్రతివారూ ఈ కుళ్ళు వ్యవస్థ నశించాలనీ, నూతన వ్యవస్థ రావాలనీ ప్రభోధిస్తారు. కానీ ఆ వ్యవస్థా నిర్మాణంలో వీరి వంతు కృషి సంతృప్తికరంగా ఉండదు సరిగదా అత్యంత జుగుప్సాకరంగా ఉంటుంది. ఈ నిజాన్ని భారతి నాటకంలో చక్కగా వ్యక్తీకరించారు రచయిత.

మహోన్నత సిద్ధాంతాలతోకూడుకున్న కమ్యూనిస్ట్ పార్టీ నుండి నీచాతి నీచమైన నక్సలిజం ప్రబలటానికి స్వార్థం, పదవీకాంక్ష, వ్యక్తి దురహంకారా

కారణం. ఎన్నోకొత్తకొత్త మార్పులకూ, నిరసనలకూ ఒక దశలో ప్రభుత్వ నిషేధానికి కూడా గురయిన కమ్యూనిస్ట్ పార్టీకి భారతదేశంలో డెబ్బై ఐదు సంవత్సరాల చరిత్ర వుంది. ౧౯౨౦ ప్రాంతాల్లో ప్రారంభమై, అజ్ఞాతంగా, బాహాటంగా అనేక ఒడుదుడుకులకు లోనైనపార్టీ ఇది. అశాస్త్రీయ ధోరణులను, ధనస్వామ్యాన్నీ వ్యతిరేకించి సెక్యులరిజం కోసం ఈ పార్టీ పాటుపడింది

''రష్యావిప్లవం గమనించిన కొందరు భారతీయులలో మార్క్సిస్ట్ సిద్ధాంతాల ఆకర్షణ ౧౯౧౯ లోనే ప్రారంభమైంది. కానీ అప్పుడు పార్టీ పెట్టే సాహసం ఎవరూ చేయలేకపోయారు. భారత కమ్యూనిస్ట్ పార్టీ రష్యాలోని తాష్కెంట్‌లో ౧౯౨౦లో జన్మించింది. దీని పితామహుడు యం.ఎన్.రాయ్''. ఇండియా-చైనా సరిహద్దు పోరాటంతో చీలిపోయిన కమ్యూనిస్ట్ పార్టీ, డాంగేనాయకత్వాన రష్యా అనుకూల వర్గంగానూ, చైనాకు దగ్గరగా ఆలోచించే వర్గం కమ్యూనిస్ట్-మార్క్సిస్ట్ పక్షమైంది. చైనాకు పూర్తిగా అనుకూలవర్గంవారు కొందరు ప్రజాస్వామిక వ్యవస్థనే దుయ్యబడుతూ ప్రత్యక్ష పోరాటంతోనే అధికారాన్ని చేపట్టాలని గెరిల్లా పోరాట పద్ధతి అవలంబించారు. ఈ పోరాటానికి చారు ముజుందార్, కానూసన్యాల్, తరిమెల నాగిరెడ్డి నాయకత్వం వహించారు. పశ్చిమబెంగాల్లో 'నక్సల్‌బరీ' అనే కుగ్రామంలో ప్రారంభమై తూర్పు కోస్తా ప్రాంతమంతా వీరిగెరిల్లా పోరాటం పాకింది. మార్క్సిస్టులు ఉండగా, బెంగాల్లో వీరిపట్ల పూర్తి ఉదాసీనత వహించారు. ఎన్నో కీలకస్థావరాలను ఏర్పరచుకున్న వీరు విద్యార్థులనూ, యువనాయకులనూ ఎంతో ఆకర్షించారు. పశ్చిమబెంగాల్, ఆంధ్ర, కేరళలలో మనుషులను చంపే ఉద్యమం చేపట్టారు. వందలజనాన్ని దారుణంగా చిత్రహింసలపాలు చేస్తూ పైశాచికానందాన్ని పొందేవారు.

ఐతే ఈ విప్లవసాయుధ పోరాటం అంచనా వేయటంలో నక్సలైట్, కమ్యూనిస్టులు పొరపాటు పడి, ఆధునిక ప్రభుత్వ యంత్రాంగాల బలగాన్ని అంచనావేయలేకపోయారు. ప్రజల్లో తగినంత ప్రచారంగానీ, సానుభూతిగానీ లేకుండానే వీరు ఉద్రేకపడి తుపాకీ పట్టారు. పశ్చిమబెంగాల్లో నక్సల్‌బరీ ప్రాంతం, ఆంధ్రాలో శ్రీకాకుళం ఏజన్సీ ప్రాంతం విముక్తి పొందినట్టుగా ప్రకటించారు. కానీ అచిరకాలంలోనే ప్రభుత్వం ప్రత్యేక పోలీసుబలగంతో చాలామందిని వశంచేసుకుంది. స్వచ్ఛందంగా లొంగిపోయినవారికి శిక్షరద్దుచేసింది. వారు మామూలు మనుషులుగా మారటానికి పునరావాసాలూ, వారి అర్హతలకనుకూలంగా వృత్తులు కల్పించటానికి ప్రభుత్వం ముందుకొచ్చింది.

కృషిలో భాగంగానే నక్సలైట్ల తీవ్రవాదాన్ని అరికట్టటానికి ప్రచారసాహిత్యాన్ని జనంలోకి తీసుకురావాలని ప్రయత్నించి కొంతవరకు సఫలమైంది. ప్రభుత్వ ప్రచారానికి నాటకరంగం ఒక సాధనంగా ఉపయోగించింది. రాష్ట్రప్రభుత్వం కోరికమేరకు తన అనుభవాలను క్రోడీకరించి, జ్ఞాపకాలను తవ్వి తీసి, వాస్తవికతతో రంగరించి ఆధునిక పాఠకులకు అందించిన నాటకరాజమే భారతి.

దూరదర్శన్‌లో ధారావాహికంగా ప్రసారం చేయబడిన ఈ నాటకం ఎంతో ప్రేక్షకాదరణను పొందింది. ఇరవైఎనిమిది ఘట్టాలుగా సాగే ఈ నాటకంలో విప్లవం పేరుతో జరుగుతున్న హేయమైన కృత్యాలను కళ్ళకు కట్టినట్టు చూపించారు. ఈ నాటకం చదువుతున్నప్పుడుగానీ, ప్రదర్శన తిలకిస్తు న్నప్పుడుగానీ, అనుభూతి ప్రధానంగా కాక, ఆనాటి ఆటవికపరిస్థితులు మన ఎదుట సాక్షాత్కరిస్తాయి. సామ్యవాదమే నిజమైన ప్రజాస్వామ్యం అనినమ్మే 'భారతి'ని కమ్యూనిస్ట్ పార్టీ సిద్ధాంతాలతో, విప్లవ లక్ష్యాలతో తమతో కలుపుకోవాలని చూస్తాడు విప్లవ విద్యార్థి నాయకుడు శేఖర్. ఆమెనొక స్త్రీగా తన కోరికకూ, సైద్ధాంతికంగా తన పార్టీకీ బలి చేయాలనుకుంటాడు లెక్చరర్ కృష్ణ. ఆమెను ప్రేమించే బావగా తన అభిప్రాయాలకు విలువివ్వాలనీ, తన లక్ష్యాని సమర్థించాలనీ ఆశపడతాడు ఆనంద్ కానీ ఎవరి ఆశయాలకూ, ప్రోద్భలాలకూ, సిద్ధాంతాలకూ లొంగక ఆత్మవిశ్వాసంతో తనదైన దారి సెంచుకుని ఆ లక్ష్య సాధనకు ఎన్నో ఒడుదుడుకులను అధిగమించి, భారతి కథానాయికగా విజయాన్ని చేపట్టటమే ఈ నాటక లక్ష్యం.

భీభత్సరసం ప్రధానంగా సాగే ఈ నాటకంలో సమాజంలో గౌరవనీయ మైన వృత్తిలో కొనసాగే వ్యక్తీ, బోధనావృత్తిలో విద్యార్థులను అభ్యుదయపథంలో నడిపించవలసిన అధ్యాపకుడూ పైకి సామ్యవాదిగా కనిపిస్తూ, తెరవెనుక మహోక్రూరుడుగా విప్లవాన్ని నడుపుతుంటాడు. యువ విద్యార్థులకు గురువైన ఇతడు ఆ విద్యార్థుల్లోని ఆవేశాన్నీ, ఉడుకురక్తాన్నీ తనకనుగుణంగా మలచు కుంటూ, ఎన్నో సంఘ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడు తుంటాడు. ఇతనికి సహాయ కారిణిగా అరుణ అనే లెక్చరర్ పని చేస్తుంటుంది. వివాహిత, పిల్లలతల్లీ అయిన ఈమె కృష్ణకు కుడి భుజంలాంటిది. విద్యార్థులకు తీవ్రవాదాన్ని నూరిపోస్తూ, ఆ జట్టుకు తనకు మిత్రుడైన శేఖర్‌ను నాయకుడిగా కృష్ణ నియమిస్తాడు. ఈ శేఖర్ పాలుపడని అకృత్యాలు లేవు. భారతి మేనమామ సుందరం అతని భార్య రాధ, ఆనాటి సాయుధ పోరాటానికి ఆకర్షితులై తామూ ఆయుధం పట్టి రంగంలోకి దిగినా, త్వరలోనే సిద్ధాంతాలకూ, నిజానికీ గల వ్యత్యాసాన్ని గుర్తించి స్వచ్ఛందంగా ప్రభుత్వానికి లొంగిపోతారు. పునరావాస

సౌకర్యాన్ని పొందినవీరు 'నిజం' అదే దిన పత్రికను స్థాపిస్తారు భారతి అందులో "ఇన్వెస్టిగేటివ్ జర్నలిస్ట్". వీరినివాసం పట్నమే అయినా, భారతి పల్లె పల్లెకూ తిరిగి గ్రామీణుల సమస్యలను, వారి అవసరాల్నీ పరిశోధించి, పత్రికలో ప్రచురిస్తుంటుంది. తన నాట్యకళ ప్రజలకు ఉపయోగపడాలని వారిమధ్యకు వెళ్ళి విప్లవానికి వ్యతిరేకంగా, నాట్య ప్రదర్శనలిస్తుంటుంది. సాటి మనిషికి ప్రాణంపోయలేని మనిషి స్వజాతినే హతమార్చటం నీచాతినీచమనీ, రాతియుగపు లక్షణమనీ ఆ దశను విడనాడి ఆధునికతను నేర్చుకోవాలనీ భారతి దృఢాభిప్రాయం.

సంఘం మారాలంటే ఎదుటివాడి ప్రాణం తీయటం కాదు. అవసరమైతే తన ప్రాణాలను తృణప్రాయంగా అర్పించే గాంధీజీగా, పొట్టిశ్రీరాములుగా మనిషి మారాలని అలాంటివారివల్లనే ఈ సమాజం మంచి మార్పును పొందుతుందనీ భారతి విశ్వాసం. నాటకంలో ఆమె సంభాషణలు మానవత్వం మూర్తీభవించేటట్టుగా రచించారు. రాక్షసంగా మనిషిని చంపే నక్సలిజంలో రహస్యాలు, అబద్ధాలు నిండి ఉంటాయనీ, విప్లవం పేరుతో వీరు సాగించే అరాచకాలనూ, హత్యాకాండలను బయటికి వెల్లడించిన వారందరినీ పొట్టన పెట్టుకున్నారని భారతి ఆక్రోశిస్తుంది. నక్సలిజానికి ప్రజాస్వామ్యం నచ్చదనీ దేశాభివృద్ధి గిట్టదనీ, ఒకదశలో బావనే నిలదీస్తుంది. భారతి, కారల్‌మార్క్స్ ఈనాటికీ ఋషితుల్యుడేననీ, తుపాకీతో మంచి పేరూ డబ్బూ ఉందని వాసన బట్టి అనేక వ్యాపార సంస్థలు తాము చేసే హత్యలు, దోపిడీలకు అందమైన మార్క్స్ సిద్ధాంతపు బురఖా తగిలించుకుని జనాన్ని పీడిస్తున్నారని ఆరోపిస్తుంది.

హఠాత్తుగా పుట్టుకువచ్చే విప్లవాలు చిరకాలం నిలిచినా, నిలువకున్నా పనిచేసేవాడికి అంతులేని ఆవేశాన్నీ ఉత్సాహాన్నీ ఇస్తాయి. కానీ పరిణామక్రమంలో వచ్చే మార్పు శాశ్వతంగా ఉంటూ, పునాదులను గట్టి పరచుకుంటుంది. ఆ మార్పు మనకుకన్పించదు. విస్మయపరచదు. అందుకే అది ప్రజలను ఆవేశపరచి, ఆకర్షించదు. తన సత్యాగ్రహంతో తత్వవేత్తల భావనాబలంతో అంతులేని మారణహోమంద్వారా సంఘాన్ని మార్చే పాతకాలపు అనాగరిక పద్ధతిని మన గాంధీజీ నిరసించాడు. కేవలం ఆత్మబలంద్వారా అతిసున్నితంగా సంఘాన్ని మార్చే పద్ధతిని ప్రవేశపెట్టి విజయం సాధించాడు. మనమిప్పుడు చేయవలసిందల్లా సంఘాన్ని మనం అనుకునే పద్ధతులలో అంచెలంచెలుగా ఆధునికతకనుగుణంగా అభివృద్ధిపరచటమే. ఈ వాదన భారతినాటకంతో ప్రతి ఘట్టంలోనూ ప్రతిఫలిస్తుంది.

ఇక మహాకాంమేడ్ విప్లవనాయకుడైన లెక్చరర్ కృష్ణ భావాలు ఆనాటి విప్లవకారుల నినాదాలకు ప్రతిధ్వనుల్లా అన్పిస్తాయి. ఈ విప్లవాలకు ప్రజాబలాన్ని ఎలా కూడగట్టాలో వివరిస్తూ, కృష్ణ చదువుకున్న యువతీయువకులను ఆదర్శాలమత్తుమందుజల్లి చదువురాని మూర్ఖులను మా చావంతా మీకోసమేనని రంజింపచేసి వారిని వలలో వేసుకోవాలనీ, ఆ తర్వాత అవతలివైపుకు తిరిగిపోలేని అతిభయంకరమైన నేరాలు వారిచేతచేయించి వారిని ఎందుకూ పనికిరాకుండా చేయాలనీ చెపుతాడు పరమనీచంగా ఒక మహాసిద్ధాంతాన్ని నమ్ముకున్న పార్టీపేరుతో తన అసహ్యకరమైన భావాలను వెదజల్లుతాడు ఇంకోసారి.

తీవ్రమైన కోరికలు నిర్లజ్జగా తీర్చుకోవటమే విప్లవమనీ, ఈ మహావిప్లవం ఆదర్శాలకు బలయ్యే చదువుకున్న యువతరం, అజ్ఞానంలో ఎవరినైనా చంపగల చదువుకోని మూర్ఖజనం, స్వంత ఆలోచన లేని సగటు మూగజనం. మనదేశంలో ఉన్నన్నిరోజులూ విప్లవాలకు కొదువలేదంటాడు. ఎందరోమాజీ విప్లవకారుల త్యాగఫలితంగా మన మేధావుల్లో మనకొక విప్లవపు బేస్ ఉందనీ, దాన్నీ, తుపాకులంటే భయపడే జనాన్నీ ఆధారం చేసుకుని పవర్నూ, డబ్బునూ సంపాదించటమే విప్లవమని వక్రభాష్యం చెపుతాడు.

· తన ప్రజాకోర్టులో, విప్లవతీర్పుల పేరిట తన వర్గానికి చెందని వారందరినీ చంపిస్తుంటాడు. అరుణ భర్త నిరంజన్ను అరుణ చేతే చంపిస్తాడు. ఆనంద్తల్లి రాధాదేవిని అతని చేతే కనుగుడ్లు పీకించేస్తాడు. వీరాస్వామి తండ్రిరంగన్నను అతనిచేత చంపించి, సభ్యసమాజం తలవంచుకునేలా, నాగరికులు తలదించుకునేలా ఆ తండ్రి రక్తాన్నే అమృతం లాగా తాగిస్తాడు. అదేమని ఆనంద్ నిలదీస్తే దారుణంగా చంపేస్తాడు. చివరికి తన రహస్యాలు, మోసాలు తెలుసుకున్న శేఖర్ భారతి ప్రోద్బలంతో పోలీసులకు లొంగిపోయి, విప్లవపార్టీ గుట్టు మట్లూ, సమాజంమీద, తన అభిప్రాయాలు పోలీసులకు చెపుతాడన్న భయంతో అతన్ని కూడా హత్య చేయబోతాడు.

ఐతే అతనితో కలిసి ఉంటున్న అరుణకు ఈ హత్యలు, చిత్రహింసలవల్ల మనసువిరిగి జ్ఞానోదయమవుతుంది. మోసానికి మోసమే విరుగుడుగా అమాయకుడైన వీరాస్వామినే ఆయుధంగా మలచుకుని ఏ మహాకాంమేడ్గా ·కృష్ణ అమాయకులను వధించాడో అదేహోదాలో మహా విప్లవకార్యకర్తగా తనే అతన్ని బందీని చేసి హత్య చేయమని ఆదేశిస్తుంది. కానీ, భారతి, శేఖర్, పోలీసులు ప్రవేశించడంతో కృష్ణనూ, అరుణనూ తదితరకార్యకర్తలందరినీ

జైలుకు తరలించడంతో నాటకం ముగుస్తుంది. కోపల్లె శివరాం ఈ నాటకానికి పాటలు రచించాడు. ఆ గేయాలన్నీ ప్రేక్షకులను రంజింపచేస్తాయి.

తరతరాల మంచిని తనలో నిలుపుకుని గంభీరంగాసాగే జీవనదిలాంటిది సత్సంప్రదాయం. ఆ నదిలో సుడిగుండాలు ఏర్పడి మాయమైనట్టే కాలవాహినిలోనూ అనేక రకాల మార్పులు ఏర్పడి సమసిపోతూంటాయి. తాత్కాలికంగా తప్ప ఆ మార్పులకు శాశ్వతంగా నిలబడగల బలంలేదు. కాకపోతే తుఫానుకు మహావృక్షాలుసైతం నేలకొరిగినట్టుగా మాధవీలతలు సైతం మాసిపోయినట్టుగా కొందరు నిజమైన ప్రజాసేవకులు, ఎందరో అమాయకప్రాణులూ హతమారక తప్పదు. సజీవమైన మార్పు ప్రజల మనస్సుల్లో నుంచి ప్రజాభ్యుదయం వైపు సాగుతుంది. కానీ బలవంతంగా తుపాకీ గొట్టాలతోమాత్రం శాశ్వతమైన మార్పురాదని భారతినాటకం ఋజువుచేస్తుంది.

ఒకప్పుడు పరదాస్య విముక్తిని హింసతోగాక అహింసతో, సత్యాగ్రహం తోనేపొందగలిగాం. బాల్యవివాహాలు, సతీసహగమనాలూ, ఆచారంగా ఉన్నప్పటికీ ప్రజల భావనాబలంతో క్రమేణా కాలానుగుణమైన స్వచ్ఛందమైన మార్పుతో అవి తొలగిపోయాయి. వాటిని నిర్మూలించటానికి ఎవరూ తుపాకులు పట్టలేదు. నియంతృత్వమూ చలాయించలేదు. తమ పురోభివృద్ధిని ప్రజలెప్పుడూ ఆహ్వానిస్తూనే ఉన్నారు. అలా ప్రజాభీష్టంతో లభించే నూతనమైన మార్పు కలకాలం నిలవడమేగాక ఎన్నో కొత్తమార్పులకు అది పునాదిగా నిలుస్తుంది. తాత్కాలికమైన విప్లవావేశాలద్వారా లభించే మార్పుక్షణికమేనని, శాశ్వతంకాదని ఈ నాటకంద్వారా రచయిత నిర్ధారించారు.

## కొడిగట్టిన దీపాలు :

నరసింహారావుగారీ నాటకాన్ని 1974లో రచించారు. మూడురంగాలుగాసాగే ఈ నాటకానికి శ్రీరామకవచం సత్యనారాయణగారు పాటలు రచించారు. గ్రామీణవికాసానికీ గ్రామస్థుల సౌకర్యాలకూ తోడ్పడే పథకాలను ప్రభుత్వం ఎన్నింటినో రూపొందిస్తున్నప్పటికీ స్వార్థపరులు, అవినీతిపరులైన ఒక గ్రామంలోని ప్రభుత్వోద్యోగుల చేతుల్లో ఆ ఊరిప్రజలుపడిన ఎన్నో బాధలను, అష్టకష్టాలనూ, ప్రాణాపాయాలను దయనీయంగా చిత్రించారు ఇందులో నరసింహారావుగారు చమురులేని దీపం ఎలా కొడిగట్టిపోతుందో, ప్రభుత్వ

సహాయసహకారాలు సక్రమంగా అందని కొన్ని గ్రామాలుకూడా ఆ విధంగానే కొడిగట్టిపోతున్నాయని ఈనాటకం ద్వారా నిరూపించారు. గ్రామీణ ప్రాంతాలలో ఈ నాటకం ఎన్నోసార్లు ప్రదర్శింపబడింది.

మనదేశంలో గ్రామీణ సమస్యలపట్ల స్వాతంత్ర్యానంతరంకూడా కేంద్రంలోగానీ, రాష్ట్రంలోగానీ చురుకైన కదలికరాలేదు. పరపీడనలో దారుణంగా బలయిన మనగ్రామాలు స్వపాలనపై పెట్టుకున్న ఆశలేవీ తీరలేదు. తరతరాలుగా గ్రామసీమలు ఎన్నో సమస్యల నెదుర్కొంటున్నా వాటిని పరిష్కరించదలచుకునే అధికారులే కరవైనారు. ఆస్థిహక్కు, దున్నేవానిదే భూమి, పంటల పశువులకు భీమా, ధరల స్థిరీకరణ, కమతాల ఏకీకరణ, భూ సంస్కరణలు, నీటివనరులు, గ్రామీణ విద్యుదీకరణ, పన్నుల భారం, గ్రామపునరుద్ధరణ లాంటి అసంఖ్యాక మౌలిక సమస్యలతోపాటు నిరక్షరాస్యతా రక్కసి కోరలనుండికూడా గ్రామసీమలు విముక్తి పొందలేదు. దేశానికి వెన్నెముక లాంటి రైతులే ఎక్కువగల మనదేశంలో వారే శ్రమకు తగిన ఫలితాన్ని పొందలేకపోతున్నారు. రాజకీయ, ఆర్థిక రంగాల్లో సంఖ్యాధిక్యతరీత్యా భాగస్వామ్యం పొందటంగానీ, సామూహిక ప్రయోజనాలు పొందటంలోగానీ, సంఘటిత శక్తిని పుంజుకోవటానికిగానీ వారు ఇతర వర్గాలకంటే చాలా వెనుకబడి ఉన్నారు.

మన ప్రజాస్వామ్య వ్యవస్థ ద్వారా ఏర్పడుతున్న ప్రభుత్వాలు, ఉద్యోగస్థుల్ని, పారిశ్రామికుల్నీ, రాజకీయమే వృత్తిగా పెట్టుకున్న వారినీ, వర్తక వాణిజ్య వర్గాలవారినీ బలపరచడానికే ఉపయోగ పడుతున్నాయిగానీ, మన పంచాయితీ రాజ్యం గ్రామవ్యవస్థను బలపరచలేకపోగా అది పెత్తందారుల హస్తగతమై బంధుప్రీతికీ, కులతత్వాలకూ, ఆశ్రిత పక్షపాతాలకూ, అక్రమాలకూ అన్యాయాలకూ నిలయమైపోతుందని ఈ నాటకంలో తెలిపారు. ఏదేశంలోనైనా అధికసంఖ్యాక ప్రజలకు ఆర్థిక, సాంఘిక, రాజకీయ ప్రయోజనాలు అందుబాటు కానంతకాలం దాన్ని ప్రగతి అనలేము. ప్రభుత్వ యంత్రాంగంలో గ్రామీణ ప్రణాళికా, పెట్టుబడులు ఎన్నిరెట్లుపెరిగినా, అక్కడి ప్రజల మౌలిక సమస్యల్ని ఏ ఒక్కదాన్నీ పరిష్కరించలేకపోగా, గ్రామీణులను మరింత ఇబ్బంది పెడుతున్నాయనీ వివరించారు.

రైతంటే భూమిని నమ్ముకుని, పెట్టుబడి పెట్టి, శ్రమించి, పర్యవేక్షించి, అతివృష్టి, అనావృష్టి, అకాలవృష్టీ, గాలివానలు చీడపురుగుల్లాంటి ప్రకృతి

ఒడుదుడుకులను ఎదుర్కొంటూ ఈదేశ ఆర్థిక విధానానికి వెన్నెముకగా నిల్చి జాతికి అన్నదానం చేసేవాడు. ఆ రైతులను వారి వృత్తికి తగ్గట్టుగా ప్రోత్సహించి, ఆదరించాల్సిందిపోయి ప్రభుత్వోద్యోగులపేరుతో నేటి చదువుకున్న విద్యావంతులు అధికార దుర్వినియోగంతోపాటు, అమాయక ప్రజలను ఏవిధంగా మోసగిస్తున్నదీ తెలిపే దయనీయమైన గాధే ఈ నాటకం.

రచయిత మనసులో ఎన్ని సంవత్సరాల వ్యధ దాగిందో, తరతరాలుగా గ్రామీణులు పడుతున్న బాధాశకలాలు ఎన్ని గుచ్చుకున్నాయోగానీ, ఈ నాటకమంతా కరుణరసార్ద్రంగా సాగిపోయింది. ప్రదర్శనలోగానీ, పఠనంలోగానీ, కరుణరసా విష్కృతులను చేయటంలో రచయిత కృతకృత్యులయినారు. ఈ నాటకం సమస్యా ప్రధాన నాటకంగా ఎంతోపేరు పొందింది. ప్రతి గ్రామంలోనూ రైతాంగానికి అధికవడ్డీల బాధలు అవధులు దాటిని అప్పుల బాధ, తలక్రిందులు చేస్తున్నాయి. ముక్కిన జొన్న సంకటిని తాను తింటూ పట్టణవాసులకు పలావు బియ్యానందిస్తున్నరైతుకు, అతడు ఉత్పత్తిచేసిన ధాన్యానికీ, వాణిజ్యపంటలకూ సక్రమమైన ధరలు, శాస్త్రీయంగానూ, న్యాయసమ్మతంగానూ, ప్రభుత్వం స్థిరీకరించలేక పోయింది. ఫలితంగా మధ్యవర్తులు, దళారీలు, కలుపుమొక్కల్లా, చీడపురుగుల్లా, రైతులను దోచుకునే అన్యాయమైన విధానాన్ని ఈ నాటకంలో వివరించారు.

గ్రామీణాభ్యుదయానికి ప్రభుత్వం ప్రవేశపెడుతున్న ఎన్నో ప్రణాళికలు కాగితాల్లోనూ, అధికారుల అవినీతిలోనూ మగ్గిపోతున్నాయి. కానీ నిజమైనఫలితాలను ఇవ్వటంలేదు. అందుకీ నాటకరచనే సజీవసాక్ష్యం కొడిగట్టిన దీపాల్లో ప్రధాన ఇతివృత్తం ప్రభుత్వాధికారుల మోసాలవల్ల బడుగువర్గాలు ఎదుర్కొంటున్న సమస్యలు, రైతుల సమస్యల్ని పరిష్కరించి వారిని వృత్తిలో ప్రోత్సహించమని ప్రభుత్వం ఎన్నో కోట్లు ఖర్చుపెట్టి పల్లెపల్లెకూ ప్రభుత్వాధికారులను పంపిస్తుంటే, ఈ అధికారులే పెత్తందార్లతో కుమ్మక్కయి, అక్కడి ప్రజలకు వీరేసమస్యలుగా పరిణమిస్తున్నా రనటానికి ఈ నాటకమే ఉదాహరణ.

అవటానికి పేదవాడే అయినా భవిష్యత్తుమీద ఎన్నో ఆశలుంచుకున్న యాదగిరి ఈ నాటకంలో కధానాయకుడు. తన పూర్వీకులనుండి సంక్రమించిన భూమి కొద్దిగానే ఉన్నా అందులోనే ప్రభుత్వ ప్రణాళికా సంఘంవారు ఏర్పరచిన ఎన్నో ప్రణాళికలననుసరించి, నూతన విధానాలను అమలుపరచి ఉన్నదానిలోనే

అధికలాభాలు గడిచాలనుకుంటాడు. ఆ ఊరికి ప్రభుత్వంవారు చెరువుకు కట్టపోయాలని సంకల్పిస్తారు. అది ఆ గ్రామంలోని అందరి ఆమోదం పొందిన ఒక వ్యక్తికి కాంట్రాక్టు ఇస్తామంటారు అందుకు వడ్డీవ్యాపారి విశ్వనాథం ముందుకు వస్తాడు. ఆ చుట్టుపక్క పల్లెల్లో అతను అధికవడ్డీకి అప్పీయని రైతేలేడు. ఐనా గత్యంతరంలేక అతనికే అందరూ ఆమోదం తెలుపుతారు.

గ్రామాభ్యుదయంకోసం ప్రభుత్వంవారు ఆ ఊరికి బ్యాంకునూ, ఒక ఆఫీసరునూ, ప్రభుత్వ పాఠశాలనూ, ప్రసూతిశాలను నెలకొల్పుతారు. ఈ సదుపాయాలన్నీ సవ్యంగా అమలుపరచటానికీ ఒకరిని నియమిస్తుంది. ప్రసూతి వైద్యశాలకు లేడీడాక్టర్‌నూ పంపుతుంది. ప్రజల బాగోగులను సరిదిద్దవలసిన వీరే పెత్తందారు విశ్వనాథంతో అవినీతిగా చేతులు కలుపుతారు. గ్రామస్థులను చెప్పరాని బాధలపాలు చేస్తారు.

వీరి ఆగడాలలో ముఖ్యంగా తమతమ వృత్తులలోని ప్రభుత్వ విధానపు లొసుగుల నాధారం చేసుకుని, ఎంతో డబ్బు తమ విలాసాలకు ఖర్చుచేస్తూ స్వంతఅవసరాలు తీర్చుకుంటూ ఆ ఖర్చులను రైతులపైకి నెట్టి, వారికి మంజూరయిన ఎరువులకూ, విత్తనాలకూ కోత విధిస్తారు. మిగిలిన వనరులను అధికలాభాలకు విశ్వనాథానికే అమ్ముకుంటారు. వీరి వంచనకు ఎందరో అమాయక రైతులు బలవుతూంటారు.

యాదగిరి విషయంలోకూడా ఇలాగే జరుగుతుంది. అతనికి మంజూరయిన నాలుగుబస్తాల ఎరువులను వేలిముద్రలు వేయించుకుని ఒకే బస్తాయిస్తారు. అన్నింటికీ డబ్బు వసూలుచేస్తారు. చెరువుక్రింద ఉన్న పొలంలో పంట పండిస్తే ప్రభుత్వం 3% భరించి పదేళ్ళదాకా వడ్డీలోరాయితీ యిస్తుందని వేలిముద్ర వేయించు కుంటారు. తీరా పన్నుకట్టాక చెరువుకు కట్టతెగిపోతుంది. రైతులకు ఋణ భారమే మిగులుతుంది. ఆ అప్పులు కట్టలేక యాదగిరి ఆస్థి అంతా కరిగిపోతుంది. ఐనా గుండెధైర్యంతోనే ఉంటాడతను. తన భార్య ప్రసవవేదన పడుతోందని, ఆమెను కాపాడమనీ లేడీ డాక్టరును ఎన్నోవిధాల బ్రతిమాలుతాడు. కానీ ఆ 'కంట్రీ ఉమెన్' కాన్పు చేయటానికామె ఒప్పకోదు. ఫలితంగా యాదగిరి భార్య బిడ్డతోసహా మరణిస్తుంది.

ఎన్నో ఆశలు కుటుంబంమీదా, వ్యవసాయంమీదా పెట్టుకున్న యాదగిరి వాస్తవాన్ని చూసి నిలువునా కూలిపోతాడు. బాధను భరించలేక పిచ్చివాడవుతాడు. ఏ ప్రభుత్వమైతే ఆవూరికి చెరువు కట్టనూ, విత్తనాలనూ మంజూరుచేసిందో, ఆ

ప్రభుత్వ నాయకుడే ఒకరోజు తనఖీకి వచ్చి జరిగిన పరిస్థితులకు బాధపడి, డాక్టరునూ, అధికారినీ హెచ్చరిస్తాడు. ఐనా వారిలో మార్పురాదు. యాదగిరి కొడుకయిన గోపాలం చాటుగా మళ్ళీ నాయకుడికి ఉత్తరం వ్రాస్తాడు. లాభంలేదని ఆయన పోలీసు జవానురూపంలో వచ్చి, ఇంకాబుద్ధిరాని, అధికారినీ, డాక్టరమ్మనూ ప్రత్యక్షంగా పట్టుకుంటాడు. నాటకీయమైన ఈ సంఘటనకు వారు బిత్తరపోయి, మర్యాదగానే ప్రభుత్వానికి లొంగిపోవటంతో నాటకం సమాప్తమవుతుంది.

విషాదాంతమైన ఈనాటకం కరుణరసప్రధానంగా నడిచింది. ప్రభుత్వంత్రికరణశుద్ధిగా రైతాంగానికి సహాయపడదలచినా, ఆ లక్ష్యం నెరవేరకపోవటానికి ఇలాంటి అధికారులే కారణమని చెప్పవలసి వస్తుంది. ప్రభుత్వం చిత్తశుద్ధిగల అధికారులను మాత్రమే గ్రామాలకు పంపి, రైతులను నిజాయితీగా ఆదుకోవాలిగానీ ఇలా బాధపెట్టరాదని ఈ నాటకంలో వ్యధను కనబరచారు రచయిత. ప్రజల కష్టాలను తీర్చటానికి ప్రయత్నించినప్పుడే నిజమైన ప్రభుత్వమనిపించు కుంటుందిగానీ ఏదో సహాయాన్ని అందిస్తున్నామనుకుని ఓటుకోసం మాత్రమే ప్రజలనుదర్శించే ప్రభుత్వం వెన్నెముకవిరిగినమనిషి లాంటిదవుతుంది. ఐనా సమాజాభ్యుదయాన్నాశించే, రచయితలు ఎప్పుడూ తమ కర్తవ్యాన్ని మరచిపోరు. పెడదారి బట్టిన ప్రభుత్వాధికారుకూ, వారి విధానాలకూ చురకవెయ్యటానికి ఎప్పుడూ ఇలాంటి 'కొడిగట్టినదీపాలు' రచింపబడుతూనే ఉంటాయి. నరసింహారావుగారి అన్ని నాటకాల్లాగా ఈ నాటకం గ్రామీణులకు గాక, ప్రభుత్వానికే కనువిప్పు కల్గించింది.

**కొత్తగుడి :**

1957 లో నరసింహారావుగాలీ నాటకాన్ని రచించారు. గ్రామజీవితాల్లో ప్రభుత్వ ప్రణాళికలవల్ల కలిగే నూతన మార్పుల్ని తెలియచేయటమే ఈ నాటకంయొక్క ముఖ్యోద్దేశ్యం. ఈ నాటకం గ్రామాల్లో యాభైసార్లకుపైగా ప్రదర్శితమైంది. గ్రామసీమలు పురోగమించాలని నరసింహారావుగారు రచనారూపకంగా చేపట్టని ప్రక్రియలేదు. భారతదేశంలో గ్రామాలకు పెద్ద పీటవేసి గ్రామీణులను సంస్కరించాలని అభ్యుదయ వాదులంతా పట్టుబడతారు. ఎందుకంటే ఆర్థికంగా ఆమనదేశంలో నూటికి ఎనభైమంది వ్యవసాయం మూలంగా జీవిస్తున్నారు. కానీ వారు వ్యవసాయానికి అనుసరిస్తున్న పద్ధతులు చాలా పురాతనమైనవి. ప్రస్తుతం శాస్త్రీయ పరిశోధనల మూలంగా కనుక్కోబడిన

ఎన్నో నూతన విధానాలు, పరికరాలు వీరికి తెలియకపోవడంవల్ల వారి ఆర్థికస్థితి చాలా శోచనీయంగా ఉంది. సంవత్సరమంతా కష్టపడ్డా వీరిలో ఒక్కొక్కరికి వచ్చే సంవత్సరాదాయం వేయికిమించవు. ఇంగ్లండ్‌లో ఇంతకన్నా పదిహేను రెట్లూ, అమెరికావారు పద్ధెనిమిది రెట్లూ సంపాదిస్తున్నారు. ''వరి, గోధుమలు, పత్తి, చెరకు మొదలైన పంటల విషయంలో ఎకరా ఒక్కింటికి మనరైతులు పండించే పంట చాలా తక్కువ. జపాన్, ఇంగ్లాండ్, అమెరికా, ఈజిప్ట్, మొదలైన దేశాల్లో పండే పంట ఎన్నోరెట్లు ఎక్కువ. ఐతే ఇందుకుకారణం ఎరువులు, విత్తనాలు, పనిముట్లు, పశుపోషణ మొదలైన వాటిని గురించి మనరైతులు ఎన్నో కొత్త సంగతులు నేర్చుకోవాల్సి ఉంది.'' [2]

ఐతే పనిగట్టుకొని గ్రామాల్లో వెలుగునింపటానికి ప్రయత్నించే తీరికా, ఓపికా ఎవరికీ లేవు. గ్రామాలలో సరయిన కనీస సౌకర్యాలు కూడా లేక, ఏమేం సదుపాయాలున్నాయోకూడా తెలియక గ్రామాలలో జనం నిరక్షరాస్యులై, కాయకష్టం తప్ప ఏమీ తెలియనివారై, తమ పూర్వీకులు చేసిన పనులనే తామూ ఈ నవీన యుగంలో కూడా చేస్తూ, పారిశ్రామిక యుగంగా కీర్తింపబడే ఈరోజుల్లోనూ మధ్యయుగపు అలవాట్లతోనూ, ఆలోచనలతోనూ ఎన్నో గ్రామాలు వెలుగుచూడటంలేదు. రోజంతా కాయకష్టం చేసినాకూడా గ్రామాల్లో కూటికీ, గుడ్డకూనోచుకోక, దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారెందరో నేడుకూడా ఉన్నారు. వీరంతా మన సోదరులే. భరతమాత ముద్దుబిడ్డలయిన కర్షకరత్నాలే వీరి బాగోగులను కనుక్కోవటానికీ, దేశానికింత తిండి పెడుతున్న అన్నదాతలకు సులువైన మార్గాలనూ, విలువైన సహాయసహకారాలనూ అందించటానికి ఇటు విద్యావంతులు అటు ప్రభుత్వం ఎంతోకొంత కృషిచేస్తున్నా అదేమయాలకీ చాలటంలేదు. ప్రభుత్వ కృషివల్ల పంచవర్ష ప్రణాళికలద్వారా, గ్రామాల్లో పాఠశాలలూ, గ్రంథాలయాలూ, ఆస్పత్రులూ, సరైన రహదారులూ మొదలైన కనీస సౌకర్యాలను కలుగచేయటానికి ప్రయత్నం జరుగుతున్నా గ్రామీణులలో చాలావరకు నూతన మార్పుల్ని అంగీకరించలేక స్తబ్ధులైపోయారు. వీరికి సహకరిద్దామన్న ప్రభుత్వానికీ అధికారులకూ, వీరేమాత్రం సహకరించరు. దానితో ప్రభుత్వాధికారులూ, ధనవంతులు వీరిని పశువులకన్నా హీనంగా చూడటానికి అలవాటుపడ్డారు. వీరు అన్నివిధాలా మోసపోవటానికి వీరి నిరక్షరాస్యత, దరిద్రమే బలమైన కారణాలు.

ఏ ప్రభుత్వమయినా, ప్రజల అనుమతితోనే గద్దెనెక్కే, నేటి ప్రజా స్వామ్యంలో, గ్రామాల్లో పురోభివృద్ధికి తోడ్పడే ప్రణాళికలను, పథకాలను

ఎన్నింటినో ప్రభుత్వం అమలుచేస్తుంది. ఐనాసరే ప్రయోజనంలేదు. ప్రభుత్వానికీ ప్రజలకు వారధిలాంటి విద్యావంతులు తమ కర్తవ్యం మర్చిపోయి హాయిగా బ్రతికేస్తున్నారు. కానీ ప్రజల బాగు కోరి కృషిచేసేవారూ, అభ్యుదయవాదులూ నిరంతరం ఈ బలహీనవర్గాల కోసం ఎంతో ఆరాటపడుతున్నారు. తమ ప్రయత్నంలో భాగంగా గ్రామీణులకు చేతనైనన్ని విధాలుగా తోడ్పడుతూ ఉన్నారు. ఈ కోవకే చెందిన నరసింహారావుగారు ప్రభుత్వ ప్రణాళికల పరమార్థాన్ని గ్రామీణ జనులకు సులభంగా అర్థమయ్యేలా చేయటానికి ఈనాటక రచనను చేపట్టారు. '' ఎందుకంటే నిజమైన ప్రగతివాదులు ఎప్పుడూ ప్రజలపక్షానే ఉంటారు. అందులోనూ శ్రామికులపక్షానే నిలబడి, వారిశ్రేయస్సుకోసమే పోరాటాలు సాగించి విజయాలు సాధిస్తారు. పంధొమ్మిదో శతాబ్దంలో ఉన్నతవిద్యలభ్యసించి ఉత్తమ సంస్కారం అలవరుచుకున్న ఉదాత్తవర్గాలలోని వ్యక్తులు బడుగువర్గాల వారి అవసరాలను, అడుగువర్గాల బాగునూ కాంక్షించి పాటుబడ్డవారే చరిత్రనుండి ఎన్ని ఉదాహరణలైనా ఇచ్చి ఈ సంగతి నిరూపించవచ్చు. రష్యాలో జమీందారీఫాయావర్గం నుండివచ్చిన' కౌంట్ లియో టాల్‌స్టాయ్' (1828-1910) తన రచనల్లో లక్షలాది రైతాంగం బాధలు, గాధలు, భావాలు, జీవనాలు, ప్రతిఫలింపచేశారు. ఆ పేదల పరిస్థితులను చిత్రించి, వారికోపాన్ని, ప్రతిఘటననూ చిత్రించారు. అందుకే టాల్‌స్టాయ్ రచనలను లెనిన్ 'రష్యావిప్లవానికి దర్పణం' అని మెచ్చుకున్నారు.'''[3]

నరసంహారావుగారి నాటకరచనలన్నీ ప్రజలను ముఖ్యంగా గ్రామీణులకు ఎంతో ఉపకరించేవి కావటానికి పై కారణాలే ప్రబల సాక్ష్యాలు. ఒక పెద్దచెట్టుని చిన్నగొడ్డలితో పడగొట్టగలిగినట్లే గ్రామీణులలోని కొండంత నిరక్షరాస్యతనీ, అజ్ఞానాంధకారాన్నీ, ఒక చిన్న దీపంతో, చిన్న ప్రయత్నంతో పారదోలగలగాలనే ప్రయత్నమే హర్షించదగింది. తమకు గల ఎంతో విషయపరిజ్ఞానాన్నీ, ప్రభుత్వ ప్రణాళికలను, రాజకీయ సమస్యలను గ్రామీణలభాషలో, వారి యాసలో, వారి కర్థమయ్యేట్లు ఈ 'కొత్తగుడి' నాటకంద్వారా ప్రదర్శించి చూపగలగటం ఒక్క ఈ నాటక రచయితకే సాధ్యమైంది.

నాగార్జునసాగర్ ప్రారంభోత్సవ సందర్భంగా అప్పటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారు, భారతదేశంలో నదులమీద కట్టే ఆనకట్టలు దేశానికి 'కొత్తగుడి' అని ప్రవచించారు. ఆ స్ఫూర్తితోనే రచయిత ఈ నాటకానికి 'కొత్తగుడి' అని నామకరణం చేశారు. 'కొత్తగుడి' పేరులోనే కాక వస్తువులోనూ వైవిధ్యమున్న నాటకం.

మామూలుగా కొత్తగా కట్టిన గుడి అనే అర్థంవచ్చినా, రచయిత ఊహే వేరు. బడుగువర్గాలలో సంస్కరణాత్మకమైన మార్పుకోసం, వారి అభివృద్ధికోసం, ఎన్నోకష్టనష్టాలకోర్చి, స్వార్థరహితులై, తోటివారికోసం, అదే గ్రామంలో నివసించే 'పంతులు' ఈ నాటకానికి కథానాయకుడు. వయసుతోపాటు విజ్ఞానాన్నీ పెంచుకున్న మానవతామూర్తి, అజ్ఞానంతో, జరిగే అన్యాయాన్ని ఎక్కడైనా ఎదిరించే విద్యాధికారి. స్కూలు మేస్టరుగానే ఉన్నా గ్రామస్థులు అతన్ని దేవుడుగా కొలవటానికి కారణం ఆయన అనుక్షణంవారిలోని నైరాశ్యాన్నీ, వెనుకబడ్డామనే భావననూపారద్రోలి, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించటమేకాక, వారితో వారి సమస్యలను అనుకూలంగా పరిష్కరించే నిజమైన విద్యావంతుడు. నిరక్షరులైన ప్రజలకు సాక్షరతాదీపం వెలిగించటాన్ని నేర్పిన మహనీయుడు పంతులు.

పశువుల డాక్టరు నిర్లక్ష్యంవల్ల కాంతయ్య పశువులు చనిపోవటమేగాక, ఊళ్ళో పశువులకూ ఆ వ్యాధి సోకటంతో ఆగ్రహాన్ని పట్టలేని పంతులు డాక్టరునెదిరిస్తాడు. అతని ముఖ్యమైన వివరాలన్నీ డైరీనే ఆయుధంగా ఉపయోగించి, గ్రామస్థులకు తనసేవలందించేలా చూస్తాడు. వారికి డాక్టరు మోసాన్ని తెలియచేయటమేగాక, ఎవరికి వారే తమ పశువులకు ఎలా వైద్యం చేసుకోవచ్చో, ఎదుటివారికి ఉపయోగకరంగానూ, తమకు జీవనాధారంగా ఎలా మలచుకోవచ్చో ప్రయోగపూర్వకంగా నిరూపించటంతో నాటకం సమాప్తమవుతుంది.

ప్రధానంగా సాగే కథ ఇదే ఐనా ఇందులో ఇంకా ఉపకథ లున్నాయి. అందులో ముఖ్యంగా నర్సక్క కథ. రాములు కథ, గంగులు కథ, పంతులు ఆత్మకథమొదలైనవి. ప్రధాన కథలోని ఈ ఉపకథలు ప్రాచీన నాటకలక్షణమైన 'ప్రకరిని' తలపింపచేస్తున్నాయి. నర్సక్క కథ: నాటకంలో ప్రధాన ఉపకథ ఇది. ఊళ్ళోకి డ్రామాకంపెనీవారితో వస్తుంది నర్సక్క. కాంతయ్య ఆమెను పెళ్ళి చేసుకుంటానని మభ్యపెట్టి, తనదాన్ని చేసుకుంటాడు. తీరాపెళ్ళి అనేసరికి ఇంతో డబ్బున్న అమ్మాయిని భార్యగా చేసుకున్నాను. ఈ డబ్బుతో నువ్వీ ఊరువదలి వెళ్ళిపోమంటాడు. కానీ కష్టాలకు ఎదురీదే ఆమె ఆ ఊళ్ళోనే పిల్లవాణ్ణికని పెంచుతూ, కూలిపని చేసుకుంటుంటుంది. పంతులు వయోజన విద్యాపథకంలో చేరి చదువు నేర్చుకుంటూ తనకు బాగా తెలిసిన విస్తళ్ళు కుట్టేపనినే కుటీర పరిశ్రమగా వృద్ధిచేసుకుని, కొడుకును చదివిస్తుంటుంది.

గంగులు కథ: ఇతడొక హరిజన యువకుడు. కాంతయ్య వద్ద గొడ్డుకన్నా

హీనంగా బతుకుతుంటాడు. తన కులవృత్తిని నిర్లక్ష్యం చేసి, దొరదగ్గర జీతముంటూ ఇబ్బందిపడుతూంటాడు. ఇతని పరిస్థితిచూసి పంతులు వయోజన విద్యనేర్పుతూ, చెప్పులుకుట్టే వృత్తిని ప్రోత్సహిస్తాడు. ఆ పనిలో కొత్తకొత్త పద్ధతులు, మెలకువలూ నేర్పుతాడు. తనచేతిలోని పనితోనే గంగులు, కుమ్మరికి చెప్పులిచ్చి కుండలూ, శాలవారికి చెప్పులనిచ్చి నేతబట్టలూ, చాకలివారికి చెప్పులిచ్చి బట్టలు శుభ్రం చేయించుకుంటాడు. డబ్బుతోపనిలేకుండా పంతులు, వృత్తివిద్యతోనే ఆర్థికస్థాయిని పెంచుకున్న గంగులు పెళ్ళిచేసుకుని ఇల్లుకట్టుకుని, వ్యాపారాన్ని అభివృద్ధిచేసుకుని హాయిగా బ్రతుకుతాడు.

పంతులు గతస్మృతులు : ఈ నాటకంలోని ప్రధానపాత్రధారి. గ్రామస్థులను అభివృద్ధిపథంవైపు మార్చటానికి ఆయన అహర్నిశలూ శ్రమించేవాడు. బీదకుటుంబంలో పుట్టి ఎన్నో కష్టాలు పడిన ఈయన స్వాతంత్ర్య పోరాటంతో, జైలులోనే తనజీవితాన్ని ఎక్కువకాలం గడపవలసి వస్తుంది. జైల్లో ఉన్నంతకాలం తన కొడుకును బాగా చదివించాలని ఎన్నోకలలుగన్న పంతులు విడుదలకాగానే తన కొడుకు జ్వరంతో మరణించాడన్న వార్తవిని కుప్పకూలిపోతాడు. కానీ అధైర్యాన్ని విడనాడి, తన కొడుకుమీద పెట్టుకున్న ఆశలే, దేశంలోని పిల్లలమీద పెట్టుకుని, కొన్ని వందలమంది గొప్పవారిని దేశానికందిస్తాడు. ఆ ధ్యేయంతోనే ఇంకా జీవిస్తుంటాడు. చివరకు కాంతయ్య తనను కొట్టినా, చంపించాలని చూసినా ఏమాత్రం భయపడకుండా ఆ ఊళ్ళోని అమాయక ప్రజలకు ఆత్మవిశ్వాసాన్ని పంచుతాడు. తనస్థలంలోనే పాకలుకూడా వేసి ఇచ్చి, అందులోనే వృత్తివిద్యా కార్యాలయాన్ని స్థాపింపచేస్తాడు. ఆ విద్యాలయ ప్రాంగణాన్నే కొత్తగుడిగా మలుస్తాడు.

మనిషి సంఘజీవి. తమజీవితంలో ఎవరైనా ఏదైనా సాధించ గలిగారంటే, ఎందరెందరో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అందుకు తోడ్పడివుండాలి. ఒక ప్రతిభావంతుడే నలుగురిని ప్రభావితులను చేయగలడు. పదిమందిని కూడగట్టుకుని, సామాజిక సౌకర్యాలను సమకూర్చుకోవటంకోసం శ్రమించేవాడే దేశానికి ప్రయోజనకారి. ఈ లక్షణాలన్నీ జన్మతః అబ్బిన కె. యల్. నరసింహారావు గారి కలంనుండి మాత్రమే కొత్తగుడి లాంటి ఎన్నో నాటకాలు వెలువడినాయి. నాటకరచనలద్వారా, ప్రదర్శనలద్వారా వీరు గ్రామ సీమలలో తీసుకు వస్తున్న మార్పులకు ఈ నాటకం సరికొత్త ఉదాహరణ. భాగ్యసీమలయిన పల్లెసీమలను ప్రగతి పథంలో నడిపించటానికి ప్రతివ్యక్తీ తనవంతు కృషిచేయాలని వీరు ఈ కొత్తగుడి నాటకంద్వారా తెలియచేశారు.

**కల్పతరువు :**

కుటీరపరిశ్రమలోని విలువనూ, వృత్తివిద్యల పరమార్థాన్నీ గ్రామీణులకు వివరించటానికి నరసింహారావుగారి నాటకాన్ని 1970లో రచించారు. ఈనాటకానికి కేంద్రప్రభుత్వం ప్రణాళికా పోటీల్లో ప్రథమ బహుమతినీ, అవార్డునూ ప్రదానంచేసింది. ఈ నాటకంలో గ్రామాలలోజనం తమ విలువైన తీరికసమయాన్ని ఎలా వినియోగించుకోవచ్చో, తద్వారా డబ్బును ఎలా సంపాదించవచ్చో చక్కగా చిత్రించబడింది.

అన్నదమ్ములైన పాపయ్య, భద్రయ్య, కమ్మరి వృత్తి ప్రధానంగా గలవారు. ఏరకమైన చెక్కతోనైనా, నిత్యావసర వస్తువులు, వ్యవసాయపు పనిముట్లూ, అందమైన కళాకృతులూ తయారుచేయగల సమర్థులు. పూర్వీకుల నుండి సంక్రమించిన పొలం కొద్దిగా ఉన్నా, అందులో తిండిగింజలయినా దొరికేవికావు. ఐనా వీరు తయారుచేసే పనిముట్లు పట్నాలలో భారీపరిశ్రమల్లో తయారైనంతనాణ్యంగా లేవని గ్రామస్థులు కొనేవారుకారు. అన్నదమ్ములలో పెద్దవాడయిన పాపయ్య త్రాగుబోతు. భద్రయ్య నూతన మార్పును, తమ జీవన విధానంలో అభివృద్ధినీ ఆశించే నిరంతర శ్రమజీవి. అన్న వ్యసనపరుడై అన్నీ నాశనం చేస్తున్నా చిన్నవాడినని ఏమీ అనలేకపోతాడు. క్రమేణా పాపయ్య హద్దులు మీరటంతో భద్రయ్య ఎదురుతిరగటం నేర్చుకుంటాడు. ఇద్దరూ ఏదో ఒకదానికి పొద్దస్తమానం కత్తులు దూసుకునేవారు.

వయసులో వీరికన్నా పెద్దవాడూ, దగ్గరివాడైన గురువులు గ్రామపెద్దయిన వీరయ్య తాతను పిలిపించి పంపకాలు సమానంగా జరిపిస్తాడు. దానితో ఇద్దరూ ఒకే ఇంట్లో విడిగానే కాపురముంటారు. పాపయ్య భార్య పిల్లలను ఎప్పడూ కొడుతూ విసుక్కునేవాడు. ఆ బాధ భరించలేని ఆవిడ పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళుతుంది. భద్రయ్య భార్య ఆదెమ్మ ఉన్నంతలో కాపురాన్ని గుట్టుగా నడుపుతూ, భర్తకు ఆర్థికంగా సాయపడాలని, అతని వృత్తిపనుల్లోనూ, కుటీర పరిశ్రమ (అంబర్ చర్ఖా) సాయంతోనూ ఎంతోకొంత సంపాదిస్తుంటుంది. కొడుకును శ్రద్ధగా పెంచుతూ వాడు బడిలో నేర్చుకున్న చదువును తాను ఇంట్లోనేర్చుకుంటుంది.

గ్రామంలోని సహకార సంఘంద్వారా భద్రయ్యకు ఒకజత ఎడ్లు, ఎరువుల బస్తాలు మంజూరవుతాయి. అప్పటికీ సమిష్టిగానే ఉన్న అన్నదమ్ములు ఇద్దరూ సంతకాలు పెట్టాలంటే పాపయ్యకూడా వేలిముద్ర వేస్తాడు. కానీ

డబ్బుమాత్రం కట్టనంటాడు. పంపకాల్లో కట్టవలసిన డబ్బు భద్రయ్య కట్టగానేపాపయ్య అవి విలాసాలకూ, త్రాగుడుకూ ఖర్చుచేస్తాడు. కష్టపడి పనిచేసుకుంటున్న భద్రయ్యమీద అకారణ వైరాన్ని పెంచుకుంటాడు. అతని వ్యవసాయానికి ఎరువులులేక పొలమూ తిండిగింజలు లేకుండా ఇల్లూ బోసిపోతున్నా పట్టించుకోక, కల్లుపాకదగ్గరే కాలం గడుపుతుంటాడు.

భద్రయ్య కష్టజీవి. తమ వృత్తికి సంబంధించిన నూతన విషయాలనూ, మెళకువలనూ, పట్నంలో అమ్మే పుస్తకాల ద్వారానూ, రేడియోలోని వ్యవసాయ కార్యక్రమాల ద్వారానూ తెలుసుకుంటూ శ్రద్ధగా నాణ్యమైన పనిముట్లు తయారుచేసి గ్రామస్థుల అవసరాలను తీర్చటమేగాక, ఆర్థికంగాకూడా బాగుపడతాడు. వ్యవసాయరంగంలో నూతనంగా వచ్చిన మార్పులను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, మంచి విత్తనాలనూ, ఎరువులనూ వాడుతూ అధికదిగుబడికోసం అహర్నిశలూ శ్రమిస్తుంటాడు. ఇతని భార్య ఆదెమ్మ సహనంగల ఇల్లాలు. గ్రామవాసులకు వృత్తివిద్యా, వయోజన విద్యా, కుటీర పరిశ్రమలు ఎంతవసరమో ముఖ్యంగా తీరికసమయాన్ని సద్వినియోగం చేసుకుని డబ్బుగా మార్చుకోవచ్చో రచయిత ఈ పాత్రద్వారా నిరూపించారు. నూలు వడుకుతూ అగ్గిపుల్లలు తయారుచేస్తూ అన్నివిషయాల్లోనూ భర్తకు సాయంగా ఉంటుంది.

గ్రామపెద్ద వీరయ్య తాత ముందు ఒప్పుకున్నట్టుగా, అనుకున్న విధంగా డబ్బుకట్టకపోగా, పాపయ్య తమ్ముడు పండించిన పొలంలోని ధాన్యాన్ని బలవంతంగా ఎత్తుకుపోతాడు. పొలం బాకీ తీర్చాలంటే ఆ ధాన్యాన్ని పంచాలంటాడు. భద్రయ్యకు గడ్డపారతో గాయపరచి ధాన్యాన్ని ఎత్తుకుపోతాడు. వీరయ్య జోక్యంతో పాపయ్య బుద్ధి చెప్పకుని, తప్పను ఒప్పకుని తమ్ముడినే క్షమించమంటాడు. పోలీసులకు రిపోర్టిస్తామన్న గ్రామస్థులను వారించి అన్నను ఇంటికి తీసుకెళ్ళటంతో నాటకం సమాప్తమవుతుంది.

ఈ నాటకం గ్రామీణులకు కుటీర పరిశ్రమలవల్ల వచ్చే లాభాలనూ, స్వయంశక్తినీ చాటటానికే రచించి, ప్రదర్శింపచేశారు రచయిత. ప్రభుత్వం ఏర్పాటుచేస్తున్న కల్పతరువులాంటి పథకాలలో గ్రామీణజనం సుఖ సౌఖ్యాలను ఎలా అనుభవించవచ్చో ఈ నాటకం ద్వారా చిత్రించారు. ఇరుగుపొరుగులతో ముచ్చట్లాడుతూ తమ తెలివితేటలనూ, విలువైన కాలాన్నీ, దుర్వినియోగం చేసుకోకుండా ప్రతివ్యక్తీ వికాసాన్ని పొంది, తద్వారా దేశవికాసానికి

తోడ్పడగలగటమే ఈ కల్పతరువు లక్ష్యం.

'జాతిపిత గాంధీజీ తమ స్వదేశీ సమితిని' గూర్చి ఉపన్యసిస్తూ ప్రత్యేవక్తీ తన ప్రథమకర్తవ్యంగా తనకు అత్యంత సన్నిహితులైన గ్రామీణులకు ఉపకారం చేయడంతో నిమగ్నులు కావాలనీ, మనపొరుగువారికి మనంచేసే పరిశుద్ధమైన సేవ దూరాన ఉన్నవారికీ వర్తిస్తుందనీ వివరించారు. వ్యక్తి ఎంతో విశ్వమంత అన్నసూక్తిని అవగతం చేసుకోవాలనీ, దూరపు దృశ్యాల మోజులతో భూమండలపు కొట్టకొనకు పోయి సేవచేయాలనుకునే వ్యక్తి భగ్నాశయుడవుతాడనీ భావించారు.

కాబట్టి ప్రత్యేవక్తీ చావటానికి సిద్ధంగా ఉన్న, స్వతఃసిద్ధమైన గుణంవల్లా, తదితర ప్రయోజనాలవల్లా పునరుద్ధరింపటానికి వీలయిన అన్నిరకాల గ్రామపరిశ్రమలనూ, కళలనూ తీసుకుని, వాటిని గూర్చి ప్రజలకు తెలియచేయాలి. దీనికి 'రాట్నం' ఎంతో ఉపయోగకరమైన ఉదాహరణ. ఈ విషయాన్ని ఇంకా సూటిగా చెప్పాలంటే మనముపయోగించే వస్తువులలో గ్రామాలలో తయారైనవాటినే కొనాలి. అవి మోటుగా ఉన్నా వాటి పనితనాన్ని అభివృద్ధి పరచేటట్లు ప్రోత్సహించాలి. అంతేగానీ, విదేశీ వస్తువులనుగానీ, పెద్ద పరిశ్రమల లోని వస్తువులనుగానీ వాడి, వాటిని తీసివేయరాదు. ఏరకంగానైనా గ్రామస్థులలో శిల్పనైనపుణ్యాన్ని రేకెత్తించాలి. నిరంతరం కృషిచేస్తూ మనం సుఖపడుతున్నా, తాను మనకోసం కష్టపడి ఆహారాన్ని మనకందిస్తున్న రైతుకుమనం ఏం చేసినా తక్కువే. వారి వారి వృత్తుల్లో వారిని ప్రోత్సహిస్తూ వారి ఋణాన్ని కొంతయినా తీర్చుకోవాలి. పలుతోము పుల్లనుండి చీపురువరకూ గ్రామంలో తయారైనవాటినే ఉపయోగిస్తే, దేశం అభివృద్ధి చెందటమేగాక, సోమరులనేవారే ఉండరనీ, ఇదే స్వదేశీ మూల సూత్రమనీ గాంధీజీ వివరించారు. ఈ నాటక రచయిత గ్రామాల్లోని అవసరాలను తెలిసినవారు. కేవలం గ్రామీణుల అవసరాల కోసమే వీరి కలం కదులుతుంది. గ్రామీణులకు ఏమాత్రం మేలుకలిగే పనయినా నరసింహారావుగారుచేసి తీరుతారు. ఆ ప్రయత్నంలో భాగమే ఆయన మదిలోని ఈ 'కల్పతరువు'.

**తొలకరి :**

1973లో 'జనధర్మ' పత్రికలో ప్రచురించటానికి సంపాదకులు కోరగా నరసింహారావుగారీ నాటకం రచించారు. ఈ నాటకం గ్రామీణ ప్రాంతాల్లో ఎన్నోసార్లు ప్రదర్శింపబడి విజయవంతమయింది. ఆకాశవాణిలోనూ ప్రసారం చేయబడింది. ప్రతిగ్రామంలోనూ ప్రదానంగా జరుపుకునే పండుగ ఏరువాక.

దాన్నే తొలకరి అనికూడా అంటారు. గ్రీష్మతాపాన్ని భరించి వరుణుడికోసం ఓపికగా ఎదురుచూస్తున్న భూదేవికి వానదేవుని చిరుసందేశమే తొలకరి. ఎండి బీటలు వారిన భూములు, గ్రామీణులమనసులూ ఈ తొలకరిలో పులకరించిపోతాయి. మళ్ళీ పొలం పనులు మొదలవుతాయి. గ్రామాల్లో సందడీ మొదలవుతుంది. ఆ సందర్భంగా ఎంతోసంబరంగా జరుపుకునే పండగే తొలకరి.

అసలు ఏ పండగొచ్చినా గ్రామసీమలలో కనువిందుగానే ఉంటుంది. పచ్చని పైర్ల చల్లగాలీ, పచ్చిక బయళ్ళూ, విశాలమైన ప్రదేశాలూ గ్రామవాసుల్లో మనోవైశాల్యాన్నిపెంచుతాయి. స్వతహాగా కలుపుగోలుగా ఉండేవీరు ఏ చిన్న పండగొచ్చినా ఏపాటి సందర్భమెచ్చినా పక్కవారితో తమ సంబరాన్ని అంబరాన్నితాకేలా పంచుకుంటారు. జనసమూహంలో ఎంతోకాలంగా నిలచివున్న నమ్మకాలు, సంప్రదాయాలూ, క్రియారూపాన్ని దాల్చగా ఈ పండగలేర్పడ్డాయి. ఈ పండుగలు మొదట ప్రకృత్యారాధనగా ప్రారంభమై వ్యవసాయ సంస్కృతికాలంలో స్పష్టరూపాన్ని పొంది, తరువాతికాలంలో ఇంకా క్లిష్టరూపాన్ని సంపాదించి, చివరకు ప్రాచీన ఆచారాల సూచ్యగుణాన్ని మాత్రం కలిగి, ఉల్లాసాన్నీ, ఉత్సాహాన్నీ కలిగించే విధంగా రూపొందాయి. సాంఘిక సంక్షేమం కోసం విశేష సందర్భాలలో జానపదవిశేషాలూ, సంప్రదాయాల కలబోతగా ఆచరించే సంక్లిష్టమైన అంశమే పండగ.''[14] యాంత్రిక జీవనానికి ఆటవిడుపును కలిగించే పండుగలు మానవ జీవితంలోని సమస్యలను కొంతవరకు మర్చిపోయేలా చేస్తాయి. అసలు నలుగురూ ఒకచోట చేరి ఒకే విశేషాన్ని పండుగగా జరుపుకోవటంవల్ల ప్రజల్లో ఏకాభిప్రాయానికి నాంది జరిగింది. సమాజంలోని నాలుగు రకాలవాళ్ళనీ ఒకచోట చేర్చటంవల్ల, పరస్పరాభిప్రాయ వినిమయం జరగటమేగాక, చింతన మంతనాలై కొత్త కొత్త ధీయుక్తులకు దారి ఏర్పడుతుంది, జనజీవనానికి కావాల్సిన అనేకవిషయాలు ఈ సందర్భంలో ప్రస్తావించబడతాయి, కొత్త సంబంధాలు ఏర్పడి బలపడతాయి. బంధుత్వాలు స్థిరమై పటిష్టమవుతాయి.

ఇంత విశిష్టమైన పూర్వరంగంగల పండుగల్లో ముఖ్యమైన పండగ ఏరువాక. ఇది తొలకరి రాగానే వచ్చే మొదటి పండుగ. మొదటిసారి దుక్కిదున్ని నాగళ్ళనూ, వ్యవసాయ పనిముట్లనూ పూజించటం ఈపండుగ ప్రత్యేకత. ప్రతియేటా 'జ్యేష్ఠ పౌర్ణమి' రోజు ఈ ఏరువాకనుజరుపుకుంటారు. ఈరోజుపిండివంటలతోపాటు పులగాలూ వండుకుంటారు. ఎడ్లకు అభ్యంగనం

చేయించి, కొత్తబట్టలూ, కొత్త వస్త్రువ్వలూ కట్టి, పోటీకి సిద్ధంచేస్తారు. కోళ్ళపందాలను, ఎడ్లపోటీలను ప్రధానంగా ఈరోజు జరుపుకుంటారు.

రచయిత ఈ నాటకాన్ని వ్యవసాయం ప్రధానమైన పండుగగా ప్రతిపాదిస్తూనే నాటకంలోని పాత్రలకూ తొలకరిని వర్తింపచేసే విధంగా మలచారు. మోతుబరి రైతు భార్య పార్వతమ్మ చాలా ఉత్తమురాలు. వీరికి ఏకైక పుత్రుడు చంద్రం. కోడలు పద్మ. రామయ్య పొలంలో బంగారాన్ని పండిస్తూ, గ్రామస్థులను తన మాటసాయంతోనూ, చేబదుళ్ళ సాయంతోనూ ఆదుకుంటారు. పార్వతమ్మ భర్తకు తగ్గట్టుగా కలుపుగోలుగా ఉండే మనిషి.

కొడుకు పట్నంలో పై చదువులు పూర్తిచేసుకుని రాగానే. వివాహంచేసి, వ్యవసాయాన్ని చూసుకోమంటాడు రామయ్య. కానీ నగర సుందరి నాజూకుతనాలకు అలవాటుపడ్డ చంద్రం పల్లెల్ని చూసి అసహ్యించుకుంటాడు. ఐనా తన విలాసాలకు డబ్బుగావాలి గనక, ఒక సంవత్సరంపాటు వ్యవసాయంచేసి అధికలాభాలు గడిస్తాననీ, ఓడిపోతే ఆయన చెప్పినట్టు వింటాననీ తండ్రితో పందెం కడతాడు. వ్యవసాయాన్నంతా తన ఆధీనంలోకి తీసుకువస్తాడు. కానీ చేతులో డబ్బుపడగానే పట్నంవెళ్ళి వీలైనన్ని రోజులుండి వస్తుంటాడు. చంద్రం. వ్యవసాయాన్ని చిన్నచూపు చూస్తూ, ఆదాయాన్ని మాత్రం ఆనందంగా అనుభవిస్తాడు.

ఏరువాక పండగకు పాలేరుఎడ్లను సిద్ధంచేస్తుంటే, తానుమాత్రం పట్నానికి వెళ్ళాలనీ, బండి తనకే కావాలనీ పాలేరు వీరయ్యను బెదిరించి బండి తీసుకుని పట్నం పోబోతుంటాడు. ఐతే సాటిజీవాలు పండగ జరుపుకుంటే తాము రామని ఎడ్లు మొండికేసి కదలవు. కోపం తెచ్చుకున్న చంద్రం నోరులేని జీవాల్నికూడా చూడకుండా కొడతాడు.

ఆ దెబ్బలుతనకే తగిలినట్లు రామయ్య బాధపడతాడు. చంద్రాన్ని కొట్టి, భూమిలో బంగారం పండించి జాతికి గర్వకారణంగావాలిగానీ, ఇలా జులాయిగా తిరగవద్దనీ, దేశరక్షణకే జవానులెంత బాధ్యులో జాతి జవజీవాలతో బ్రతకటానికి రైతులూఅంతే బాధ్యులనీ, గ్రామంలోనే ఉండి వ్యవసాయం చేయటానికి ప్రోత్సహిస్తాడు. తప్పు తెలుసుకున్న చంద్రం తండ్రిని క్షమాపణలు కోరుతాడు. కొడుకు ప్రవర్తనవల్ల రామయ్య హృదయమూ, వేసవి తాపంవల్ల భూదేవీ ఎంత శ్రమకోర్చినా, తొలకరి పండుగకు చంద్రం మారటంతో రామయ్య మనసులో తొలకరి కురుస్తుంది. భూమాతా తృప్తిపడుతుంది. కలసిఉంటే కలదుసుఖమని చంద్రం అంటుండగా నాటకం సమాప్తమవుతుంది

ప్రజాదేవత :

౧౯౮౫లో ప్రభుత్వం కోరగా నక్సలిజాన్ని ఖండిస్తూ ఈ నాటకం రచించబడింది. ఆంధ్రప్రదేశ్‌లో నానాటికీ ప్రబలిపోతున్న తీవ్రవాదాన్ని అరికట్టేప్రయత్నంలో ప్రచారశాఖవారు ఎన్నోసార్లు ఈ నాటకాన్ని ప్రదర్శింపచేసి, మంచి ఫలితాన్ని సాధించారు. దురాశతో స్వార్థంకోసం మహోన్నత సిద్ధాంతానికి వక్రభాష్యంతో చేసిన కిరాతకకృత్యాలే ఈ నాటకానికి ఇతివృత్తం. పేదపార్టీ పేరుతో, విప్లవ పంథాలక్ష్యంతో ఒక విప్లవయోగి గ్రామదేవతలాగా, ప్రజాదేవతను నెలకొల్పి ఆమెకు ఆహారంగా 'కోటీ ఒక్క తలను' బలిస్తానని మొక్కుతాడు. ఇతని శిష్య గణమంతా ఈ మహాయజ్ఞానికి సహాయపడటానికి అహర్నిశలూ శ్రమిస్తుంటారు.

వర్గశత్రునిర్మూలనం పేరుతో తమ వ్యతిరేకులనూ తమ మార్గాన్ని తప్పపట్టేవారినీ చంపటమే ఈ పార్టీ లక్ష్యం. ప్రభుత్వం చేపడుతున్న సంక్షేమ పథకాలు గ్రామీణప్రజలు ఆచరించకుండా చేయటంకూడా ఈ పార్టీ బాధ్యతే. భూస్వామి విశ్వం పెట్టుబడిదారీ విధానానికీ, బూర్జువా మనస్తత్వానికీప్రతీక. ఇతని కూతురు డాక్టరు గౌరి. విశ్వం విధానాలను అనుక్షణం విమర్శించే ఆధునిక భావాలుగల యువతి. వర్గస్వామ్యం రూపుమాపాలనుకునే నిజమైన ప్రగతివాది. వైద్యవృత్తిలో ప్రజలకు సేవచేస్తూ, గ్రామీణాభివృద్ధికి ప్రభుత్వం చేపడుతున్న ఎన్నో ప్రణాళికలను పేదప్రజలకు వివరిస్తుంది. సాటి మనుష్యులను కూలీలుగా, దరిద్రులుగా భావించే తన తండ్రి ఇంట్లో ఉండలేక గ్రామంలోనే వేరుగా ఉంటూ సాటి ప్రజలకు సేవచేస్తుంది.

ఆ ఊరికి రిజర్వేషన్‌లో ఎన్నికైన సమితి అధ్యక్షుడు రాములు. ఇతను హరిజనుడు. అక్షరంముక్కకూడా రానివాడు. అయినా మంచి మనసున్న వ్యక్తి. అతను గుడిలోకి ప్రవేశించాడని తరతరాలుగా ఆ దేవాలయాన్నే నమ్ముకున్న పూజారిని తొలగిస్తాడు విశ్వం. దిక్కుతోచని పూజారికి తమ వాడలో ఇల్లు, ఇతర వసతులూ కల్పించి, తమకు విద్య నేర్పవలసినదిగా రాములు కోరతాడు. ఇతనికి ఇద్దరుకొడుకులు. మల్లన్న, సైదులు. చిన్నకొడుకు వ్యవసాయంలో తండ్రికి సాయంచేస్తుంటే, మల్లన్న మాత్రం కమ్యూనిస్ట్ భావాలకు ఆకర్షితుడై విప్లవయోగి ముఠాలోచేరి అతనికి సహచరుడవుతాడు. డబ్బున్న ప్రతివ్యక్తీ, వర్గశత్రువని ఇతని భావం. వర్గపోరాటం పేరుతో డబ్బుగలవారందరినీ విప్లవయోగి హతమారుస్తే, వర్గరహిత సామ్రాజ్యం వచ్చేసినట్లుగా ఇతను భావిస్తాడు.

చదువూ, డబ్బూలేని రాములు ప్రభుత్వ మేనిఫెస్టో ఏవిధంగా అమలు ప[illegible]తోనని విశ్వం హేళన చేస్తే రాములు ఎంతో శ్రమపడి ఆచారిగారివద్ద

చదువునేర్చుకుంటాడు. అధికారులవల్ల రూల్సూ, రెగ్యులేషన్సూ, తెలుసుకుంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే రాములు ప్రభుత్వానికీ ప్రజలకూ వారధిగా, దళిత ప్రజలను ముందుకు నడిపేసారధిగా అతనుచేయని పనిలేదు. తాము నమ్ముకున్న దేవుడనే భావం కనపడకుండా ఎలా ఉందో, అలాగే ప్రజాస్వామ్యంకూడా ఒక శక్తివంతమయిన భావమని తెలుసుకుంటాడు. తరతరాలుగా పెత్తందారులకు దాస్యంచేస్తూ దుర్భరంగా బ్రతుకుతున్న తన గ్రామస్థులకు దాస్యవిముక్తి నందించి, ప్రభుత్వ సహాయంతోస్వయంగా ఎవరిపనులు వారుచేసుకునే మార్గాన్ని సూచిస్తాడు.

తాను ఆచారి దగ్గర నేర్చుకున్న విద్యను తమ వాడలో అందరూ నేర్చుకునేలా చేస్తాడు. తరతరాలుగా 'వెట్టి'కి కుదిరిన వారిని విడిపిస్తాడు. వారి పునరావాసానికి ఎంతోసాయం చేయటమేగాక, ప్రభుత్వ ప్రణాళికా విధానాలన్నీ గ్రామీణులకు ఉపకరించేలా చూస్తాడు. పేదలకు భూములు, రిక్షాలు, వృత్తిపనివారికి పనిముట్లు, ప్రభుత్వంవారిచే ఇళ్లపట్టాలు, బ్యాంకులో సబ్సిడీమీద అప్పులు పల్లెలకు రోడ్లు, మంచినీటి వసతి, విద్యాలయం మొదలైనవన్నీ గ్రామీణులకు కల్పిస్తాడు. ప్రజలను పీడించే గ్రామోద్యోగ వ్యవస్థ రద్దు, మండల కార్యాలయాలు, సగం ఖరీదుకే జనతా వస్త్రాలు, వితంతువులకు, వ్యవసాయ కూలీలకు పెన్షన్లు, మొదలైన ప్రభుత్వ ఏర్పాట్లను గ్రామస్థులకు సమకూరేలా చూసి, వాటి లక్ష్యాన్ని విపులీకరించేవాడు. స్వయంకృషితో ఎంత అట్టడుగువర్గాలయినా ఎలా అభివృద్ధి చేసుకోవచ్చో రాములు స్వయంగా నిరూపిస్తాడీ నాటకంలో. విశ్వంకూతురు గౌరి గ్రామీణులను నిష్కామసేవచేసే ఉన్నతురాలు. తాను చదివిన చదువు, తన ఆస్థి, అన్నీ బడుగు ప్రజలకు చెందాలనకునేది. అమాయకత్వంతో తామూ ఈదేశప్రజల మన్నమాట మరచిపోయి, ధనవంతుల కాలి చెప్పలక్రింద దుర్భర జీవితాన్ని గడుపుతున్న ఎందరో కూలీలను దాస్యవిముక్తులనుచేసి, స్వశక్తితో వారికి బ్రతకటం నేర్పిస్తుంది. శారీరక రోగాలకు వైద్యం చేయటమేగాక, నిస్సహాయత్వంతో ఆత్మవిశ్వాసాన్ని పోగొట్టుకున్న గ్రామీణుల మనోవైకల్యాన్నిగూడా గౌరి సరిదిద్ది వారిలో ఆత్మస్థైర్యాన్ని కల్గించే మంచిపాత్ర.

ఇదంతా జరుగుతుంటే విప్లవయోగి మండిపడ్తాడు. జనానికి నిజమైన సాయంచేస్తున్న రాములునూ, గౌరినీ ప్రాణాలతోపట్టి తేస్తే లక్షరూపాయల బహుమతి నిస్తానంటాడు. ఈ యోగి కన్నా ముందు ముసలి విప్లవముని, తన ఏరియాను దోచుకున్నందుకు తనకూ వాటా కావాలంటాడు. ఎద్దులు[illegible].

అతనిగుండా కోటిగాడితోనే అతన్ని బంధించి తాను విప్లవాన్ని నడిపిస్తుంటాడు యోగి తన బావ తన రహస్యాన్ని పోలీసులకు చెబుతున్నాడనీ, అతన్ని చంపి రమ్మనీ, కోటిగాడిని పంపిస్తే, వాడు ఇంట్లో యజమాని లేడని ఇల్లాలిని మానభంగంచేసి చంపి వస్తాడు. తనతోబుట్టువే చనిపోయినా యోగి తన మార్గాన్ని వీడడు. మహోన్నత సిద్దాంతాలతో సామాన్యుని అసామాన్యుని చేసిన విప్లవ సిద్దాంతాలు అవకాశవాదులచేతుల్లోనూ, కుహనా వ్యక్తులచేతుల్లో పడి ఎంత నెచ్చానికి దిగాయో తెలియ చేయడంలో రచయిత కృతకృత్యులయ్యారు ఈ విప్లవకారులకు రాజకీయవాదుల అండా, పెట్టుబడిదారుల ముడుపులూ ఎల్లపుడూ ముడుతూనే ఉన్నాయి. చివరికి ఒకే సిద్ధాంతాన్ని అమ్ముకుంటున్న యోగి, ముని ఇద్దరూ ఘర్షణపడి చంపుకోబోతుంటే, ప్రజలు పోలీసులూ వచ్చి అరెస్ట్ చేస్తారు. రాములు కల్పించుకుని ప్రజలు చంపకుండా వారిని అరెస్ట్ చేయించడంతో నాటకం సమాప్త మవుతుంది.

ఈ నాటకంలో సిద్ధాంతాలపేరుతో ప్రజలనుపీడించే విప్లవముఠాను వేశ్యావాటికలుగా వర్ణించారు రచయిత. మిసమిస లాడే యవ్వనంతో అందగత్తెలయిన యువతుల శరీరాలతో వేశ్యా వృత్తిచేసే వాళ్ళెంత నీచులో, వీరినీ అంతే నంటాడు. భావాలు సరిగా వికసించని నవనిర్మలమైన యువకుల హృదయాలను ద్వేషపూరిత ప్రచారంతో ఆవేశపరచి, కుటిలహత్యాసాహిత్యంతో మలినపరచి, తమ ముఠాలో చేరినవారిని ఏదోరకంగా హత్యలకు పురిగొలిపి, సంఘానికి దూరంచేసే తమ వ్యాపారం తాము చూసుకుంటున్న నేటి ముఠా విప్లవాలను కళ్ళముందుంచారు రచయిత.

పిస్తోలు భయంతో, జనాల భయాన్ని ఆసరాగా తీసుకుని నేడు ఎన్నో విప్లవదుకాణాలు వెలుస్తున్నాయి. వాటిని అంతచేసే బాధ్యత, ప్రభుత్వానికి ఎంత ఉందో, ప్రజలకూ అంతేననీ ఈ ప్రజాదేవత నాటకం ద్వారా రచయిత నిరూపించారు. ఈ నాటకానికి కీ.శే. కోపల్లె శివరాం పాటలు రచించారు. వంద సార్లకుపైగా ప్రదర్శింపబడిన ఈ నాటకం ఎంతో విజయవంతమైంది.

ప్రజల చాటున, వారిని భయపెడుతూ, అడవుల్లో భయంతో బ్రతుకుతున్న దొంగవిప్లవకారులకు ఈ నాటకం చెంపపెట్టు ''ప్రజా ప్రతినిధుల హత్యలద్వారా వర్గశతృనిర్మూలనం'' చేస్తున్నామనే విప్లవకారులు ముఠాగుండాలకన్నా రౌడీషీటర్లకన్నా నీచాతినీచులు. ప్రజల కష్టసుఖాలు తెలుసుకుని వారుపైకి రావటానికి మార్గాలు చూపాలికానీ తుపాకులతో బెదిరించటం ఏమాత్రం

నాగరికత కాదని సంఘాన్ని మార్చడానికి మనసులూ, మమతలూ, మంచిమాటలూ ఉన్నాయనీ వాటిద్వారానే ఎప్పటికయినా సమాజం పురోగమిస్తుందనీ రచయిత ఈ నాటకం ద్వారా నిరూపించారు.


1. కోవెల ప్రత్యేక సంచిక - 1992 వ సంవత్సరం.

2. సాహిత్య శిల్ప సమీక్ష. పింగళి లక్ష్మీకాన్తం. పే. 8

3. తెలుగు నాటక వికాసము. పి.యస్సార్. అప్పారావు. పే. 346.

4. సాహిత్యావలోకనం. పేర్వారం జగన్నాథం. పే. 14

5. అగ్నిపరీక్ష. పీఠిక. కె.యల్. నరసింహారావు. పే. 1.

6. మనదేశంలో పునర్వికాసం ఉందా? ఇన్నయ్య పే. 204

7. స్వీయచరిత్ర. కందుకూరి వీరేశలింగం పంతులు. పే. 186.

8. తెలుగు నాటక వికాసం. పి.యస్సార్. అప్పారావు. పే. 422.

9. అడుగుజాడలు పీఠిక. కపిలకాశీపతి. పే. 2.

10. తెలంగాణా తీరుతెన్నులు కె.యల్. నరసింహారావు. పే. 1

11. మనదేశంలో పునర్వికాసం ఉందా? ఇన్నయ్య. పే. 204.

12. చరిత్ర చెప్పిన పాఠాలు. మా. వెంకటరంగయ్య. పే. 79.

13. సమగ్రాంధ్ర సాహిత్యం. పదకొండవ సంపుటం. ఆరుద్ర. పే. 99

4. జానపద సాహిత్యం. ఆర్వీయస్. సుందరం. పే. 8.

# బాలల నాటకాలు

''బాలలే విజ్ఞాన హేతువులు

నేడురేపుల మధ్య సేతువులు

చంద్రబంధురసుధా శీతువులు

మానవత్వ వికాస హేతువులు''[1]

అన్నారు శ్రీశ్రీగారు. ఒక మహత్తరమైన ఆశాదీపాన్ని పిల్లల్లోనే చూస్తున్నట్టు ఆనందించారు. బాలల ద్వారానే మానవత్వపు విలువలు పటిష్టమవుతాయని భావించారు. మనమెప్పుడయినా అద్భుతమైన బాలల ప్రపంచాన్ని దర్శించగలిగితే అక్కడ మనం వర్గభేదాలులేని ఉన్నతమైన సంస్కృతినీ బాధలూ, క్రోధాలులేని కొత్తలోకాన్నీ, మాయమర్మాలు తెలియని మరో ప్రపంచాన్నీ, నవరత్నాలను తలదన్నే ఆనందరాసులనూ, ఇంకా స్వచ్ఛమైన ప్రేమనూ, చల్లని చిరునవ్వులనూ, మల్లెల కన్నా తెల్లని వారి పాలమనసులనూ ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోతాం. మనిషి జీవితంలో బాల్యంకన్నా మధురమైన దశలేనేలేదు. అది తిరిగిరాని దశ. కోట్లు వెచ్చించినా కొనలేని దశ. అందరికీ అనుభవమైన బాల్యదశకూ వెయ్యిసంవత్సరాల తెలుగుసాహిత్యానికీ ఉన్న సంబంధం అవినాభావమైంది. జానపద సాహిత్యంలో బాలసాహిత్యం చిరకాలంగా ఉంది. ఆధునిక రంగంలో బాలసాహిత్య సృష్టిమాత్రం ఇటీవలి కాలంలోనిదే. బాలసాహిత్యం భారతదేశంలో అడుగుపెట్టడానికి విదేశీ సాహిత్య ప్రబావం చాలా ఉంది. ''బాలసాహిత్యం, బాల సాహితి, బాల వాఙ్మయం, పిల్లలసాహిత్యం ఈ పదాల్ని సమానార్థకాలే. అన్నిట్లోనూ బాలసాహిత్యం బహుళ ప్రచారం పొందిన పదద్వయం దీనిభావం బాలలకోసంచేసిన సరళరచనలు బాలసాహిత్యం అని చెప్పకోవచ్చు.''[2]

హితాన్నకోరేది, మంచిని పెంచేదీ, సంస్కారాన్నీ సంస్కృతీ సంపదనూ, అందించేదే సాహిత్యం. అది పిల్లల కోసం రాయబడినా, పెద్దవాళ్ళు చదవకూడదన్న నియమం ఏమీలేదు. ఈ యాంత్రిక జీవితంలోకూడా 'చందమామ' 'బాలమిత్ర' మొదలైన బాల సాహిత్యానికి చెందే పుస్తకాలు క్రమంతప్పకుండా చదివే పెద్దవాళ్ళెందరో ఉన్నారు. ''తెలుగు సాహిత్యం పుష్పఫలభరిత నందనోద్యానం. ఒడ్డుల నొరసిపారే అఖండ గోదావరి మంజులరవాల మహనీయ మహతి. ఆ మురళీరవాల మృదుమధుర కలస్వనాలను మించి మరొకనదిలో హృదయ తంత్రులను మీటగల పదవిపంచి బాలభారతి. తెలుగుతల్లి పసిడివన్నెను

సరపించి, మురిపించగల పగడాల దండ బాలసాహిత్యం. బాలసాహిత్యం నిత్యం అభివృద్ధి చెందుతూ సృజనాత్మక విషయాలతో అలరారుతున్న అపూర్వ సాహిత్యవిభాగం. జాతిని ప్రభావితంచేయగల శక్తి స్వరూపిణి బాలసాహిత్యం.''[3]

ఒక దశలో అనాదరింపబడిన ఈ సాహిత్యం ఈతరంలో బాగా అభివృద్ధి చెందింది. ప్రాచీన, అర్వాచీన అలంకారికులెవరూ బాల సాహిత్యాన్ని, శాస్త్రబద్ధంగా చర్చించి సిద్ధాంతప్రాతిపదికను ఏర్పరచిన దాఖలాలు లేవు డా.. దేవకి గారు తొలిసారిగా బాలసాహిత్యంలో గేయవిభాగంపై ౹ ౨౫ ౹ లో పరిశోధన సాగించారు. తెలుగులో బాలసాహిత్యాన్ని తొలిసారిగా ప్రచురించిన పత్రిక జనవినోదిని. ఈ పత్రికను మద్రాసు స్కూల్ బుక్ సొసైటీవారు ప్రచురించారు. ఇందులో పిల్లలు సరదాగా పాడుకునే ''చిట్టిపొట్లకాయ'', ''రంగురంగుబిళ్ళ'', మొదలైన గేయాలున్నాయి. ఇంతకుపూర్వం ఏపత్రికా ప్రచురించటానికి సాహసించని పిల్లల కథలను ఈ పత్రిక ప్రచురించి, బాల సాహిత్యానికి పత్రికాముఖంగా నాందీ జరిపింది.

ప్రౌఢ సాహిత్యం లాగే, గేయం, పద్యం, కథ,నవల, నాటక, సామాజిక శాస్త్ర రచనలు, శాస్త్రీయ రచనలు మొదలైన అన్ని ప్రక్రియలను బాలసాహిత్యం సంతరించుకుంది. కేవలం వినోదం కోసమేగాక పిల్లల మానసిక వికాసానికి ఎంతో తోడ్పడింది. బాలలను సాంఘిక జీవనంలో కలపటానికి సాంస్కృతిక స్రవంతిలో భాగస్వాములుగా చెయ్యటానికి బాలసాహిత్యం అనన్యసామాన్యమైన కృషిచేస్తున్నది. ఈ సాహిత్యంలో విశేషించి బాల నాటక సాహిత్యం ఆంధ్రావనిలో శాఖోపశాఖలుగా విస్తరించింది. ఈ నాటకాలలో బాలల నృత్యగేయ నాటికలు, వినోద నాటికలు, సాంఘికనాటికలు, చారిత్రాత్మక నాటికలు, పౌరాణికాలు, ఏకపాత్రాభినాయలు మొదలైనవి ప్రసిద్ధమైన శాఖలు.

ఐతే బాలలనాటకాలలో ఆలంకారికులు చెప్పిన లక్షణాలన్నీ ఉండాలనుకోవడం అసమంజసం. ఈ నాటకాలు ఇతివృత్త ప్రధానమైనవి. బాలల నాటకానికి లక్షణ సమన్వయించేస్తూ కె.యల్. నరసింహారావుగారు ''ప్రౌఢనాటకం కలిగిన లక్షణాలన్నీ బాలల నాటకానికుండవలసిన పనిలేదు. ఆ మాటకువస్తే బాలల నాటక లక్షణమే వేరు. బాల నాటకమన్నాక పసందైన విందు భోజనంలా ఉండాలి. చమత్కార సంభాషణలు, అభినయానికవకాశం కల్పించే సన్నివేశాలు, కడుపుబ్బనవ్వించే హాస్యం, అవసరమైనచోట్ల నృత్యాలకనుకూలమైన పాటలు, పద్యాలు, పిల్లలను ఆకర్షించే విచిత్ర వేషధారణ, అన్నిటినీ మించి

అతితేలికగా అర్థమయ్యే భాష, అభ్యుదయ పథంలో వేగంగా సాగే కథా ముఖ్యం.''[4] దీన్నిబట్టి, బాలల నాటకాలు, సరళమైన భాష, బరువులేని భావాలతో, పిల్లలు తెలుసుకోదగ్గ కొత్త విషయాలతో, చక్కటి కథాసంవిధానంతో వినోదాత్మకంగా రచింపబడాలని స్పష్టమవుతుంది.

బాలలకు పుస్తక పఠనంతో బాటు, నాటక వీక్షణాన్ని అలవాటుచెయ్యటం ఎంత అవసరమో కొన్ని సంఘటనలు రుజువుచేస్తాయి. సాహిత్యంలో హృదయానికి దృశ్యాన్ని సమర్థవంతంగా హత్తుకునేట్టు చేసేశక్తి నాటక ప్రక్రియకు తప్ప దేనికీ లేదు. జనంచేత నీరాజనాలందుకున్న జాతిపిత గాంధీజీ బాల్యంలో తన తండ్రిగారు కొనితెచ్చిన 'శ్రవణుడి పితృభక్తి నాటకాన్ని చదివే తల్లిదండ్రులను భక్తివిశ్వాసాలతో సేవించాలనీ 'బుద్ధభగవాన్'నాటిక చదివే సృష్టిలో అహింసకన్నా గొప్పదేదీ లేదని తెలుసుకున్నానని తన ఆత్మకథలో రాసుకున్నారు. ఆ నాటకాలే మోహన్‌దాస్ గాంధీని 'మహాత్మాగాంధీ'గా జనం ముందు నిలబెట్టాయి. వ్యక్తులను ప్రభావితులనుచేయగల నాటకాలు సాహిత్యంలో మణికిరీటాలు.

భక్తకవిశిఖామణి బమ్మెర పోతన జీవితాన్ని మధురంగా వర్ణించే ఆధునిక ప్రబంధం 'పోతన చరిత్ర' ఈ గ్రంథకర్త శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారు బాలుడైన పోతన తనతల్లి తండ్రులైన లక్కమాంబ, కేసనలతో పాల్కురికి జాతరకు వెళ్ళటం, అక్కడ వీధినాటకంలో భాగవత నాటకాన్ని చూస్తూ, పోతన రకరకాల ప్రశ్నలు వేయటం, తల్లి వాటికి చక్కని సమాధానాలివ్వటం, ఆ మాటల్లోనే సంస్కృత భాగవతాన్ని తెలుగులో తనే వ్రాస్తాననటం, తల్లితండ్రులు పోతన జిజ్ఞాసకు సంతోషించటం మొదలైన అంశాలన్నీ 'పోతన చరిత్రము' లో రమ్యంగా చిత్రించారు. బాలుడైన పోతన జిజ్ఞాస భవిష్యత్తులో ఆంధ్రమహాభాగవత రచనకు ఎలా పునాది వేసిందో ఈ రచన ద్వారా తెలుసుకోవచ్చును. ఆంధ్రభాగవత రచనకుముందుగా పోతన ఈవిధంగా తలపోశాడు.

' ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్వింబురా...

తెనుగుల్ సేయుచు మత్పురాకృత సుకృతంబు దానెట్టిదో

తెనుగుం జేయరుమున్ను భాగవతమున్ దీనిన్ తెనింగించినా

జననంబున్ సఫలంబు చేసెద. బునర్జన్మంబు లేకుండగన్.''[5]

అంటూ ఆంధ్రమహాభాగవత రచనను చేపట్టినాడు. చిన్నప్పడు

తానుచూసిన వీధిభాగవతమే. ఆ మహానుభావుని హృదయంలో సంస్కృత భాగవతాన్ని ఆంధ్రీకృతంచేయాలన్నబలమైన భావాన్నిపెంచి పోషించింది. ఆకారణంగానే మధురకవి పోతన తెనిగించిన ' ఆంధ్ర మహాభాగవతం' తెనుగునాట సుప్రసిద్ధమైన పురాణంగా అవతరించటం తెలుగుజాతి చేసుకున్నపురాకృత సుకృతం. ఈ ఉదాహరణలనుబట్టి చిన్నపిల్లల్లో పుస్తకపఠనంకన్నా, నాటక వీక్షణమే హృదయాలలో బలమైన ముద్రవేస్తుందని చెప్పక తప్పదు.

తెలుగులో దాదాపు రెండుగంటలసేపు ప్రదర్శించటానికి వీలైన బాలల నాటకాలు ౧౯౩౯ వరకూ ఉండేవికావు. న్యాయపతి రాఘవరావుగారు ౧౯౩౯లో మద్రాసు రేడియోలో కేంద్రంలో బాలల కార్యక్రమాలకోసం, బాలల నాటక రచన, ప్రదర్శనలు ప్రారంభమైనాయి. ౧౯౪౫లో 'బాల' పత్రికపెట్టాకే తొలిసారిగా బాలనాటికల ప్రచురణ జరిగింది. మొట్టమొదట 'బాల' తొలిసంచికలో ప్రచురింపబడినతొలినాటిక జనమంచి రామకృష్ణగారి నాటిక, కృష్ణకథకు సంబంధించిన ఈనాటికపేరు 'యమునాతీరే' తెలుగులో వెలువడిన బాలల నాటక సాహిత్యాన్ని ప్రక్రియనుబట్టి, విషయాన్నిబట్టి, వినియోగ విధానాన్ని బట్టీ స్థూలంగా వెంకటప్పయ్యగారు 'బాలసాహితీవికాసం' లో '౨౦౦' పేజీలోని ఆ చక్రం



నరసింహారావుగారు బాలల నాటకాలలో సాంఘిక నాటిక విభాగానికి చెందే 'పుట్టినరోజు పండుగ' నాటకమూ, హాస్యనాటిక విభాగానికి చెందే ''మతిలేని మహారాజు' నాటకమూ, రచించారు. ఇంకా కొన్ని బాలల నాటికలు అముద్రితాలు.

బాల నాటక సాహిత్యంలో పేరుపొందిన సాంఘిక నాటికలు చాలా ఉన్నాయి. వాటిలో న్యాయపతి రాఘవ రావుగారి 'కీమరబొమ్మలు', 'న్యాయపతి కామేశ్వరిగారి' కాసుపేరు', తెన్నేటిసూరి 'గొడ్డలికాక', ఇల్లిందలసరస్వతీ దేవి 'సహవాస దోషము', నండూరి సుబ్బారావు 'కంచుమోగినట్లు', సోమంచి రామం 'పరీక్ష', కె సభా. 'ఫిర్యాదు', ఏడిద కామేశ్వరరావు 'రత్నమాణిక్యాలు', అన్నపర్తి సీతారామాంజనేయులుగారి 'దసరాబుల్లోడు', శ్రీరామమూర్తి 'పిల్లల చదువులు', ఉన్నవ సేతుమాధవరావు 'సన్యాసం', మొదలైన బాలల సాంఘిక నాటికలు ప్రసిద్ధమైనవేకాక, ప్రదర్శనా సౌలభ్యంగలనాటికలు. నేటికీ పాఠశాలల్లో ఏ వేడుకలు జరిగినా ఈ నాటికలలో ఏదో ఒకటి ఇప్పటికీ ప్రదర్శితమవు తుండటమే వీటి శక్తి యుక్తుల్ని నిరూపిస్తుంది.

కె. యల్. నరసింహారావుగారి 'పుట్టినరోజుపండగ' నాటికకూడా బాలసాంఘికనాటక విభాగానికి చెందినదే. బాల నాటక సాహిత్య వికాసానికి ఎంతో పేరు తెచ్చిన శ్రీ న్యాయపతి రాఘవరావుగారు పసిడితెర అనే బాలల నాటక సంకలనాన్ని కూర్పుచేయుటం కోసం నరసింహారావుగారిని ఒకనాటకం రచించమని కోరారు. వారికోరిక మేరకు వ్రాయబడిందే 'పుట్టినరోజు పండుగ' నాటిక.

**పుట్టినరోజుపండగ :**

ఒకేరంగంలో ముగిసే ఈ నాటిక పటిష్టమైన ఇతివృత్తం చేతా, సమస్యా ప్రధానమైన నాటకమవటంచేతా, ప్రదర్శనాసౌలభ్యంగల నాటికగా ప్రసిద్ధికెక్కింది. నిర్మాణ విషయంలో ఇది సంక్షిప్త నాటికే ఐనా ఈ నాటిక పెద్ద పెద్ద నాటకాలకే దీటుగా నిలిచింది.

''శ్రీనాథుడు భాగవతం తెనిగిస్తే అది శ్రీకృష్ణుని రక్తిపురాణ మయ్యేది. పోతన నైషధాన్ని ఆంధ్రీకరిస్తే అది భక్తనైషధమయ్యేది'' – అని సాహిత్యాభిం హానులు కొందరన్నట్టు ఈ పరిహాసం కె. యల్. నరసింహారావుగారు 'పుట్టినరోజు పండగ' నాటికకూ వర్తిస్తుంది. హృదయాలను కదిలించే గ్రామీణుల సమస్య లను, జాతికి జీవమైన యువతరపు ఆవేశపు విప్లవాలనూ, బడుగువర్గాలకు .

ప్రణాళికల ప్రయోజనాన్నీ, రైతులను పీడించే భూస్వామ్య వ్యవస్థనూ కళ్ళకుకట్టినట్లు నాటకీకరించగల ఈ రచయితకలం బాలల నాటికలోకూడా తన సొంతబాణీలో బరువైన ఇతివృత్తాన్నే ఎన్నుకున్నప్పటికీ , దాన్నివారు తేలికగా పిల్లలకర్థమయ్యే భాషలో వ్రాసి తమ ప్రత్యేకతను నిల్పుకున్నారు. పిల్లల మనసులకు హత్తుకునే సంభాషణలతో, చకచక నడిచే కథాగమనంతో, సరళమైన భాషతో, ఒకపెద్ద సాంఘిక సమస్యను బాలల మనస్తత్వంతో జోడించివ్రాయగలిగే కళ తనకేసొంతమనిఋజువు చేసుకున్నారు.

సంఘసంస్కరణే తన ధ్యేయమైన రచయిత గ్రామీణనాటకం వ్రాసినా, హాస్యనాటిక వ్రాసినా, సాంఘిక నాటకం వ్రాసినా, బాలల నాటకంవ్రాసినా తన లక్ష్యాన్నిఎప్పుడూ మరచిపోరు. పల్లెప్రజల అవసరాలనూ, వారి దీన జీవితాలనూ వీరెప్పుడూ తన రచనలో సాక్షాత్కరింపచేస్తారు. ఏ మాత్రం అవకాశంవచ్చినా లేక కల్పించుకునే అయినా గ్రామీణ పరిస్థితులను పఠితల హృదయాలకు హత్తుకునేలా వ్రాయగల సమర్థులు. 'పుట్టినరోజు పండుగ' అవటానికి చిన్నపిల్లల నాటికే అయినా ప్రజలను పీడించే ఒక సాంఘిక సమస్యను అందులో పరిష్కారమార్గం చూపబడింది. ప్రభుత్వ విధానాలపై ద్వేషాన్ని పెంచుకుని విప్లవాలు నడిపే యువతరానికి చురకత్తులయిన వీరి నాటకాలు అసలు ప్రభుత్వంఅంటే ఏమిటో తెలియని గ్రామీణులకు వారి హక్కుల్ని, బాధ్యతల్నీ తెలియచెప్పే పూమాలగా కూడా వీరినాటకాలు ప్రసిద్ధికెక్కాయి.

బాలలనాటకంలో కూడా గ్రామీణసమస్యనే ఇతివృత్తంగా ఎన్నుకోబడిన ఈ నాటికలో 'వెట్టి చాకిరి' ప్రధాన సమస్య. విరితోటలో పూలెన్ని పూసినా గుడికి చేరేది ఒకపువ్వు. కరకు మనుషుల పాదాలకిందబడి నలిగిపోయేది మరోపువ్వు. అలాగే పిల్లలందరికీ బాల్యంసమానమే అయినా ఒకబాబుకు బాల్యదశ బంగారుబాటయితే, మరో పసిమొగ్గకు ఆ దశ కఠోరవాస్తవరూపంలో ముళ్ళకంచె అవటానికి ధనస్వామ్యం కారణమని చెప్పటమే 'పుట్టిన రోజు పండుగ' ప్రధానోద్దేశ్యం.

మన దేశంలో కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు బాలల వెట్టిచాకిరిని నిషేధిస్తూ ఉత్తర్వులెన్ని జారీచేసినా నిజజీవితంలో ఎందరో పసిడిమొగ్గల బాల్యం వెట్టిచాకిరితోనూ, కాలేకడుపులతోనూ, బాధ్యతలబరువుతోనూ, రోగాల రొష్టులతోనూ, బుగ్గవుతున్నవైనాన్ని సామాజిక వ్యవస్థలో జరుగుతున్నా ఇలాంటి ఎన్నో ఘోరాలను ఈ నాటికలో రచయిత వ్యక్తపరిచారు. చక్కటి ప్రదర్శనా

సౌలభ్యంగల ఈ నాటిక ఎన్నోసార్లు ప్రదర్శింపబడటానికి పటిష్ఠమైన ఇతివృత్తమే కారణం.

ప్రజలఓట్లతో నెగ్గి, శాసనసభలో చట్టాలు చేయగల శాసనసభ్యుని ఇంట్లో జరిగే కథే ఈ నాటిక ఇతివృత్తం. శాసనసభ్యుడైన ప్రసాద్‌గారింట్లో వారబ్బాయి రాజు పుట్టినరోజు. ఇల్లాలు రత్నం హడావుడుగా ఏర్పాట్లు సరి చూస్తుంటుంది. ఆ ఇంట్లోనే పసిపాలేరు సుబ్బన్న రెండురోజులనుండి తిండిలేకపస్తుంటూ కూడా వెట్టిచాకిరితో సతమతమవుతుంటాడు తన పుట్టినరోజు కదాని సుబ్బన్నకు పలకా, బలపాలు కొనిచ్చి, చదువుకోమంటాడు రాజు దానికి సుబ్బన్న:- ''అమ్మో ఇప్పడాడి సదువు. ఇంట్ల శానా పనుండాది. పోయిలకు పుల్లలు కొట్టాలె, అంట్లు తోమాలె, పాలు బిండాలె, గడ్డికిపోయిరావాలె, గొడ్లకాడిపేడ తియ్యాలె, పనుండది.''[6] అంటూ తప్పించుకోజూస్తాడు. రాజు పట్టువిడవకుండా బలవంతం చేస్తే ఏడుస్తాడు. రెండురోజులనుండీ తిండి లేదనీ, తాతలు చేసిన బాకీకి పరిహారంగా తాను ఈ వెట్టిచేస్తున్నానని చెప్పి, సుబ్బన్న మరీ దుఃఖిస్తాడు. హృదయ విదాకరమైన సంభాషణతో ఉన్న ఈ నాటిక కథను సాక్షాత్తు మనదేశ శాసనసభ్యుని ఇంట్లోనే జరిగినట్లు విశ్లేషించి వ్రాసి, రాజకీయనాయకులకు కూడా చురక వేశారు రచయిత.

ఇక ఆ ఇంటికివచ్చిన పుట్టినరోజు పండుగ అతిథి విశ్వం. ప్రసాద్ బావమరిది. ప్రభుత్వాన్ని దుయ్యబట్టే స్వభావం గలవాడు. గ్రాంథికభాషావాదానికి ప్రతీకగా ఈ పాత్రను సృష్టించారు రచయిత. ఇతని సంభాషణలన్నీ హాస్యస్ఫోరకాలే. చెప్పింది చేయకపోవటంలో థీసిస్ వ్రాశానంటాడు విశ్వం. ''బావా, చెప్పింది చేయకపోవటమే గదా నేటి యుగధర్మము. మాటవరుసకు మీరు శాసనసభలో ప్రజలు అమలు జరుపుటకు అనేక చట్టములు ప్రవేశపెట్టుచుండిరి గదా. కానీ, వాటిని మీరమలు పరచుదురా ఏమి? వరకట్న నిషేధము పెట్టితిరి కానీ మీ కోసము కాదు, భూసంస్కరణలు ప్రవేశ పెట్టితిరి, వెట్టిచాకిరిని నిషేధించితిరి. త్వరలో మద్యపాన నిషేధము కూడా ప్రవేశపెట్టు చుంటిరిగదా. అవి అమలుజరుపుడనీ, లేనిచో శిక్షింపబడుదురనీ, ప్రజలను బెదిరించుటే గానీ, మీరెన్నటికీ స్వయముగా ఆచరించరు గదా. అలాగే అందరికీ వ్యావహారికము కావలెనందుము మాటలలో, చేతుమా ఏమి? గొప్పవారు చెప్పినది చేయుదురా? చేసేది చెప్పదురా? అదే విధంబున నేనును గొప్పవాడినగుటకు ప్రయత్నించుచున్నాను. అందులకే ఈ సాధన.''[7] అంటూ

విశ్వంచేత పలికిస్తారు. హాస్యంలోకూడా ఎంత ఘాటుతనాన్నుపయోగించవచ్చో అంతా ఉపయోగిస్తారు రచయిత. రెండ్రోజులనుండీ ఉపవాస ముంటున్నామనీ పదిమానికల బియ్యం గావాలనీ సుబ్బన్న తాత గంగయ్య ప్రసాద్‌ను అడగటానికి వస్తాడు. ఇంకా ఇయ్యటం తనవల్ల కాదనీ, వెట్టిచాకిరిచెయ్యకపోతే తీసుకున్న డబ్బు వడ్డీతో ఇచ్చి వెళ్ళమనీ బాగా కసురుకుంటాడు ప్రసాద్. అప్పుడే సుబ్బన్న కళ్ళు తిరుగుతున్నాయని పడిపోతాడు. పడిపోయిన మనవణ్ణి లేవనెత్తి, వాడికి బదులుగా తాను చాకిరి చేస్తానని చెప్పి, బాధగా సుబ్బన్నను ఇంట్లో దింపి రావటానికి వెళ్తాడు గంగన్న. అలా పోబోతున్న వారిద్దరినీ ఆపి కాఫీ టిఫెన్‌లు తీసుకువస్తాడు బాలకథానాయకుడు రాజు. అంతేగాక తనకుపుట్టినరోజు సందర్భంగా తండ్రి తెచ్చిన కొత్తబట్టలు సుబ్బన్న కిచ్చి వేసుకోమంటాడు. అదేమని కోప్పడుతున్నతండ్రితో '' సుబ్బన్నను కోప్పడకండి నాన్నగారూ, వాళ్ళకవి నేనే ఇచ్చాను. ఈ రోజు నాపుట్టినరోజు పండుగ వేడుకగా చేస్తున్నారు. ప్రతిపండుగకూ ఏదో వరంలాగా నన్ను ఓ కోరిక కోరుకొమ్మని తీరుస్తున్నారు. ఈసారి కూడా ఓ కోరిక కోరుకుంటాను నాన్నా, మీరు శాసనసభ్యులై , ప్రజలందరి మేలుకోరే చట్టాలెన్నో తయారు చేస్తున్నారు. అందులో వెట్టిచాకిరి నిషేధించే చట్టమూ ఒకటేగా, కానీ, ఆ చట్టాన్ని మనమే అమలుజరపలేని దురదృష్టవంతులం. నిజాయితీలేని మన పరిస్థితికి నేనెంతో దుఃఖిస్తున్నాను. సిగ్గుపడుతున్నాను. ఒకనాడు పంతులుగారు దీనిగురించి బళ్ళో చెపితే నేనంతగా పట్టించుకోలేదు. కానీ, నేడు ఈ గంగన్న, సుబ్బన్నల జీవితాలను చూసాక, దాని అవసరం నాకర్థమయింది. అందుకే నా పుట్టినరోజు సందర్భంగా వారిని ఈ వెట్టిచాకిరీ నుండి విముక్తులను చేయాలని కోరుకుంటున్నాను.''[5] అంటూ తండ్రి మనసును అద్భుతంగా మార్చి, వారిని విముక్తులనుచేయటంతో విశ్వం ఎంతో ఆనందిస్తాడు. ''రాజూ నీ పుట్టినరోజు ఒట్టి కాలక్షేపపు వేడుకగా కాక, గట్టి ప్రయోజనంగా మార్చి దేశానికెంతో మేలు చేసిన వాడివయ్యావు.'' అంటూండగా నాటిక సమాప్తమవుతుంది.

ఇందులో రత్నంచేత, '' నాకు తెలుసు నేనరవందే ఈ ఇంట్లో ఎవరూ ఏపనీ చేయరు.'' అన్న ఊతపదాన్నీ, విశ్వంచేత కృతకగ్రాంథికభాషా సంభాషణల్ని హాస్యంకోసం చేర్చారు రచయిత. చెప్పింది చేయకపోవటం ఈ యుగ ధర్మమనీ తానెలా గొప్పవాడి నవుతానో చెప్పి నవ్వించే, విశ్వంపాత్రను పిల్లలు బాగా ఇష్టపడతారు. హాస్య, అద్భుతరసాలు ఈ నాటికలో బాగా పండాయి. ఇక ఆయనకు ప్రీతిపాత్రమైన కరుణరసంసంభాషణల్లోనే ఉంది. గ్రామాలలోని ఎన్నో.

పాఠశాల వేడుకల్లోనూ, పండుగల్లోనూ ఎన్నోసార్లు ప్రదర్శించబడిన ఈ నాటిక రచయిత లక్ష్యాన్ని నెరవేర్చిందనటంలో ఏమాత్రం సందేహంలేదు.

సమకాలీన సాంఘిక సమస్యలను రచయితగా సంఘానికి తెలియచేయటం ఎంత బధ్యతగల కర్తవ్యమో, అంతకన్నా, ఆ బరువైన సమస్యలను చిన్న పిల్లల హృదయాలకు హత్తుకునేట్టుగా చూపటం శతాధికమైన బాధ్యత.

పిల్లలనాటిక చిన్నదయినా ఏం జరుగుతుందోనన్న ఉత్కంఠ, సదుపదేశం జోడించిరాయగలరచయిత నరసింహారావుగారు సాంఘికపరమైన సమస్యలు పిల్లల మనసుల్లోకిట్టే చొచ్చుకుపోతాయి. ఇలాంటినాటికలవల్ల వారి చిన్నారి మనసుల్లో సంఘంపై ఆదరణ బడుగుజీవితాల మీద ఆప్యాయతా పెరుగుతాయి. పిల్లలను విచిత్రమైన ఊహాలోకాల్లో విహరింపచేసేకన్నా, కఠోరమైనా, వాస్తవాలనే తెలియచేయటం ఎంతో ఉత్తమమంటున్నారు పిల్లల మానసిక వైద్య నిపుణులు. మరి ఇరవైసంవత్సరాల క్రితమే ఆ లక్ష్యాన్ని నెరవేర్చిన రచయిత క్రాంతదర్శి అని నిరూపించుకున్నారు. పిల్లలు పెద్దవారికన్నా అధికంగా ఆలోచించి మంచినిర్ణయాలు తీసుకుంటారనీ, సమసమాజాన్నిస్థాపిస్తారనీ ఈ నాటకం రుజువు చేసింది.

**మతిలేని మహారాజు**

ఈ నాటికకు 'మతిలేని మహారాజు' అనే చిన్నకథ ఆధారమని నాటికకు ముందే రచయిత పేర్కొన్నారు. పిల్లల నాటకానికుండవలసిన అన్ని లక్షణాలూ

రెండువంతులుంటాయి. ఈ బాలల హాస్యనాటికలకు శ్రీకారం చుట్టినవారు న్యాయపతిరాఘవరావు, కామేశ్వరి గార్లు, పొట్టి బావ చిట్టిమరదలు పాత్రలను సృష్టించి, పొట్టిబావ ఉద్యోగప్రయత్నాలు, 'లడ్డూచోరీ' కేసు, టపాకాయ దుకాణం మొదలైనఅనేక హాస్యనాటికలు వ్రాసారు. ఇవిగాక, 'గున్నయ్యగడ్డం', 'జబ్బుకుదిరింది', 'ఇంటిమందు', 'మడతకుర్చీ' 'శ్రావణ భాద్రపదాలు' ప్రసిద్ధి పొందిన బాలల హాస్యనాటికలు. ఇవి మొదలుగా నండూరిసుబ్బారావు 'దసరాఅల్లుడు', సేతుమాధవరావు 'సున్నారాయుళ్ళ సంఘం' 'ప్రోగెస్ కార్డు' వెలుగులోనికి వచ్చాయి.

నాటికల తర్వాత చెప్పకోదగినవీ, సంభాషణలలో, ఇతివృత్తంలో హాస్య లక్షణాలు గల నాటిక 'బడితనిఖీ', యామర్తి గోపాలరావు రచన. ఎవరు చెయాల్సిన పని వారేచేయాలన్నదే ఈ నాటిక ఇతివత్తం. ఇది చక్కని ప్రబోధాత్మక

హాస్యనాటిక. సున్నా మార్కులు వచ్చే ఒక బృందం సున్నారాయుళ్ళసంఘంగా మారి చేసే చిలిపి పనులన్నింటినీ, హాస్యస్ఫోరకంగా రచించారు సేతుమాధవరావు గారు. ఈ నాటిక పిల్లల మనసుల్లో చిరకాలం నిలిచే హాస్యనాటిక. ఇక తమాషా కోసం తనసేవకుడినే మహారాజుగా చేస్తాడు మహారాజు. ఎవరు చేయాల్సిన పని వారు చేయకపోవటంవల్ల వచ్చే అనర్థాలన్నిటిని హాస్యస్ఫోరకంగా రచించారు కె.యు.ల్ నరసింహారావుగారు.

పిల్లల హాస్యనాటికలలో పై మూడూ ప్రదర్శనాసౌలభ్యంగలిగి, ఎన్నోసార్లు ప్రదర్శింపబడిన ప్రసిద్ధ బాలలహాస్యనాటికలు. ఈ నాటికలు ఒక్కొక్కటీ దాదాపు వందసార్లకు పైగా ప్రదర్శింపబడిన నాటికలు.

మతిలేని మహారాజు నాటికలోని ఇతివృత్తం హాస్యరసాన్ని నిండానింపుకున్న తియ్యనిబూరెలా పిల్లలకు కన్పిస్తుంది. ఈ నాటిక ప్రదర్శించేటప్పుడు, రాజుగారు, నేను నృత్యం చేస్తాను. అంటూ నాట్యభంగిమలో నిల్చోవటం పిల్లలందరినీ కడుపుబ్బనవ్వించే సన్నివేశం. రచయిత అన్ని నాటకాలలాగే ఇందులోనూ రాజకీయపు పాళ్ళు కాస్తకలిసినా, ప్రధానంగా ఈ నాటిక బాలల హాస్యనాటికే. ఈ నాటికలో మతిలేనిమహారాజు ఒక సేవకుడినే రాజుగా చేస్తాడు. మంత్రినీ, ఇతర సిబ్బందినీ తొలగిస్తాడు. మంచి సలహాలిస్తారని, తనమాట వినే సేవకుడిని మాత్రం ఉంచుకుంటాడు. వాడికో డప్పుంటుంది. మాటిమాటికీ వాడి వేషం తానువేసుకుని నిలబడతాననీ, వాడిని సింహాసనం మీద కూర్చోమనీ బ్రతిమాలు తుంటాడు. సేవకుడు వద్దని వారిస్తుంటే వాణ్ణి బెదిరించి, తనపనులన్నీ చేయించుకుంటాడు. పాపం విధిలేక ఆ సేవకుడు రాజుగారి పిచ్చిపనులన్నింటికీ బలైపోతాడు.

హఠాత్తుగా రాజుగారికి నృత్యం చేయాలనిపిస్తుంది. నాట్య భంగిమలు కొన్ని చూపిస్తూ, ''నువ్వు డప్పువాయించు. నేను నాట్యం చేస్తాను.'' అంటూ చేస్తూనే ఉంటాడు. నాట్యం చేస్తూనే ఒకమ్మాయి కావాలంటాడు. విశ్వామిత్రుడి దగ్గరన్నృత్యం చేసిన మేనక కావా లంటాడు.

సేవ :- అదెలాసాధ్యం మహారాజా అదంతా దేవలోకంలో జరిగేపని

రాజు :- పోనీ నన్నే అక్కడికి పంపించు

సేవ :- దానికి మోక్షం కావాలండీ

రాజు :- అదే ఇప్పించు, ఇలా వస్తుంది మోక్షప్రసక్తి. ఈ సంభాషణలన్నీ ఒక ఎత్తు, రాజుగారి ఉరిశిక్షల పర్వం ఒక ఎత్తు. హఠాత్తుగా రాజుగారికి ఎవరికైనా ఉరిశిక్షవేయాలన్పిస్తుంది. దీనికి తగ్గట్టుగానే ఓ అభాగ్యుడు కోటప్పరాజుగారికి తనగోడు చెప్పకోవటానికి వస్తుంటాడు. ఈ లోగానే రాజు :- వాయించు, వాయించు డప్పవాయించు. ఉరిశక్షలు వేయించుకుని వెళ్ళమని చెప్పు. లేకుంటే తాళలేనురా మంత్రీ.

సేవ :- నేను మంత్రిని కాను మహారాజా, సేవకుడిని.

రాజు:- ఏం నేరం చేసావు?

కోట :- నేనేం నేరం చేయలేదు మహారాజా,

రాజు:- ఎందుకు చేయలేదు? ఉరిశక్ష వేయించుకోవూమరి?

కోట:- వంరేవేండోరిరంగయ్య నేరం చేసాడండీ, ఆయన వేండ కూలిపోయిందండీ, దానికింద నామేకపిల్లపడి చనిపోయిందండి

రాసు:-మేకపిల్లెందుకు చనిపోయింది? నువ్వెందుకు చనిపోలేదు? సరే ,ఆ రంగయ్యను పిలు.

రంగయ్యవస్తాడు. నీ మేడకింద కోటప్ప మేకపడి చనిపోయింది. దానికి నీకే ఉరిశక్ష వేస్తానంటాడు మహారాజు. రంగయ్య తప్పతనది కాదనీ, మేడకట్టిన తాపీ మేస్త్రీదనీ, అతన్నే ఉరితీయాలనీ చెప్తాడు. తాపీమేస్త్రీని పిలిపిస్తాడు రాజు. తప్పతనది కాదనీ, సున్నంలో నీళ్ళుకలిపిన కూలీదే తప్పనీ, అతనికే ఉరిశిక్ష వేయాలంటాడు తాపీ. కూలీ వస్తాడు.

రాజు:- వచ్చావా తంత్రీ రా! నువ్వేనా కూలీవి?

కూలీ :- చిత్తం నేనేనండీ!

రాజు :- ఇంకేం మంత్రీ ఉరిశిక్ష వేసేయనా?

కూలీ : ఉరిశిక్ష నాకెందుకు ప్రభూ! నేనేం తప్ప చేసాను?

రాజు:- చేయకపోతే ఎవరికి వేయాలి?

కూలీ:- సున్నంలో నీళ్ళుకలిపినవాడికే వేయాలండి.

సేవ :- వాడు చనిపోయాడండీ! పిలిపించటం సాధ్యంకాదు.

రాజు :– 'ఠాఠ్', సాధ్యంకాకపోతే ఉరిశిక్ష ఊరికే పోవాల్సిందేనా, నా సరదా ఊరికే పోవాలా? సింహద్వారం ముందు ఎవరుంటే వాడిని లోపలికొచ్చి, ఉరిశక్ష అనుభవించి పొమ్మను, లేదంటే నీకే వేస్తానా శిక్ష''.

అంటూ ఎవరోఒకరికి శిక్షవేస్తానని తొందరపడి పోతుంటాడు. చివరికి రాజభవనంముందున్న బాటసారికి ఉరిశిక్ష వేస్తానంటాడు. గత్యంతరం లేని ఆ బాటసారి ఆఖరికోరికగా తన గురువుగారికి నమస్కరించి వస్తానని కోరుకుంటాడు. బైటికి వెళ్ళి గురువుగారితో వస్తాడు.

గురువు:– మహారాజా! ఈ గడియ చాలా మంచిదండీ, ఈ సమయంలో గనక ఉరిశిక్షపడితే వాడికి మోక్షప్రాప్తి కలుగుతుంది. నేను ఎన్నాళ్ళనుండో మోక్షంకావాలని కోరుకుంటున్నాను. కాబట్టి ఆ ఉరిశిక్ష నాకే కావాలండీ!

రాజు :– ఐతే ఇప్పుడు ఉరికంబమెక్కిన వారు మోక్షానికి వెళతారా?

గురు:– ఔను మహారాజా! అందుకే ఆశిక్ష నాకే.........

రాజు :– ఇంకేం మంత్రీ. మోక్షాని కెళ్ళటం చాలా కష్టమన్నావే? చూసావా ఎంత తేలికో? పద-పద, నేనే ఉరికంబానికెక్కుతా! నేనే ఉరిశిక్ష వేసుకుని నా సరదా తీర్చుకుంటాను.

అంటూ ఆ తెలివితక్కువ మహారాజు తనే తనకోరికకు బలయిపోతాడు. మతిలేని మహారాజుతో ఎన్ని ఇబ్బందులో, అన్నీ రచయిత హాస్యస్ఫోరకంగా రచించారు. హాస్య, అద్భుతరసాలను బాగాపండించి, చిన్నపిల్లలందరికీ ఈ నాటికను ప్రీతిపాత్రం చేశారు నరసింహారావుగారు.

బాలలనాటికలోనైనా '''హాస్యరసాన్ని సర్వాంగ సుందరంగా పరిపోషించాలంటే, బహుశాస్త్ర పరిచయం, విశేషలోకానుభవం, విపులశబ్దాధికారం, విశిష్టప్రతిభా విభవం, వీటికి తోడు సమయజ్ఞతా, సౌహార్ద్రం సమకూరితే తప్ప ఏ రచయితా హాస్యాన్ని ఆద్యంతంపోషించజాలడు''.[2] కనుక, హాస్యరసాన్ని అద్భుతంగా పోషించి రచయిత తనశక్తిని నిరూపించుకున్నారు. ఈ నాటికలో మతిలేని మహారాజు చర్యలన్నీ హాస్యాన్ని కల్గించినా, వాటి వెనుక భయంకరమైన సామాన్యుడి వాస్తవ జీవితం ఉంది. పేద ప్రజల ప్రాణభయముంది. రాజుగారి మీద భయభక్తులున్నా అంతకుమించి ఏవగింపు, తమప్రాణాల మీద తీపి. సామాన్యుడిని ఊపివేస్తాయి నాటికలో. '''ఒకవ్యక్తి జీవితంలో గానీ, ఒకజాతి చరిత్రలోగానీ ఎన్నో ఒడుదుడుకులు రావచ్చు.

ఆశనిరాశలమధ్య చిక్కుకోవటం, అదృష్టంవచ్చినప్పుడు పొంగిపోవటం, దురదృష్టం ఎదురైనపుడు కుంగిపోవటం జరగవచ్చు. దీనికి తోడు అజ్ఞానం వల్లనో, అహంకారం వల్లనో ఆత్మవినాశకరమైన అపమార్గానపడి, వర్తమానాన్ని నాశనం చేసుకుని, భవిష్యత్తును భయభ్రాంత మొనరించుకునే అవకాశముంది. అలాంటిసమయాలలో హితోపదేశాలూ, హితబోధలూ, ఆంక్షలూ, హెచ్చరికలూ ఇవేవీ పనికిరావు. ఒక్కమనిషినే కాదు, మొత్తంజాతినే పతనావస్థనుంచి తప్పించి, మంచిమార్గానికి మరలించగల్గేదీ, ప్రమాదంనుంచి రక్షించి, ఆరోగ్యాన్నందించి జవాన్నీ, జీవాన్నీ ఇవ్వగలిగేది ఒకే ఒక్క హాస్యరసం మాత్రమే''.

బాధల్నీ, కష్టాల్నీ ఒకజాతిని భ్రష్టుపట్టించే కఠోర వాస్తవాలను, హాస్యస్ఫోరకంగా చెప్పగలగటం దైవమిచ్చిన వరం. ఆ రచన తాత్కాలికంగా హాస్యాన్ని కల్గించినా, శాశ్వతంగా తన ప్రమాణాన్ని నిలబెట్టుకుని, పలితలచేతుల్లో నూ, మనస్సుల్లో నిలుస్తుందని చెప్పటానికి సజీవసాక్ష్యం వంద సంవత్సరాల చరిత్రగల 'కన్యాశుల్కం' అనిచెపితే ఎవ్వరూ కాదనలేరు.

అలాగే భయంకరమైన రాచరికపు వ్యవస్థనూ, రాజుల అవ్యవస్థ చిత్తాన్నీ, సామాన్యుని ప్రాణభయాన్నీ, ఆ భయాన్ని సరదాగా చూసే మహారాజుల ఉరిశిక్షల సరదాలనీ, ఇంకా ఎన్నో సమస్యలను ఈ నాటికలో దర్శింప చేశారు రచయిత. మతిలేని మహారాజు చేతే అయినా ఈ నాటికలో ఒక రాలిపోయినవ్యవస్థను సజీవంగా సాక్షాత్కరింపచేసారు రచయిత.

సామ్యాన్యుని జీవితాన్ని శ్రీనుండి మంగళంవరకూ ఔపోసనపట్టి వారి సమస్యలన్నింటినీ తనవిగా భావిస్తూ, చీకటిలో దీపాన్ని వెలిగించే ప్రయత్నాన్ని విజయవంతం చేస్తూ, తన రచనా జీవితాన్ని సార్థకం చేసుకున్న నరసింహారావు పిల్లల నాటిక అయినా, హాస్యనాటక మయినా అందులో మహారాజు కథే వ్రాసినా అందులోనూ నిజమైన కథానాయకుడు సామాన్యుడే. ఆ సామన్యుని జీవితంతోనే నాడు మహారా...లాడుకున్నారు. నేడు రాజకీయవాదులు పబ్బంగడుపు కుంటున్నారు. కానీ రేపటివిజయం మాత్రం ఈ దేశపు అతి సామాన్యునిదే అనటంలో సందేహంలేదని పిస్తుంది నాటిక చదివితే.

౧. శ్రీశ్రీ ఆకాశవాణి కవిసమ్మేళనము. ౧౯7౯ నవంబర్. ౧4.

౨. బాలసాహితీ వికాసం. వెలగా వెంకటప్పయ్య. పే. 7౬

౩. బాలసాహితీ వికాసం. వెలగా వెంకటప్పయ్య. పే. 77

4. పుట్టినరోజు పండుగ. కె. యల్. నరసింహారావు. పే. ౨

5. ఆంధ్ర మహాభాగవతము. ప్రథమ స్కంధము. ౧౯వ పద్యము.

౬. పుట్టినరోజు పండుగ . కె. యల్. నరసింహారావు. పే. 5

7. పుట్టినరోజు పండుగ. కె. యల్. నరసింహారావు. పే. ౧4

౯. పుట్టినరోజు పండుగ. కె. యల్. నరసింహారావు. పే. ౨5

౧౦. తెలుగు సాహిత్యంలో హాస్యం. తూమాటి దోణప్ప. పే. ౧౨.

౧౧. కథలలో హాస్యం. మన్నవ గిరిధరరావు. పే. 5౬.

# హాస్య నాటకాలు

హాసాన్నికలిగించేది హాస్యం. దీనికి మేలము, చతురము, చమత్కారము, పరాచికము, పరిహాసము, ఎకసెక్కము వంటి పర్యాయపదాలు ఎన్ని ఉన్నా 'హాసము' అనేమాటను తరచూవాడుతుంటాము. ఈ పదానికి నవ్వుఅనికూడా అర్థంకలదు. 'నవ్వు' అంటే ఏమిటి? అనే ప్రశ్నవస్తే, ' ఇహ్వి' అనిఒకనవ్వుదాఖలు చేసుకోవటం తేలిక గానీ నిర్వచించటం నవ్వులాటకాదు''.

ప్రపంచంలో మొట్టమొదటి హాస్యరూపకం ప్రాచీన గ్రీసుదేశంలో డయోనిసెస్ దేవునికొలువు సందర్భంగా జరిపే ఉత్సవాలు, ఊరేగింపుల్లో పాడేపాటలనుండి పుట్టింది. గ్రీకు ఆహ్లాదరూపక కర్త ' రిస్టోఫానిస్ క్రీ.పూ.448 - 380, బర్డ్స్ ఫ్రాగ్స్ అనేనాటకాల్లో హాస్యరసాన్ని సముచితంగా పోషించాడు. ఇతనుసంఘాన్ని విమర్శించాడు. యుద్ధాన్ని నిరసించాడు. ఇతనిహాస్యానికి కళ్ళాలులేవు. ఇతని నాటకాలకు ప్రేక్షకులు పొట్టచెక్కలయేలా నవ్వేవారు. కానీ ఇతని హాస్యానికి ఒకలక్ష్యం ఉంది. ప్రపంచాహ్లాదరూపకాలల్లో 'రిస్టోఫానిస్' సరసననిలబడేవారు అరుదు. క్రీ.పూ. 342-292 మధ్యవాడైన మెనాండర్ ఆహ్లాదరూపకాలలో ఆరిస్టోఫానిస్ ఊహాచిత్రాలలోని అవధులు దాటిన హాస్యంకనబడదు. సంయమనం, భావనాపటిమ, మానవప్రవృత్తి, పరిశీలన గోచరిస్తాయి.

మైమ్స్‌రూపకాలలో కొన్ని పండితులచేతుల్లో పడి ప్రశంసలందుకుంటే, మరికొన్ని పామరజన రంజకమయినాయి. రోమనురూపకాలు గ్రీకు రూపకాలకు అనుకరణ. ఈ రోమనురూప కాలనుండే పాశ్చాత్యరూపక ప్రపంచం ఉద్భవించింది. ప్లాటస్ క్రీ.పూ. 254-184. ప్రథమ ఆహ్లాదరూపక కర్త. ఇతనికి సాహిత్యవేత్తగా ఖ్యాతిసంపాదించాలని లేదు. ప్రేక్షకులను నవ్విస్తే చాలనుకున్నాడు. ఇతని రూపకాలలో విదూషకుడు బానిస. కుట్రలుపన్నుతూ, హడావుడిగా తిరుగుతూ ఇతరుల విషయాలలో కలుగచేసుకునేవాడు. ఇతని రూపకాలలో శృంగారం, వినోదం సమ్మిళితం. ఆధునిక ఆహ్లాదరూపకానికి ప్లాటస్‌రూపకాలలో బీజావాపనం జరిగింది. 'అయిలూలరియా' లోని వృద్ధ లోభిపాత్ర మోలియర్ వంటి నాటకకర్తలను ఆకర్షించింది. యుద్ధాలు 'రాజకీయాలు' తత్వశాస్త్రం జోలికి ప్లాటస్ పోలేదు. సామాన్యుల కుటుంబాల్లోని హాస్యసంఘటలను ఇతి వృత్తంగా స్వీకరించాడు.

క్రీ.శ. 1564-1616 మధ్యకాలం వాడైన జగత్ప్రసిద్ధ ఆంగ్లనాటకకర్త షేక్స్‌పియర్ తన నాటకాలతో విశ్వవిఖ్యాతి సంపాదించాడు. ఇతని అహ్లాదరూపకాలు ఊహాజనితంగా నిర్మించినప్పటికీ మనస్తత్వ పరిశీలన, హాస్యం ఇతని ఆహ్లాదరూపకాలు సాహిత్య చరిత్రలో చిరకాలంనిలిచే అదృష్టానికి నోచుకున్నాయి. ఇతని హాస్యపాత్రలలో ప్రముఖుడు, ఫాల్‌స్టాఫ్, ట్వల్త్‌నైట్', 'యాజ్‌యూ లైకిట్, మర్చంట్ ఆఫ్‌వెనిస్' 'మచ్ యాదో యబౌట్‌నథింగ్' - మొదలైన ఆహ్లాదరూపకాలు చిరస్మరణీయాలు.

షేక్స్‌పియర్ అనంతరం ఆదారినే నడచిన వారు బోమంట్, ఫ్లెచర్‌లు, డెక్కర్, హేవుడ్, మిడిల్‌టన్ మాసింజర్, షోర్డ్, షెర్లీలుకూడా హాస్యనాటికలు రచించిన వారిలో ప్రముఖులు. బెన్‌జాన్సన్ పాత్రలలోని ఒక్కొక్క ప్రవృత్తిని బహిర్గతం చేస్తూ, నాటకరచన సాగించిన పండితకవి.

రోత్రో, బెన్సరేలు ఫ్రాన్స్‌లో ట్రాజికామెండీలను రచించారు. వీరితరువాత కోర్నిల్, రేసిన్, మోలియర్‌లు ప్రముఖ హాస్యనాటక కర్తలు. ఫ్రెంచి రచయితలపై స్పానిష్ నాటకరచయితల ప్రభావం కనబడుతుంది. మోలియర్ హాస్యనాటకకళలో అత్యుత్తమ స్థానాన్ని అలంకరించాడు. ఈయన ప్రేక్షకులను నవ్విస్తూ సంస్కరింపదలచి నట్లనిపిస్తుంది. టార్‌తాఫ్‌లో సంఘాన్ని దుయ్యబట్టాడు. కడుపుబ్బనవ్వించినా, ఆనవ్వు, ఆలోచింపచేస్తుంది. సాంఘిక విషయాలను హేతుబద్ధంగాపరిశీలించేలా చేస్తుంది. 1660 అనంతరం ఇంగ్లండ్‌లో రెస్టోరేషన్‌కాలం లో విలాసజీవనానికి అనుకూలంగా డ్రైడెన్, విచర్లీ, ఎతిరిజ్, వాన్‌బ్రా, ఫార్కవా హాస్య నాటకాలు రచించారు. కాన్‌గ్రేవ్ రచనలు హాస్యనాటకాలకు వన్నెతెచ్చాయి. ఆ శతాబ్దిలో మధ్య తరగతి జీవనాన్ని హాస్యకళగా స్వీకరించి విజయంసాధించిన వారిలో ప్రముఖులు షెరిడన్, గోల్డ్‌స్మిత్‌లు.

ఇక ఇంగ్లండ్‌లోని మానవతావాది, సోషలిస్టు, హాస్యకళా చక్రవర్తి జార్జి బెర్నాండ్‌షా. (1855-1950) సునిశిత అవహేళన, వ్యంగ్యం, హాస్యాలతో ఇతను నాటకాలనురచించాడు. నాటకకళను సంఘంలోని అవకతవకులను దుయ్యబట్టటానికి ఈయన ఉపయోగించినంతవాడిగా మరేరచయితా వాడుకోలేదు.

హాస్యనాటక చరిత్రలో పందొమ్మిదవ శతాబ్దంచివరి భాగంలోనూ, ఇరవయ్యో శతా ఆరంభం లోనూ వాస్తవికత, సహజత్వం, సింబాలిజం, సర్రియలిజం, డాడాయిజం, ఇంప్రెషనిజం ప్రవేశించాయి. తెలుగునాటకకర్తలు

చాలా మంది ఆంగ్లాభ్యాసం చేసినవారవటం వల్ల పాశ్చాత్య హాస్యనాటకాల ప్రభావం మనవారిపై చెరగనిముద్ర వేసింది. తెలుగులో మహాకవి గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' ప్రప్రథమ హాస్యరస ప్రధానమైన నాటకం. ఈ నాటకం పై పాశ్చాత్యనాటక ప్రభావ కనబడుతుంది. గురజాడవారి గిరీశం, షేక్సపియర్ ఫాల్‌స్టాప్‌వంటి హాస్యపాత్ర తరువాత కందుకూరి వీరేశలింగం పంతులు గారు ప్రహసనాలను రచించి తెలుగునాటకసాహిత్యంలో హాస్యరసానికి సంపూర్ణత్వాన్ని ప్రసాదించారు. ఐనా ప్రహసనాలు ఎక్కువగా సంఘంసంస్కరణోద్దేశ్యంతో రచించినవే. వీరిదారిలోనే చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహం తను రచనలో వాస్తవ చిత్రణతోపాటు హాస్యాన్నికూడా స్పృశించారు. కాళ్ళకూరి నారాయణరావుగారు 'చింతామణి'లో వేశ్యావృత్తి మీదా, ' వరవిక్రయం'లో కట్నాలమీద నవ్వుపుట్టిస్తూ దాడిచేసారు. వేదం వెంకటరాయశాస్త్రి 'ప్రతాప రుద్రయం చారిత్రక రూపకమ్మైనా, మరపురాని పేరిగాడి' హాస్య పాత్రను సాహిత్య లోకానికి అందించింది.

తరువాతకాలంలో భమిడిపాటి కామేశ్వరరావు మోలియర్ నాటకాలను స్వేచ్ఛానువాదం చేసారు. కొప్పరపు సుబ్బారావు వాస్తవ చిత్రణలో కడుపుబ్బనవ్వు పుట్టించే నాటకాలను రచించారు. వీరి 'అల్లీమురా' ఎంతోప్రసిద్ధమైన నాటకం. విశ్వనాధ కవిరాజుగారి 'దొంగాటకం', మల్లాది అవధాని 'అసంపూర్ణరామాయణం' తెలుగు నాటకరంగం మీద నవ్వుపుట్టించేదాడి. తెలుగుహాస్యనాటక చరిత్రలో చిరకాలంనిలిచే ప్రసిద్ధ హాస్యరచయితల సుప్రసిద్ధ హాస్యనాటకాలు కొన్ని – నాగరాజామాత్యుని 'మీసాల పక్షులు'

ముద్దు కృష్ణగారి 'ఆడవాళ్ళ తెలివి',

గోమంచి వారి 'ఆంధ్రనాటక రంగానికీ జై',

గొండ్లరామకృష్ణయ్యగారి 'తుఫాను',

ఎ.ఆర్. కృష్ణగారి 'అరగంటలో అదృష్టం',

పోకల నరసింహారావుగారి 'ఆత్మగౌరవము',

భమిడిపాటి రాధాకృష్ణ గారి 'మనస్తత్వాలు', 'కీర్తిశేషులు', 'ఇదేమిటి', 'దంతవేదాంతం',

శ్రీపాద కృష్ణమూ  ర్తిగారి 'ధార్మికదంపతులు',

డి.వి. నరస[illegible]జుగార[illegible] '[illegible]టకం',

మల్లాది వెంకటకృష్ణమూర్తి 'సుబ్బక్క విరహం',

శ్రీవాత్సవ 'స్నానాలగది',

కాళ్ళకూరి నారాయణరావుగారి 'కారణంలేని కంగారు',

కూచి నరసింహంగారి 'తెలుగుక్లాసు తమాషా',

అవసరాల శేషగిరిరావు గారి 'పునస్సంధాన శుల్కము',

బేతవోలు పరబ్రహ్మం 'లడ్డూ పకోడీ సంవాదము',

ఆదివిష్ణు 'కుక్కపిల్ల–సబ్బుబిళ్ళ',– మొదలైనవి.

నవరసాలలో శృంగారంతర్వాతే హాస్యాన్ని పేర్కొన్నా, మధ్యతరగతి మానవుల జీవితాల్లో కాస్తంత నవ్వుని చిలికించేది ఈ హాస్యరచన లేననటంలో సందేహంలేదు. కె. యల్. నరసింహారావుగారు హాస్యనాటకా రచనల్లో తనదైన బాణీ ఏర్పరచుకున్నారు. వీరి ఉంగరాల వేళ్ళు, అపరాధ పరిశోధకులు, రేపటికి వాయిదా, మొదలైన హాస్యనాటికలు నవ్వు పుట్టించటమే గాక, సమాజంపై మనిషి బాధ్యతను సున్నితంగా గుర్తుచేస్తాయి.

**ఉంగరాల వ్రేళ్ళు :**

కె. యల్. నరసింహారావుగారి హాస్యనాటికలలో ఈ నాటిక ప్రసిద్ధమయింది. సినిమాతీయటంలోని సాధకబాధకాలను ఈ నాటికలో హాస్యస్ఫోరకంగా వివరించారు. తన రచనను వెండి తెరమీద కెక్కిస్తానంటే ఏ కవి సంతోషించడు? ఈ నాటికలో అతను రచించినట్టుగా కాక, కథ ఎన్నెన్ని మార్పులుపొంది, చివరకు ఏరకంగా మారిందీ హాస్యస్ఫోరకంగా తెలిపే ఈ నాటిక ప్రదర్శనా[illegible]కూడా ఎంతో విజయవంతమయింది.

నాటకసాహిత్యంలో సంభాషణపరంగా హాస్యాన్ని చిందించటం అంతసులభంగాదు. ఒకకథలోనో, నవలలోనో ప్రయోగించబడిన హాస్యం ఏకాంతంగా చదివితే తెప్పించిననవ్వును సంభాషణా ప్రధానమైన నాటకంలో పాత్రౌచిత్యంగా, సముచితమైన సన్నివేశపరంగా, పాత్రలగంభీరతకు భంగంరాకుండా, ఇతివృత్తపు పోకడకు అతికేట్టుగా, నాటకాన్ని చూస్తున్నప్పడు

కూడా తెప్పించగలగటానికి హాస్యనాటకరచయితకు హాస్యరసంమీదే కాకుండా లోకానుభవంలో కూడా మంచి అధికారం ఉండితీరాలి. నాటకరచనలో సంభాషణాపరంగానో, సన్నివేశపరంగానో చిందే హాస్యంకన్నా, ఒక నిర్దిష్టమైన

గాఢమైన ఇతివృత్తంలో తేలికగా హాస్యాన్నొలికించడానికి, ప్రేక్షకులను హాయిగా నవ్విస్తూనే సూటిగా లోకంపోకడను తెలియచేయటానికి అపారమైన రచనానుభవం కావాలి. అది నరసింహారావుగారికి వెన్నతో పెట్టిన విద్య.

వీరి ఉంగరాల వ్రేళ్ళు వ్యంగ్యరచన, సినిమా తీయటంలో అసలు కథరూపొందే మార్పులతోపాటు ధనస్వామ్యపు ఉంగరాల వ్రేళ్ళు ప్రతివిషయాన్ని తమ కనుకూలంగా ఎలా మార్చుకుంటాయో తెలియచెపుతూనే ఆయా సమయాల్లో నిజమైన కళాకారులు ఎలాస్పందిస్తారో హాస్యస్ఫోరకంగా రచించారు. సహజంగా ప్రపంచంలో కళాకారులుమూడురకాలుగా ఉంటారు. మొదటివర్గం కళకోసమే జన్మించి, కళకోసమే మరణిస్తారు. వీరికి తమకు పేరు ప్రఖ్యాతులు రావాలనిగానీ, తద్వారా ధనసంపత్తి పెరగాలనీ ఎంతమాత్రమూ ఆశించరు.. తమ కళారాధన తప్ప మిగిలినవన్నీ వీరికి చాలా అల్ప విషయాలుగా కన్పిస్తాయి. వీరంత తొందరగా గుర్తింపబడకపోయినా, ఒకసారి ప్రపంచం వీరిని గుర్తిస్తే శాశ్వతమైన కీర్తిని వీరికి బహూకరిస్తుంది. రెండోవర్గం వారికి కళాతృష్ణ ఎంత ఉంటుందో అంతకు రెండు రెట్లు ప్రపంచంతో సత్సంబంధాలుంటాయి. తమకళను వీరు వ్యాపారాత్మకంగా మార్చుకొని తాము సుఖపడుతూ ప్రపంచాన్నీ సుఖపెడుతుంటారు.

ఇక మూడోవర్గంలోని వారిలో నిజమైన కళకొంచెముంటుంది. కానీ దాన్ని ఎంతో భారం మోస్తున్నట్టు, తమకన్నా సమర్థులెవరూ లేనట్టు అన్నింటిలోనూ తామే గౌరవింపబడాలన్నట్టు ప్రవర్తిస్తుంటారు. తమ భావనాసాఫల్యం కోసం వీరు ఎంతనైచ్యానికైనా దిగుతారు. డబ్బిచ్చి ప్రోగ్రాములు పెట్టించుకునేవారు, సన్మానాలు చేయించుకునేవారూ తమ డబ్బుతోనే అవార్డులందుకునేవారు ఈ కోవలోకి వస్తారు. తమను ప్రపంచం గుర్తించకున్నా, తామే ఆ విషయాన్ని ఈ అజ్ఞానలోకానికి తెలియచేస్తున్నామనే భావం వీరిలో బలంగా ఉంటుంది.

కానీ నిజమైనకళాకారులుడబ్బును ఆశించరు. ఆత్మతృప్తినీ, ఆనందాన్నీ ఆశిస్తారు. తనూ కళా వేరుకాదన్న బలమైన భావాన్ని కలిగి ఉంటారు. తన కళారాధనా తపస్సులో వారీ లోకాన్నే మరచిపోతారు. అలాంటప్పుడు మాత్రమే

ప్రపంచానికి అద్భుతమైన వారి కళాఖండం దర్శనమిస్తుంది. ఒక మొనాలిసానీ, ఒక ఖజురహో శిల్పకళనూ, ఒక రామాయణ మహాకావ్యాన్నీ, ఒక మహాప్రస్థానాన్నీ అందుకే మనం నేటికీ ఆరాధిస్తున్నామని చెప్పటానికి ఆ కళా ఖండాలలోని కళారాధనా తత్పరతే ముఖ్యం.

ఈ ఉంగరాలవ్రేళ్ళు హాస్యనాటికలో తన కథను వెండితెరమీద చూడాలన్న ఆశయంతో ఒక సినిమాకు కథను సమకూరుస్తాడు కవికరుణాకరం. కానీ ఆ కథ అతను రచించినట్టుగా కాక, ఎన్నెన్నో మార్పులు పొంది, చివరకు ఏదోరకంగా మారటం అనేది ఇందులో హాస్యస్ఫోరకంగా రచింపబడింది. ఈ నాటిక ఒకేసన్నివేశంతో, ఒకేరకం సినిమాకు సంబంధించిన సంభాషణలతో, ఒకేరంగంలో ముగుస్తుంది. సరదాఫిల్మ్స్ ఆఫీసు గదిలో సినిమా డైరెక్టరూ, అసిస్టెంటూ తాము తీసిన సినిమా గురించి మాట్లాడుతుండటంతో నాటికమొదలవుతుంది. అసిస్టెంటు మధు "'ప్రజలు, ప్రభుత్వం, పత్రికలు, కవులు, రచయితలు, జర్నలిస్టులు విమర్శకులు, పిన్నలు, పెద్దలు, వృద్ధులు... ఇంతెందుకూ? పిపీలికాది బ్రహ్మపర్యంతం అంతా మన చిత్రానికి బ్రహ్మరథం పడతారంటే, పొగడ్తనుకోకండి. ఏమన్నా అనుకోండి- వున్న మాటనేస్తున్నాను. మనం తీసిన మయాలవిరాట్, ముత్యాలవనం, ఉగ్రసేన, ఊహాతీతం. శ్రీమద్రామాయణం, శివపురాణం, కాశీమజిలీ,కనకదుర్గ, మొదలైన చిత్రాలన్నీ దీనికింద బలాదూరంటే నమ్మండి.''[2]

"'డైరెక్టర్:- మనం మెచ్చుకున్నా కవిగారు మెచ్చుకోవాలి గదా?

మధు:- మెచ్చుకోకపోతే ఆయన కవిగాదు కాకి అనేస్తాను అంతే- అంతటి సహత్తర సన్నివేశాలు, మహోజ్వల ఘట్టాలతో నిండి తొణికిసలాడుతూ, పొంగిపొరలుతున్న మన అఖండ చిత్రరాజాన్ని మెచ్చుకోకపోతే అది కళాహృదయం కాదు.కలినపాషాణం. మార్పులేం మనకోసమని చేసామా? సినేరియా కోసం, టెంపో కోసం, మ్యాస్ అప్పీలింగ్ కోసం, ప్రజలకోసం, వాస్తవిక జగత్తుకోసం, కళాపోషణకోసం, వాంటేడ్ షాట్లకోసం, సింబాలిజంకోసం కొద్దిపాటిమార్పులుచేసాంఅంతే. దీనికి కవిగారు అంతలా బాధపడవలసిన అవసరం లేదు.''

అంటూ సినిమా తీయటమే గొప్పనీ, దానికి కథరాయటమేం బ్రహ్మ విద్యకాదనీ, అసలు రచయితలు వ్రాసిన కథ మార్పుచేయందే సినిమా తీయటం చేతగాదనీ తన అభిప్రాయాలను ధారాళంగా సెలవిస్తుంటాడు అసిస్టెంట్ డైరెక్టర్

మధు. కరుణాకరం బాధవర్ణనాతీతంగా ఉంటుంది. తమపేరువాడుకుంటూ తనువ్రాసిన కథను ముక్కలు చేస్తుంటే ఏ రచయిత సహిస్తాడు? కరుణాకరం ఉన్నతమైన భావాలుగల 'దేశభక్తుడు' అని పేరుపెట్టి, ఆ కథానాయకుని బాపూజీ సిద్ధాంతాలను నమ్మి, వాటిని అమలు జరిపి, దేశాన్ని శాంతంగా, సత్యం అహింసలవైపు పురోగమింప చేసే శాస్త్రజ్ఞునిగా తీర్చిదిద్దుతాడు. అతను మూఢ భక్తుడు కాదు. హేతువాదంతోబాపూజీ సిద్ధాంతాలను నమ్మి, అర్థంచేసుకున్న మేధావి. అలాంటినిజమైన విజ్ఞానిసినిమాలో సిద్ధాంతాల ముసుగు కప్పకున్న దేశద్రోహిగా మారిపోతాడు.

కవి 'దేశభక్తుడు' పేరు సినిమాకోసం మారి, 'బాపూజీ' అవుతుంది. కథలోని హేతువాది సినిమాలో బాపూజీ గుడికట్టిస్తాడు. ఆ దేవాలయంలోనికి జనంరావటం, భజనలు, కోలాటాలు, జానపదనృత్యాలు జరుగు తుంటాయి. ఇహ కథానాయకుడు గుడికట్టటానికి డబ్బుకోసం అతడిని ప్రజానాయకుణ్ణి చేస్తారు. ప్రజలడబ్బుతో గుడికట్టించి, ప్రజలకోపం తెప్పించి, జైలు పాలవుతాడు రామదాసులాగా అక్కడ జైలుసీను, ఖైదీలతో పాటలు పెడతారు. ఇకజైలుబాధలుపడలేక కథానాయకుడు విషంపుచ్చుకోవటానికి ప్రయత్నించటం, గాంధీగారు ప్రత్యక్షమై డబ్బివ్వటంతో ప్రజలు ఆ భక్తుని గుర్తించి, కాళ్ళు పట్టుకోవటం. ప్రభుత్వం విడుదల చేయుటంతో కథానాయకుడు గొప్ప ప్రజానాయకుడు కావటం. ఇలా కథ సగంవరకూ వస్తుంది. ఇంకా హీరో స్కూల్లకూ, వసతులకు, డబ్బుకోసం ఎన్నికలు జరిపిస్తారు. ప్రతినిధినిండి మంత్రి దాకా ఎలక్షన్లు ఎన్నికలఘట్టం, జనంముఠాలుగామారి తిట్టుకోవటం, ప్రచారాలు చేసుకోవటం, కరపత్రాలూ, యుద్ధాలుముగిసి కథానాయకుడు మంత్రి కావటంతో ఆపార్టీవారంతా ఆనందోత్సాహాలతో నృత్యం చేయటం. ఇక కథారచయిత నాయకుడు ఒక హరిజన బాలికను పెంచుకుంటాడని వ్రాస్తే, దానికీ సినిమాకోసం చిన్నమార్పు చేసి, కథానాయకుడు కట్టించిన గుడిలోకి ఊరిజనం హరిజనులను రానియ్యరు. నాయకుడు నానినెదిరించి, హరిజనులకు దేవాలయ ప్రవేశం చేయిస్తాడు. అందులోనే వాయిద్యాల హోరులో, నృత్యాలజోరుతో ఒకపాట, విలన్ హరిజనబాలికను బలాత్కరించ బోతుంటే హీరోకు గాంధీగారు ప్రత్యక్షమై (కలలో) రక్షించమని చెప్తాడు. నాయకుడు విలన్‌కు బుద్ధిచెప్పి ఆ హరిజనబాలికను తన రక్షణలో ఉంచుతాడు. వారిమధ్య బ్రహ్మాండమైన ప్రేమసీన్లు పండుతాయి. అమ్మాయి గర్భవతి అవుతుంది.

ఇక ప్రజలకు స్వేచ్ఛగా సేవచేయాలనుకునే కవి సృష్టించిన నాయకుడు సినిమాలో లంచగొండి మంత్రిగా మారిపోతాడు. ప్రజలంత ఎదురు తిరిగితే ఇంట్లోనుండి పారిపోయి, అడవుల్లో దాక్కుంటాడు. మళ్ళీ మహాత్మాగాంధీ ప్రత్యక్షమై, ప్రజలకు ధర్మోపదేశం చేసి నాయకుణ్ణి తిరిగి మంత్రిని చేసి, ప్రజలంతా సుఖశాంతులతో ఉండాలని దీవించి తన దేవాలయంలోకి వెళ్ళిపోతాడు. దాంతో కథసుఖాంతమై సినిమా ముగుస్తుంది.

ఈ కథకు తన పేరుపెట్టినందుకు కరుణాకరం బాధపడు తుండగా, సినిమా నిర్మాతలు రాఘవులు, వీరాస్వామి వస్తారు. తన బావమరిది వ్రాసినకథ అందులో చేర్చాలని వీరాస్వామి, తనకుతెలిసిన లంబాడీపిల్లను హీరోయిన్ని చేయాలనీ, తన చిన్నకొడుక్కి సినిమాలో వేషం ఇవ్వాలని రాఘవులూ పట్టుపడతారు. చేసేదిలేక డైరెక్టరు సరేనంటాడు. కథారచయిత కథను మార్పు చేసి తాను డైరెక్ట్ చేస్తే, తనకన్నా ధనవంతులైన నిర్మాతలు తనకథనే మార్పు చేయాలని పట్టుపట్టడంతో డైరెక్టరు కూడా బాధపడతాడు. నాటిక ముగుస్తుంది.

ప్రపంచంలో ప్రతిప్రాణీ తనకు స్వేచ్ఛ కావాలనీ, తనకిష్టమై రీతిలో పరిసరాలనుమార్చాలనీ అనుకుంటుంది. కానీ చివరికి విజయాన్ని సాధించేది ధనవంతుల ఉంగరాలవ్రేళ్ళే నన్న నిజాన్ని రచయిత ఈ నాటిక ద్వారా తెలియజేస్తూ ధనస్వామ్యాయాగ్ని నిరసించారు. ఆదర్శానికీ, వాస్తవానికీ ఎంతతేడా ఉంటుందో స్వార్థ పూరితమైన నేటివాతావరణలో రచయితలు, కవులు ఎంత మనస్తాపానికి గురవుతున్నారో ఈ నాటికద్వారా తెలియచేశారు రచయిత.

తనకళలో లీనమైన కళాకారుడు ఏ అపూర్వాన్ని సృష్టించినా, నిజమైన రచయిత ఏరంగాన్ని గూర్చివ్రాసినా వాటియొక్క ప్రధానలక్ష్యం సంఘానికి విజ్ఞాన వినోదాలనందించటమే గాక వాస్తవాన్ని వ్యంగ్యంగా తెలియచెప్పగా[illegible] అక్షరాలా నిజమని ఈ నాటికద్వారా నరసింహారావుగారు ప్రేక్షకలోకానికి ఒక నిశ్చితాభిప్రాయాన్ని కలుగచేసారు.

**అపరాధ పరిశోధకులు :**

ఈ నాటిక భీభత్సంలోనించి హాస్యంవైపు ప్రయాణించే రసగుళిక. సంపూర్ణ హాస్యరసంతో అపరాధపరిశోధనను హాస్యస్ఫోరకంగా మలచి నాటికను ఆసాంతం నవ్వుపుట్టేలా తీర్చిదిద్దారు నరసింహారావుగారు.

నవరసాల్లో ముఖ్యమైన శృంగార, వీర రౌద్ర, భీభత్సాలుండగా, రచనల్లో హాస్యానికే ప్రాధాన్యతనిచ్చి, ప్రముఖులైన రచయితలు సైతం దాన్ని స్వీకరించనిదే

వదలలేదు. దానికి ముఖ్యమైన కారణం సామాజిక పరిస్థితులు. నేటిసామాన్య మానవుడు జీవితంలో హాయిగా నవ్వుకోలేని పరిస్థితిలో ఉన్నాడు. కానీ హాస్య స్ఫోరకమైన ఏ చిన్నవిషయం అతనుగ్రహించినా, ఫక్కున నవ్వందే ఉండలేడు. ఎప్పుడైతే సాహిత్యం రాజులబారినుండి సామాన్యుల దరిచేరిందో సాహిత్యంలో నాయకుడు రాజప్రముఖులు కాకుండా మధ్యతరగతి మానవుడయాడో అప్పుడే సాహిత్యంలోని నవరసాలూ అనుభూతమవుతున్నాయి. అలాగే హాస్యం కూడా సామాన్యునికి అందుబాటు అయింది. కాలే కడుపులతో, కాయకష్టంతో, నిరాశాస్పృహలతో దినదిన గండంగా బ్రతికే మధ్యతరగతి జీవులకు హాస్యరసం ఒక చల్లని చిరుజల్లు, సేదదీర్చి వారికష్టాలను తాత్కాలికంగానైనా మరపింపచేసే దివ్యౌషధం. సమస్యలతో సతమతమయ్యే సామాన్యమానవుడు విశ్రాంతిలోనో, వినోదం కోసమో సాహిత్య పఠనం మాత్రం మరువడు. అప్పుడతనికి జ్ఞానబోధనలుగానీ పురాణాకథలు గానీ రుచించవు. అవిఅర్థం చేసుకుని ఆచరించే సమయమతనికి లేదు. ఆ సమయంలో రౌద్ర, భీభత్సాల కన్నా, వీరకరుణరసాలకన్నా హాస్యమే అతని ఆత్మబంధువు. అందుకే ఇటీవల హాస్యరచనలు, హాస్యనాటికలు ప్రాబల్యాన్ని పెంచుకున్నాయి. సంస్కరణోద్దేశ్యంతోనూ సామాన్యుని మరువని నరసింహారావుగారు వారికోసమే హాస్య నాటికలు రచించారు.

అపరాధపరిశోధకులలో ఇతివృత్తం అపరాధపరిశోధనే. అసిస్టెంటు గట్టిగా పిలిస్తేనే భయపడే సత్యం అపరాధపరిశోధనా సాహిత్యం మీద మోజుతో తానే పరిశోధకుడిగా మారుతాడు. విశ్వం ఇతని సహచరుడు. పరిశోధనలో రాణించటంకోసం సాధ్యమైనదానికన్నా ఎక్కువ కష్టపడటం నవ్వు తెప్పిస్తుంది. నేరపరిశోధనకు కావలసిన ముడిసరకును, అంటే హత్యలను తామే సృష్టించాలనుకుంటారు. ఎక్కడైనా నేరాలు జరిగితేనే గదా వీరు పరిశోధించి, నేరస్థులను పట్టుకోవటానికి, ఎక్కడా హత్యలు జరుగటంలేదని వారిలో ఒకరే ఆత్మహత్యా ప్రయత్నం చేసుకుంటాననటం విపరీతమైన నవ్వుపుట్టిస్తుంది. కె.యల్. నరసింహారావుగారు గ్రామీణ నాటకాలు వ్రాసినా, సాంఘికనాటకాలు వ్రాసినా అంతర్గతంగా హాస్యాన్ని చొప్పిస్తారు. ఈ నాటికలో సంభాషణాపరంగానూ, సన్నివేశచిత్రణ ద్వారా హాస్యాన్ని అందించారు.

ఈ నాటికలో డిటెక్టివ్ సత్యంచాలా భయస్థుడు. కానీ నేరపరిశోధనలో మంచిపేరు తెచ్చుకోవాలని అతని ఆశయం. గోళీలు కొనటానికి డబ్బివ్వలేదని ఇతని కొడుకు తన భార్య రాజ్యానికి పిస్టలుగురిపెట్టి పేలుస్తాడు. కొంచెంలో

గురితప్పుతుంది అప్పుడు సత్యం - నేను మూడేళ్లనించీ బోర్డుకట్టి, ఇంత పరిశోధనా సాహిత్యం చదివి పిస్టళ్ళుకొని ఇంతనేర్చినా, ఇంకా గురికి బెత్తెడు దూరంలోనే ఉంటున్నాను. కాని వాడప్పుడే అంతగురిగా కొట్టాడంటే వాడు నిజంగా నన్నుమించిన వాడవుతాడు. '' అంటూ ఆనందిస్తాడు.

తన నేరపరిశోధన కోసం మామగారిని చంపి రావలసిందిగా బావమరిదికి రక్తంతో ఉత్తరం వ్రాస్తాడు. అతనూ ఇదే కోవకు చెందిన వాడవటంవలన కన్నతండ్రినే చంపే ప్రయత్నంలో ఉంటాడు. సత్యంభార్యరాజ్యం ఈ పిచ్చి వద్దని బతిమిలాడుతున్నా ఎంతమాత్రం వినిపించుకోక ఆమెనే బెదిరిస్తుంటాడు. హత్యలు జరిగితే హాయిగానూ అన్నం తినమంటే అనవసరంగానూ భావిస్తున్న భర్తను చూసి బాధపడుతూంటుందా ఇల్లాలు. ఎంత చెప్పినామారని అతని మూర్ఖపు ధోరణికి కుమిలిపోతుంటుంది. తన నేరపరిశోధన కోసం, తనకు అసిస్టెంటుగా చేరతానన్న బావమరిది రాఘవకు అతని తండ్రికి విషమిచ్చి చంపమని పంపించి, ఆ హత్యను డిటెక్షన్ చేయటానికి 'జోగులనే మరొక అసిస్టెంటును పంపుతాడు. తండ్రినిచూసి భయపడిన రాఘవ చంపకుండానే వస్తాడు. చివరకు విసిగిపోయిన

రాఘవ :-''బావా నేను ఆత్మహత్య చేసుకుంటాను. మీరు పరిశోధించండి.

విస్సు:- భలేఛాన్సుసార్ కానియ్యండి

సత్యం :- వాడు ఆత్మహత్య చేసుకుంటే ఛస్తాడుగానీ, నాకు అసిస్టెంటు ఎలా అవుతాడు''? ఇలా సాగుతుంది వీరి పరిశోధనా సంభాషణ. ఈ ముగ్గురూ ఎప్పుడు తమకు పోలీసు సూపర్నెంటునుంచి నేరపరిశోధనకు ఆహ్వానంవస్తుందా అని ఎదురు చూస్తుంటారు. ఏ ఫోనువచ్చినా పోలీసులు తమను ఏదోక్లిష్టమైన కేసు పరిశోధించమని అడుగుతారని వీరి ఊహ.

వీరికి పక్కింటివాడైన అవధానిగారు తమింట్లో డబ్బు పోయిందనీ, పోలీసులకు ఫిర్యాదు చేసేంత పెద్ద మొత్తంకాదనీ వీరిని పరిశోధించమని అడగటానికి వస్తాడు. దానికి సత్యం హత్యానేరంకానిదే తాము కేసుముట్టమని చెప్తూ తమను డిస్టర్బ్ చేసినందుకు పరిహారంగా మూడువందలు ఇవ్వాలంటాడు. పోయిన రెండువందలయాభై రూపాయలకు మూడువందలేమిటని అవధాని ప్రశ్నిస్తే కాలుస్తామని బెదిరిస్తారు. భయపడిపోయిన అవధాని ఇంటికెళ్లి డబ్బు

పంపిస్తానని చెప్పి పోలీసులకు రిపోర్టిస్తాడు. ఇక్కడితో వ్యవహారమంతా చట్టం పరిధిలోకొస్తుంది. లైసెన్స్‌లేకుండా రివాల్వర్‌నుపయోగిస్తున్నందుకు, హత్యాప్రయత్నం చేసినందుకు, అవధానిని బెదిరించి నందుకు సత్యంబృందాన్ని పోలీసులు వచ్చి అరెస్ట్ చేస్తారు. తమకే నేరపరిశోధనాబాధ్యతను పోలీసులకు లొంగిపోతారు.

హత్యా పథకంతో మొదలయిన ఈ హాస్యనాటిక హత్యాప్రయత్నేరం కింద నేరపరిశోధకులే చట్టానికి లొంగిపోవటంతో సమాప్తమవుతుంది. హాస్యనాటికలో కూడా రచయితసామాజిక చిత్రణను మరువలేదు. విప్లవసాహిత్యం చదివి, వర్గపోరాటాలను చూసి ఉత్సాహవంతులైన ఎందరో యువకులు ఆనాటి ఉద్యమాల్లో చేరిన వైనం, దాని పర్యవసానం రచయిత మనసులో పదిలంగా ఉంది. కాబట్టే సాహిత్యం చదివి అనుకరించటానికి ముందు సామాజిక వ్యవస్థను మననంచేసుకోవాలనీ, లేకుంటే ఆ సిద్ధాంతాలుగానీ, ఆచరణవిధానాలుగానీ నిలకడగా ఉండవని రచయిత నిర్ధారించారు.

సాహిత్యం అనుకరణీయమైనదా? కాదా? అనే ప్రశ్నకు ముందు, జన జీవనలో దాని పర్యవసానం గమనించనిదే, అనుకరించటంగానీ, ఆచరించటం గానీ సవ్యమైన పద్ధతిగాదు. రామాయణాన్ని చదివి శ్రీరాముని ఏకపత్నీవ్రతాన్ని అనుకరిస్తే తప్పపట్టని జనం భారతాన్ని చదివి ద్రౌపది లా బహుభార్యాత్వాన్ని కోరితే సహించదు. కవిదృష్టి వాస్తవికతను చిత్రించినా, అంతకు రెండింతలు కాల్పనికతవైపు మొగ్గుచూపుతుంది. ''వాక్యం రసాత్మకం కావ్య''మన్నారు పెద్దలు. మనసుకు రసానందాన్ని కల్గించి తద్వారా బ్రహ్మానందాన్ని అందచేయగలిగే దే ఉత్తమసాహిత్యం. దానిపని ఆనందాన్ని అనుభవించేలా చేయటమే. ఒకచోట అనుసరణీయమే ఐనా, దానికి దేశకాలపాత్రాలు అత్యంతావశ్యకాలు.

కానీ అవేమీ గమనించకుండా సాహిత్యం మీద మోజుతో, వ్యామోహంతో ఆచరణలోకి దిగితే దాని పర్యవసానం విషాదాంతమే అవుతుంది. ఈ నాటిక నేటి జనం వెర్రివ్యామోహానికి ప్రతీక. పక్కవాడుగట్టిగా పిలిస్తేనే భయపడే సత్యం నేరపరిశోధకునిగా మారటం కోసం చేసే ప్రయత్నాలన్నీ హాస్యాన్ని సృష్టించేవే. అపరాధ పరిశోధనా సాహిత్యాన్ని చదివి, అనుకరించాలని మళ్ళీ ఎవరికీ మనసుపోకుండా ఈ నాటికతో కట్టుదిట్టం చేసారు రచయిత. సంఘాన్ని సంస్కరించాలంటే సామాజిక వనంలోని కలుపుమొక్కలను ఏరి వేయటంతో పాటు మంచి మొక్కలకీ పాదులు చేయక తప్పదని రచయిత ఈ నాటకంద్వారా విశ్లేషించేశారు.

**రేపటికి వాయిదా :**

అనుభవజ్ఞుల హృదయ వీణాతంత్రులను గాలి మీటినా జీవితసత్యాలు సరిగమపదనిసలై శ్రతిలయలతో సమాయత్తమవుతాయి. ఘుమ్మనిమ్రోగి పలితల హృదయాలను ఝుమ్మనిపిస్తాయి. కె.యల్. నరసింహారావుగారి రేపటికి వాయిదా హాస్యనాటికైనా, వారి అనుభవాలపుటలను అలవోకగా తాకుతున్నట్టనిపిస్తుంది.

ఈ నాటకరచయిత బహునాటకకర్తగా తననాటకాలకు ప్రదర్శనలు కూడా ఎన్నోవందలసార్లు నిర్వహించిన నటులు, దర్శకులు, నిర్మాతగా ఎన్నోపాత్రలను నిజజీవితంలో పోషించినవారవటం వలన మాత్రమే ఇలాంటి స్వాభావికపు హాస్యనాటకాలు ఆయనకలంనుండి జన్మించాయి. ఈ నాటకం ఇతివృత్తంలీత్యాకూడా నాటకానికి సంబంధించిందే. ఒక నాటకానికిముందు రిహార్సల్సవేయటం, అందులోని సాధకబాధకాలన్నీ స్వయంగా అనుభవించిన వారవటం వల్ల ఈ నాటకరచన వాస్తవానికి దగ్గరగా ఉంది. "సాహిత్యరూపాలలో మరేదైనా ప్రజలకు దగ్గరకాకుండా వర్థిల్లగలదేమోగానీ నాటకం మాత్రం ప్రజలకు దూరమై ముందుకుసాగలేదు. ప్రజలకు దూరమైతే అది కృత్రిమమైపోతుంది. వికృతమైపోతుంది. దుర్బలమవుతుంది జీవచ్ఛవమైపోతుంది. ఏపుగా పెరగాలంటే, అందచందాలు ఉట్టిపడాలంటే, 'ఔ ' ననిపించుకోవాలంటే నాటకం తప్పని సరిగా ప్రజలమధ్యకు వెళ్ళాలి. వారితోసన్నిహిత సంబంధాలు పెంచుకోవాలి. వారి జీవితంలో అంతర్భాగమైపోవాలి. ఇందుకోసమే మననాటకం వీథినాటకమైంది''.[3] అలా జనంలోకి చొచ్చుకుపోయే నాటకాల్లో హాస్యనాటికలు మున్ముందుంటాయి.

అసలు నాటకానికి రిహార్సల్స్ అవసరమా అని ప్రశ్నించు కుంటే, "మేం పెద్దనటులంగదా మాకు రిహార్సల్స్ ఎందుకు అని కొందరంటారు. కానీ ఇతరులనటనా విధానాన్నీ, వారి కదలికల్నీ, తెలుసుకుని వీటితో తమ అభినయాన్నీ, నటననీ అనుసంధించటానికైనా రిహార్సల్స్ అవసరం. పైగా ఎక్కడ విరుపు నివ్వాలి? ఎక్కడ విరామం ఇవ్వాలి? ఎటునుంచి ప్రవేశించాలి? ఎటునుంచి నిష్క్రమించాలి? ఏ మాటఅంటూ ఎటు కదలాలి? ఎంత వరకు కదలాలి? ఏ భావానికి ఏనటన చూపాలి? సహనటుల నటనకు తనప్రతినటన ఎలా చెయ్యాలి? నాటకం యొక్క ఆత్మ ఏమిటి? దాన్నెలా ఆవిష్కరించాలి? దాన్ని ఎన్ని అంతరాల్లో పతాకస్థాయికి తీసుకువెళ్ళాలి? ఏ మాటమీద ఊనిక నివ్వాలి?

ఏవిధంగా ప్రేక్షకునికి అందుతుంది? రంగం మీది ఏయే వస్తువులు అవసరం అవుతాయి? నటనకు అనుకూలంగావాటిని రంగస్థలం మీద ఏయేస్థానాల్లో ఉంచాలి? ఆఖరికి కర్టెన్ ఎప్పుడువెయ్యాలి? ఎప్పుడు తియ్యాలి? ఈ రకమైన లక్షాతొంభై సమస్యల్ని సరిచూసి క్రమశిక్షణలో ముందుగా శిక్షణ పొందితేనే గానీ ప్రదర్శనను సమర్థవంతంగా అందించటం కష్టం. తెరవెనుక జరిగే ఈ శిక్షణే రిహార్సల్స్ ఇదినాటకానికి చాలా అవసరం. ఇంకాకూడా రిహార్సల్స్ అనేవి. లోపాల్ని సరిదిద్ది లోకువ కాకుండా కాపాడుతాయి. నలుగురిలోనూ నగుబాటుకాకుండా ఉంటే ఒద్దికలు దిద్దుకున్నట్టే''.[4]

నాటకరంగ చరిత్రలో ఇంత ప్రాధాన్యతను సంతరించు కున్న అంశాన్నే హాస్యనాటకరచనకు ఎన్నుకోవటం రచయిత వాస్తవిక దృష్టికి ప్రతిబింబం. ఈ ప్రక్రియ ఆయనకు స్వానుభవమే గనక ఆ విషయం ఈ నాటికలో కళ్ళకు కట్టినట్టుగా సాక్షాత్కరింప చేశారు. రేపటికి వాయిదా నాటికలో రామనాథం నిర్మాత. నిత్యజీవితంలో ఎన్నోసమస్యలతోనూ, బాధలతోనూ, విసిగిపోతున్న చిరుద్యోగులతో నాటకం వేయించాలనుకుంటాడు. మొదట అందరూ సంబరపడ్డా, తీరా రోజూరిహార్సల్‌కి రావాలన్నా నాటకం పోర్షన్లు చదవాలన్నా ఎంతో బద్ధకిస్తుంటారు. దినవారి తమపనులన్నీ అయ్యాక రిహార్సల్ చెయ్యాలంటే అందరికీ బాధే.

ఈ నాటకంలో పాత్రధారులైన గౌరీపతి, స్వామి, పేరయ్య, కాశయ్య, రాణి, డైరెక్టరు మొదలైన వారితో హాస్యస్ఫోరకమైన సంభాషణలు చేయిస్తారు నాటకరచయిత. నిర్మాత రామనాథం సమన్వయ కర్తగా కూడా తనపాత్రపరిధి పెంచుకుని పోషిస్తాడు. పాత్ర ధారి గౌరీపతికి ఎవరితోనూ సరిపడదు. డైరెక్టరుతో అసలేపడదు. ఇతను ఎవరితోనూ పోట్లాడకుండా నాటకమంతా రామనాథం విశ్వ ప్రయత్నం చేస్తుంటాడు. ఇకపాత్రధారులంతా తలోకరకంగా వ్యవహరించి ఇక నాటకంలో లేకపోయినా పద్యాలు పెట్టాలంటాడు స్వామి. సందర్భం లేక పోయినా తనదిహాస్యపాత్రగాబట్టి పద్యాలుచదివి ప్రేక్షకులను అలరిస్తానంటాడు. పేరయ్యగారి సంభాషణే హాస్యస్ఫోరకంగా, యాసగా ఉంటుంది. ఏ చిన్నవిషయానికైనా అమాంతం వాళ్ళావిడ ఫ్లాష్‌బాక్‌లోకి వెళ్ళిపోతుంటాడు. వీళ్ళందరి ప్రతిసంభాషణకూ గౌరీపతి అడ్డుచెప్తుంటే, రామనాథం సర్దిచెప్తుంటాడు. కాశయ్యగారు చదువురాని వారైనా బహు నాటకానుభవంవల్ల వారూనాటకంలో ఓపాత్రను వేస్తుంటారు. ఈ పాత్రకు రచయిత తెలంగాణా యాసనుంచారు. ఇక వీరిమాటలన్నీ నవ్వులమూటలే.

వీరి ఒక్కొక్క సంభాషణకూ పాత్రధారులంతా నవ్వుతుంటారు. గౌలిపతి మామూలుగానే విసుక్కుంటాడు. రామనాథం సర్దిచెప్తుంటాడు. ఇంతలో హీరోయిన్ రాణి, పరమేశం వస్తారు. హీరోయిన్ సగం హిందీ, సగం తెలుగుకలిసిన భాషలో చేసే సంభాషణకు పాత్రధారులందరికీ నవ్వుపుట్టిస్తుంది.

పరమేశం హీరోవేషం వేస్తేనే తానుహీరోయిన్‌గా ఉంటాననీ, తన ఆర్కెస్ట్రా గ్రూప్ తను ఏనాటకం వేసినా తప్పకుండా ఉండాలనీ వారికి విడిగా డబ్బివ్వాలనీ మొదలైన తన షరతులన్నీ ఒప్పకుంటేనే తానునటిస్తాననీ రాణి బెదిరిస్తుంటుంది. తాను హారోయిన్ తల్లితో పర్మిషన్ తెచ్చుకుంటాడు గనకు హీరోవేషం ఇవ్వాలనీ పరమేశం పట్టుబడతాడు. ఇలా ఉన్నకాస్తంత సేపూ నాటకరిహార్సల్స్‌గాక, పోట్లాట రిహార్సల్స్ వేసుకుంటుంటే అంతా తావన్నదే నిజమని వాదిస్తుంటే రామనాథంగారు రిహార్సల్స్‌ని రేపటికి వాయిదా వేస్తారు. వాయిదాల గురించి ఆలోచిస్తే ఎంతోనవ్వు పుట్టించే సంఘటనలు కళ్ళముందుంటాయి. సహజంగా కొన్నిదేశాలవారికి కొన్నిస్వభావసిద్ధమైన అలవాట్లుంటాయి. జపాన్ వారెప్పడూ క్షణంతీరిక లేకుండా కొత్తకొత్త వస్తువులు కనుక్కుంటారు. పాకిస్థానీయులు ఎప్పడు భారతదేశాన్ని స్వాధీన పర్చుకుందామా అని ఆలోచిస్తుంటారు. చైనావారికి కాలాన్ని వృధాచేయకుండా కష్టించిపని చేయటమంటే ఇష్టం. ఇరాన్, ఇరాక్ మళ్ళీ యుద్ధం ఎప్పడు వస్తుందా అని ఎదురు చూస్తుంటాయి. ఇహ భారతదేశం విషయానికి వస్తే, భారతీయులకు చేసేపనిని వాయిదాల పద్ధతిలో చేస్తే ఉన్నంత ఆనందం మరెందులోనూ ఉండదు. మనం వాయిదాలకు ఎంతలవాటు పడ్డామో పరిశీలిస్తే ఆశ్చర్యపోతాం. జాతి ఈ జాడ్యాః మహాత్మాగాంధీ రేపుచేసేపని ఈ రోజు చెయ్యి, ఈ రోజు చేసేపని ఇప్పడు చెయ్యి. అని సందేశపు చురక అంటించి, భారతజాతిని జాగృతం చేసారు.


1. మొక్కపాటి నరసింహారావు కృతులు-సమీక్ష. పే. ౨౬౦.ఎన్. రాంబాబు

2. ఉంగరాలవేళ్ళు. కె.యల్.నరసింహారావు. పే. ౨

3. కదంబం. నార్ల వెంకటేశ్వరరావు. పే. ౩౦.

4. వ్యాసతోరణం. పోలాప్రగడ సత్యనారాయణమూర్తి. పే. ౨౦౧

# చారిత్రక నాటకం

చారిత్రకం అంటే గతంలో జరిగిన సంఘటనలను, వ్యక్తుల విషయాలను మొదలైన వాటిని వివరించేది. మనిషి గతాన్ని తెలుసుకోవటానికి గల కారణాల్ని పరిశీలిస్తే, "[1] మనిషి కీ జంతువుకూ భేదం ఉంది. జంతువు స్మృతులు చాలా పరిమితం. ఆ స్మృతుల ప్రయోజనమూ పరిమితమే. మనిషికి కొన్ని యుగాల స్మృతి ఉంది. వర్తమానం కంటే ఎక్కువగా మనిషి భూతభవిష్యత్కాలాలలో నివసిస్తుంటాడు. గతమంతా తప్పు అన్నాడు మార్క్స్ నేటి విప్లవ రచయితలూ అదే అంటారు. కానీ మనిషి గతాన్ని మరువలేడు. గతంలేని మనిషిలో ఎబరేషన్ (విపరీత మానసిక స్థితి) ఏర్పడుతుంది. ఈ విషయం ౧౯౨౦ ప్రాంతంలో స్వీడన్‌లోని సాంఘిక పరిణామాలు తెలిపాయి. గతం తలచుకోవడంతో మన మనసుకొక బాలెన్స్ వస్తుంది. పదిమందిలో బ్రతకగల సత్తా వస్తుంది."[1] కాబట్టి గతాన్ని తెలిపే చారిత్రకతను తెలుసుకోవటం మనవిధి. తెలుగు నాటక సాహిత్యంలో [2] ౧౮౯౭ వ సం..లో రెండుఉత్తమ స్వతంత్రచారిత్రకరూపకాలు వెలువడ్డాయి. ఒకటి వేదము వారి 'ప్రతాపరుద్రీయము,' రెండు పనప్పాకం శ్రీనివాసాచార్యులు గారి 'శివాజి' మొదటిది తెలుగుదేశమునకు సంబంధించినది. రచన సంప్రదాయబద్ధమైనది. రెండవది మహారాష్ట్ర చరిత్రకు సంబంధించినది ఆవేశప్రధానమై ప్రాచీన రూపకరచనా సంప్రదాయములకు కట్టుబడనిది ఐననూ కొంచెమించుమించుగా మొదటిదానితో ధీటుకాగల రచన ఇది. ఈనాటిదే హెచ్. కృష్ణమూర్తి గారి 'పెనుగొండ దుర్గము' పిమ్మటపేర్కొన దగినది ౧౮౯౯లో వెలువడిన కాళ్లకూరి వారి 'రంగనాయక కదన సమవాకారం' ఇది ప్రాబంధిక శైలిలో రచింబడినది.

ఇంకా ౧౯౦౬-౧౯౨౫ మధ్య కాలములో సుప్రసిద్ధ కవులు పలువురు చారిత్రక నాటకములను వ్రాసిరి. ఇట్టివారిలో మొదటపేర్కొనదగినది-

కోలాచలము శ్రీనివాసరావుగారి 'రామరాజు చరిత్రము' (౧౯౦౭)

శ్రీపాద వారి 'బొబ్బిలి యుద్ధనాటకము' (౧౯౧౦),

పానుగంటి వారి 'ప్రచండ చాణక్యము' (౧౯౦౯),

ఇచ్ఛాపురపు వారి 'రసపుత్ర విజయము' (౧౯౧౦),

ఉమ్రాలీషా గారి 'చంద్రగుప్త' (౧౯౧౦)

బాలాంత్రపు వారి 'యాచశూరేంద్ర విజయము'

ధర్మవరం గోపాలాచార్యులు గారి 'రామదాసు' (1920) మొదలైనవి. తెలుగులోని చారిత్రకరూపకము లందలి ఇతివృత్తములలో ఇంచుమించుగా సగపాలు ఆంధ్ర దేశమునకు సంబంధించినవి. తక్కిన సగపాలును మహా రాష్ట్ర, వంగదేశ, రాజపుత్ర స్థానములకు, మహమ్మదీయ చరిత్రలకు సంబంధించినవి.''[2]

**అక్బర్ :**

ఈ చారిత్రక నాటకాల్లో కొన్ని వ్యక్తి ప్రధానములైనవి. కొన్ని కథా ప్రధానాలైనవి. వ్యక్తి ప్రధానమైన చారిత్రక నాటకవిభాగములోనికి కె యల్.నరసింహారావుగారు రచించిన అక్బర్ నాటకంచేరుతుంది. ఈ నాటకాన్ని 1973వ సం.లో ఆకాశవాణి కార్యక్రమంలో ప్రసారం చేయుటంకోసం రచించారు. వీరి ఏకైక చారిత్రక నాటకం ఈ అక్బర్.

పరమతసహనానికీ, ఐకమత్యసాధనకూ అక్బర్ జీవితం ప్రతీక. తన జీవితమంతా మతసామరస్యం కోసం వినియోగించిన చారిత్రకపురుషుడు అక్బర్ క్రీ.శ.1542వ సం..లో హుమాయూన్, చాంద్‌బీబీ దంపతులకు జన్మించాడు. పధ్నాలుగు సంవత్సరాల అతిచిన్న వయస్సులో సింహాసనాన్ని అధిష్ఠించిన మొఘల్‌వీరుడితడు. చక్రవర్తిగా అక్బర్ చిరస్మరణీయుడు. ఉదారమైన, విలక్షణమైన మత విధానంతో తన సువిశాల సామ్రాజ్యంలో ప్రజలందరూ మత విభేదాలు మరచి ఒకేజాతిగా మనుగడ సాగించాలని అక్బర్ ఆశించేవాడు. తదనుగుణంగానే తన మతవిధానాన్ని రూపుదిద్దుకుంటూ వచ్చాడు. అన్ని మతాలసారాన్ని సేకరించి, ఒక కొత్త మతాన్ని స్థాపించాడు. అదే దీన్.ఇ-ఇలాహీ- యుద్ధంలో పట్టుబడ్డవారిని బలవంతంగా ఇస్లాంమతంలోకి చేర్చే పద్ధతికి అతను క్రీ.శ 1562లో స్వస్తి చెప్పాడు. 1563లో యాత్రికుల పన్నును, క్రీ.శ.1564లో జిజియా పన్నును రద్దుచేశాడు. ఈ పన్నులు రద్దుకావటం వల్ల రాజ్యానికి ఆదాయం తగ్గినా, దూరదృష్టీ, మేధాశక్తీ కనబరచి అక్బర్ వాటిని రద్దు పరచాడు.

క్రీ.శ 1575లో అక్బర్‌కు ముబారక్, అతని కుమారుడైన ఫైజీ, మరియు అబుల్‌ఫజల్‌లతో స్నేహం ఏర్పడింది. ఈ ముగ్గురుమార్మికుల పరిచయం వలన సత్యాన్వేషణలో అక్బర్ ఆసక్తి మరీ ఎక్కువైంది. అబుల్ ఫజల్ సలహా మేరకు క్రీ.శ. 1575లో ఫతేపూర్ సిక్రీలో ఇబాదత్‌ఖానాను ప్రార్థనామందిరంగా నిర్మించాడు. ఇందులో చాలా మతపరమైన చర్చలు జరిగాయి. ఈ చర్చలన్నీ మొదట ఇస్లాం

# చారిత్రకనాటకం

చారిత్రకం అంటే గతంలో జరిగిన సంఘటనలను, వ్యక్తుల విషయాలను మొదలైన వాటిని వివరించేది. మనిషి గతాన్ని తెలుసుకోవటానికి గల కారణాల్ని పరిశీలిస్తే, "[1]మనిషి కీ జంతువుకూ భేదం ఉంది. జంతువు స్మృతులు చాలా పరిమితం. ఆ స్మృతుల ప్రయోజనమూ పరిమితమే. మనిషికి కొన్ని యుగాల స్మృతి ఉంది. వర్తమానం కంటే ఎక్కువగా మనిషి భూతభవిష్యత్కాలాలలో నివసిస్తుంటాడు గతమంతా తప్పు అన్నాడు మార్క్స్ నేటి విప్లవ రచయితలూ అదే అంటారు. కానీ మనిషి గతాన్ని మరువలేడు. గతంలేని మనిషిలో ఎబరేషన్ (విపరీత మానసిక స్థితి) ఏర్పడుతుంది ఈ విషయం 1920 ప్రాంతంలో స్వీడన్‌లోని సాంఘిక పరిణామాలు తెలిపాయి. గతం తలచుకోవడంతో మన మనసుకొక బాలెన్స్ వస్తుంది. పదిమందిలో బ్రతకగల సత్తా వస్తుంది." కాబట్టి గతాన్ని తెలిపే చారిత్రకతను తెలుసుకోవటం మనవిధి. తెలుగు నాటక సాహిత్యంలో [2]1897 వ సం..లో రెండుఉత్తమ స్వతంత్రచారిత్రకరూపకాలు వెలువడ్డాయి. ఒకటి వేదము వారి 'ప్రతాపరుద్రీయము,' రెండు పనప్పాకం శ్రీనివాసాచార్యులు గారి 'శివాజి' మొదటిది తెలుగుదేశమునకు సంబంధించినది. రచన సంప్రదాయబద్ధమైనది. రెండవది మహారాష్ట్ర చరిత్రకు సంబంధించినది. ఆవేశప్రధానమై ప్రాచీన రూపకరచనా సంప్రదాయములకు కట్టుబడనిది. ఐననూ కొంచెమించుమించుగా మొదటిదానితో ధీటుకాగల రచన ఇది. ఈనాటిదే హెచ్. కృష్ణమూర్తి గారి 'పెనుగొండ దుర్గము' పిమ్మటపేర్కొన దగినది 1899 లో వెలువడిన కాళ్లకూరి వారి 'రంగనాయక కదన సమవాకారం' ఇది ప్రాబంధిక శైలిలో రచింబడినది.

ఇంకా 1906-1925 మధ్య కాలములో సుప్రసిద్ధ కవులు పలువురు చారిత్రక నాటకములను వ్రాసిరి. ఇట్టివారిలో మొదటపేర్కొనదగినది-

కోలాచలము శ్రీనివాసరావుగారి 'రామరాజు చరిత్రము' (1907)

శ్రీపాద వారి 'బొబ్బిలి యుద్ధనాటకము' (1910),

పానుగంటి వారి 'ప్రచండ చాణక్యము' (1909),

ఇచ్ఛాపురపు వారి 'రసపుత్ర విజయము' (1910),

ఉమ్రాలీషా గారి 'చంద్రగుప్త' (1910)

బాలాంత్రపు వారి 'యాచశూరేంద్ర విజయము''

ధర్మవరం గోపాలాచార్యులు గారి 'రామదాసు' (1920) మొదలైనవి. తెలుగులోని చారిత్రకరూపకము లందలి ఇతివృత్తములలో ఇంచుమించుగా సగపాలు ఆంధ్ర దేశమునకు సంబంధించినవి. తక్కిన సగపాలును మహారాష్ట్ర, వంగదేశ, రాజపుత్ర స్థానములకు, మహమ్మదీయ చరిత్రలకు సంబంధించినవి.''[2]

**అక్బర్ :**

ఈ చారిత్రక నాటకాల్లో కొన్ని వ్యక్తి ప్రధానములైనవి. కొన్ని కథా ప్రధానాలైనవి. వ్యక్తి ప్రధానమైన చారిత్రక నాటకవిభాగములోనికి కె.యల్. నరసింహారావుగారు రచించిన అక్బర్ నాటకంచేరుతుంది. ఈ నాటకాన్ని 1973వ సం..లో ఆకాశవాణి కార్యక్రమంలో ప్రసారం చేయుటంకోసం రచించారు. వీరి ఏకైక చారిత్రక నాటకం ఈ అక్బర్.

పరమతసహనానికీ, ఐకమత్యసాధనకూ అక్బర్ జీవితం ప్రతీక. తన జీవితమంతా మతసామరస్యం కోసం వినియోగించిన చారిత్రకపురుషుడు అక్బర్ క్రీ.శ. 1542వ సం..లో హుమాయూన్, చాంద్‌బీబీ దంపతులకు జన్మించాడు. పధ్నాలుగు సంవత్సరాల అతిచిన్న వయస్సులో సింహాసనాన్ని అధిష్ఠించిన మొఘల్‌వీరుడితడు. చక్రవర్తిగా అక్బర్ చిరస్మరణీయుడు. ఉదారమైన, విలక్షణమైన మత విధానంతో తన సువిశాల సామ్రాజ్యంలో ప్రజలందరూ మత విభేదాలు మరచి ఒకేజాతిగా మనుగడ సాగించాలని అక్బర్ ఆశించేవాడు. తదనుగుణంగానే తన మతవిధానాన్ని రూపుదిద్దుకుంటూ వచ్చాడు. అన్ని మతాలసారాన్ని సేకరించి, ఒక కొత్త మతాన్ని స్థాపించాడు. అదే దీన్. ఇ-ఇలాహీ-యుద్ధంలో పట్టుబడ్డవారిని బలవంతంగా ఇస్లాంమతంలోకి చేర్చే పద్ధతికి అతను క్రీ.శ. 1562లో స్వస్తి చెప్పాడు. 1563లో యాత్రికుల పన్నును, క్రీ.శ. 1564లో జిజియా పన్నును రద్దుచేశాడు. ఈ పన్నులు రద్దుకావటం వల్ల రాజ్యానికి ఆదాయం తగ్గినా, దూరదృష్టీ, మేధాశక్తీ కనబరచి అక్బర్ వాటిని రద్దు పరచాడు.

క్రీ.శ. 1575లో అక్బర్‌కు ముబారక్, అతని కుమారుడైన ఫైజీ, మరియు అబుల్‌ఫజల్‌లతో స్నేహం ఏర్పడింది. ఈ ముగ్గురుమార్మికుల పరిచయం వలన సత్యాన్వేషణలో అక్బర్ ఆసక్తి మరీ ఎక్కువైంది. అబుల్ ఫజల్ సలహా మేరకు క్రీ.శ. 1575లో ఫతేపూర్ సిక్రీలో ఇబాదత్‌ఖానాను ప్రార్థనామందిరంగా నిర్మించాడు. ఇందులో చాలా మతపరమైన చర్చలు జరిగాయి. ఈ చర్చలన్నీ మొదట ఇస్లాం

మతానికే పరిమితమైనాయి. ఎంతోగొప్ప పేరుప్రతిష్ఠలుగల సనాతనులు, మత ప్రవర్తకులు ఒకరినిఒకరు దూషించుకోవటం అక్బర్‌ను ఆశ్చర్యపరచింది. ఆయన సూటిగా వేసిన కొన్ని ప్రశ్నలకు ఇస్లాంమత గురువులు సమాధానం చెప్పలేకపోయారు. అందుకే హిందూ, జైన, బౌద్ధ, పారసీక, మతాధికారులనుకూడా అక్బర్ ఇబాదత్‌ఖానాకు ఆహ్వానించాడు. వివిధమతాచార్యుల వారి వాదోపవాదాలు విన్న తరువాత సత్యమనేది కేవలం ఇస్లాం మతం సొత్తుకాదనీ, ఇతరమతాలలోకూడా సత్యముందనీ ఉలేమాలు, మౌల్వీలు తరతరాలుగా అనుభవిస్తున్న ప్రత్యేకాధికారాలను అక్బర్ రద్దుచేశాడు.

ఇస్లాంరాజ్యాలలో మధ్య యుగాలలోని 'పోప్'లవలె ఉలేమాలు . తవిషయాలలోనేగాక రాజకీయాలలో సైతం జోక్యం చేసుకోవటమూ, ంకుశంగా ప్రవర్తించటమూ మానవతామూర్తి అక్బర్‌ను కలచివేసింది. క్రీ.శ. 575వ సం..లో రాజకీయ విషయాలలోనే గాక, మతవిషయాల్లోనూ తానే ర్వాధికారినని ప్రకటిస్తూ అక్బర్ ఒక శాసనం అమలు పరచాడు. ంతసహనంలో ప్రత్యేకాంశంగా అక్బర్ హిందూ ఆచారవ్యవహారాలను ంటినో అమలుపరచటం మొదలుపెట్టాడు. పునర్జన్మ మీద అక్బర్‌కు నమ్మకం ిగింది. అతను కర్మసిద్ధాంతాన్ని కూడా నమ్మేవాడు. 'హరవిజయ' అనే జైనుని ధ విని మాంసభక్షణ మానివేశాడు. జొరాష్ట్రియన్‌ల సిద్ధాంతం ప్రకారం ూర్యునికి, వెలుతురుకు, అగ్నికీ అక్బర్ అంజలి ఘటించేవాడు. క్రైస్తవమతం ూడా అతన్ని బాగా ఆకట్టుకంది. అక్బర్ ప్రోత్సాహం మీదనే 'ఆగ్రా' లాహోర్‌లలో ర్చీలు వెలిశాయి.

క్రీ.శ. 1582వ సం..లో మానవులమధ్య చెలరేగుతున్న హేతురహిత ివాదాలను తొలగించి, ప్రజలను అందరినీ ఏకంచేసే ఒకవినూత్న సిద్ధాంతానికి రూపకల్పన చేయాలని అక్బర్ సంకల్పించాడు. వివిధ మతాధికారులను సమావేశపరచి 'దీన్-ఇ-ఇలాహీ'ని ప్రతిపాదించాడు. అయినా విశ్వసహనాన్ని పూర్తిగానమ్మే అక్బర్‌తననూతన మతప్రచారానికి పూనుకుంటే అది రాజ్యమత మవుతుందని గ్రహించి, మతానికీ రాజకీయానికీ ముడిపెట్టని లౌకికుడు అక్బర్ చక్రవర్తి.

అక్బర్ ఉన్నతవిద్యలనభ్యసించక పోయినా, లలితకళలను పోషించాడు. పారసీక, హిందీకవులకు అతని ఆస్థానంలో మంచి ఆదరణ లభించింది. హిందీభాషకు అక్బర్‌కాలంతో స్వర్ణయుగం ప్రారంభమైందని అబుల్ ఫజల్ తన

'ఐనీ అక్బరీ' లో రచించాడు. హిందీ మహాకవులు 'సూరదాసు', 'తులసీదాస్', అక్బర్‌నాటివారే. భక్తకవి తులసీదాసు రచించిన 'రామచరితమానస్' ఎం ప్రసిద్ధిపొంది, నేటికీ పారాయణం చేయబడుతున్న మహాగ్రంథం. సేనాపతిగా విశ్వవిజేతగా, పరిపాలనాదక్షునిగా, వివిధమతాల సమన్వయకర్తగ సాహిత్యపోషకునిగా భారతదేశ చరిత్రలో అక్బర్ చిరస్మరణీయుడు.

ఎంతో చారిత్రక విశిష్టత గలిగిన అక్బర్ జీవితంలోని కొన్ని సంఘటనల ఆధారంగా వ్యక్తిప్రధానమైన 'అక్బర్' నాటకంగా మలచారు కె.యల్.నరసింహారావుగారు. దీన్ని జాతీయసమైక్యతను బోధించే నాటకంగా రేడియోకోసమే రచించినా, ఎంతో చారిత్రకప్రాధాన్యతను సంతరించుకున్న ఈ నాటకం పటిష్టమైన నిర్మాణంచేతా, పలుసార్లు ప్రదర్శనలు పొంది విజయవంతమవటం వలన కూడా ఎంతో ప్రసిద్ధిపొందింది.

చక్రవర్తి అయిన అక్బర్ రసపుత్ర వీరులను ఎదిరించినా వారి ఆడబడుచు 'జోధ్‌బాయి' నే వివాహమాడుతాడు. మతాతీతమయిన వీరి దాంపత్యందేశానికే ఆదర్శప్రాయమవుతుంది. తన సామ్రాజ్యాన్ని సకలైశ్వర్యాలతో సురక్షించిన చక్రవర్తి లలితకళలను ప్రోత్సహించి వాటిలో ఆనందాన్ని అనుభవిస్తాడు. కానీ అతని మతగురువులకు ఆ విషయం నచ్చదు. ప్రపంచంలోని మతాలన్నీ ఒకేపువ్వులోని రేకులవంటివన్న అక్బర్ అభిప్రాయాన్ని ఇస్లాంమత ప్రవక్తలు ఎంతమాత్రం సహించలేక చక్రవర్తిని తమ మతానుశీలకుడిని చేయటానికి రాజగురువు 'మౌల్వీ' ని పిలిపిస్తారు. అతని సంభాషణల వల్ల అతనిలో మతపిచ్చిని గుర్తించిన అక్బర్ మౌల్వీని సకలమర్యాదలతోనూ కారాగారంలో ఉంచుతాడు. అక్బర్ చక్రవర్తి ప్రథమ సంతానానికి నామకరణం ఇస్లాం మతాచారప్రకారం చేయాలన్న మౌల్వీ మాటను కాదని ఎదురాడినందుకు ఆ పసికూననే బలితీసుకుంటాడు.

ఇంకా కసి తీరని మౌల్వీ అక్బర్ రెండవ సంతానమైన సలీంకు మతబోధనలన్నీ నూరిపోస్తుంటాడు. అలా మధువుకు అలవాటు పడ్డ సలీం మత బోధనలపట్ల విపరీతంగా ఆకర్షితుడవుతాడు. తత్ఫలితంగా తండ్రికి తెలియకుండానే మౌల్వీని కారాగారం నుండి తప్పించి, అక్బర్‌పైనే తిరుగుబాటు చేస్తాడు. చేసిన అపరాధానికి న్యాయస్థానానికి లొంగిపొమ్మని రాయబారులుగా తండ్రి పంపిన ఆప్తులందరనీ వధిస్తాడు.

చివరకు మహారాణి వెళ్ళి కుమారుణ్ణి తీసుకువస్తుంది. చక్రవర్తి ఐన అక్బ మతసామరస్యం, సర్వమతసహనం రాజుకు ఎంత అత్యవసరమైన రక్షణకవచమ

సలీంరాకుమారునికి వివరించి, సలీమును మొఘల్ సింహాసనాధీశుడిగా పట్టాభిషేకం చేయటంతో నాటకం సమాప్తమవుతుంది. మూడు రంగాల్లోసాగే ఈ నాటకం అద్భుత, కరుణరసాల సమ్మిశ్రితం. ఈ నాటకంలో రచయిత ఇతరనాటకాల్లాగా ఈ నాటకంలో అంతర్లీనమైన హాస్యంలేదు. పాత్రల స్వభావానికి అతికేట్టుగా పటిష్ఠమైన గాంభీర్యం, సంభాషణాంతర్లీనమైన ఆర్ద్రత ప్రవహించాయి. పేరెన్నికగల చారిత్రకపాత్రలకు సరిదీటుగా సంభాషణలు వ్రాసి పాత్రల ఔన్నత్యాన్ని మరింతగా పెంచారు రచయిత. ధీరోదాత్తనాయకుడైన అక్బర్ పాత్రకు గంభీరమైన సంభాషణలు మరింతవన్నె తెచ్చాయి. దేశంలోని ప్రజలందరికీ తగిన మోతాదులోనే మధువును అందచేయాలన్న చక్రవర్తి శాసనం యువరాజుకు కంటగింపవుతుంది. తనకు మధువు అధికంగా కావాలని తల్లితోనే అక్బర్‌కు రాయబారం పంపుతాడు.

ప్రజలందరిలాగానే రాకుమారునికీ నిషేధం విధించవద్దనీ, శాసనాన్ని అతనికి సడలించమనీ మహారాణి అక్బర్‌ను కోరుతుంది. ఆ సందర్భంలో ఈ సంభాషణ-

''అక్బర్:- ఏమయినా, మనవాడి విలాసాల కోసమని దేశమంతటికీ అవసరమైన మా శాసనాన్ని పాలించలేదనే అపఖ్యాతి మాకూరానీయకు దేవీ, ఈ విషయంలో నన్ను ఎంతమాత్రం మొహమాట పెట్టవద్దు.''[14] అని ఖచ్చితంగా తన అభిప్రాయాన్ని వివరిస్తాడు. సలీంను క్రమశిక్షణతో ఉండాలని శాసిస్తాడు. చక్రవర్తి మనసునెరిగిన ఆస్థానకవి అబుల్‌ఫజల్ సర్వమతసహనాన్నీ అక్బర్‌కు నివేదించటమేగాక, అన్ని భాషలలోని మూలమతగ్రంథాలన్నింటినీ హిందీలోకి అనువదించాలనే చక్రవర్తికోరికను నెరవేర్చే ప్రయత్నంలోనే సంస్కృతంలోని రామాయణ, మహాభారతాలను అక్బర్ కాలంలోనే తన భాషలోకి అనువదింప చేస్తాడు.

చారిత్రకనాటకానికి ఉండవలసిన ముఖ్య లక్షణం చారిత్రకత. సాంఘిక నాటకం సమకాలీనసమాజాన్ని వాస్తవికంగా చిత్రిస్తుంది. కానీ సామాజిక పరిస్థితులు ఎంత వాస్తవికంగా, ఎంతవిపులంగా, ఎంతకళాత్మకంగా చిత్రించినా ఆ దేశకాలపరిస్థితులు అలా ఎందుకున్నాయనే సందేహం రాదు. యథార్థ జీవితంలోని దేశకాల పరిస్థితులను ఎలా ఉన్నవాటినలా చిత్రించటమే సాంఘికనాటకం యొక్క కర్తవ్యం. ఆయా పరిస్థితుల పూర్వాపరాల పరిశీలన దానికి అనవసరం. కానీ చారిత్రకనాటకంలో దేశకాల పరిస్థితులకు చారిత్రకత

ఉంటుంది. దేశచారిత్రక పరిణామంలో అదిఒక దశావిశేషమనీ, పాఠకునికి లేదా ప్రేక్షకునికి తప్పక స్పృహఉండి తీరుతుంది. చారిత్రక నాటకంలో మరో ముఖ్యలక్షణం పాత్రలనుఆనాటి చారిత్రకశక్తులకూ, సామాజికధర్మాలకూ ప్రతినిధులుగా చిత్రించి వాటిమధ్య జరిగే ఘర్షణను పాత్రలమధ్య జరిగే ఘర్షణగా చిత్రించగలగటం. విశిష్టపాత్రలమధ్య జరిగే ఘర్షణ కేవలం వైయక్తిక స్వార్థాలవల్లనో, వైయక్తికకారణాల వల్లనో జరగిందనీ, ఆ పాత్రలు భిన్నచారిత్రక శక్తులకు ప్రతినిధులనీ, సమాజంలో నిత్యం ఘర్షణపడే ధర్మాలకూ, చారిత్రకశక్తులకూ, జీవిత విధానాలకూ పాత్రలు ప్రాతినిధ్యం వహించటమంటే ఆ పాత్రలుయోచించీ, చర్చించీ, లాభనష్టాలు బేరీజువేసుకుని ఒకపక్షం వహించటం కాదు. ఆ పాత్రల జీవితపద్ధతులు, మనోధర్మాలూ కలసి ఆయా పాత్రలను అలా నడిపిస్తాయనే చారిత్రక సత్యాన్ని అక్బర్ నాటకంద్వారా నరసింహారావుగారు ప్రేక్షక లోకానికి నిరూపించారు.

1. చేత పెన్నుముద్ద. పే. 123, ర. వాకాటి పాండురంగారావు

2. తెలుగు నాటక వికాసము. పే. 479. ర. పి.యస్సార్. అప్పారావు.

3. అక్బర్. పే. 28. ర. కె.యల్. నరసింహారావు.

# మనస్తత్వనిరూపక నాటకాలు

ప్రతిజీవికి ఉండే అంతర్వాణి మనసు. భౌతిక శరీరానికి సంబంధించేదికాక, ఆశరీరంలోని ఆత్మ ధరించిన అనేకానేకజన్మల వాసనానిలయమే మనసు. దానిభాష మౌనమే అయినప్పటికీ ఏ శబ్దకారుడూ చేయలేనన్ని విచిత్రాలను తన శరీరంద్వారా సాధిస్తుంది. ఏజీవి శరీరంమీదైనా సరే మానసిక ఆధిపత్యం చెప్పనలవిగానిది. మానసిక శక్తితో మాటకూడారాని పసిపాప తన బోసి నవ్వులతో భాషకందని ఎన్నోభావాలను స్ఫురింపచేస్తుంది. మాటలు నేర్చిన మనిషిని మూగవానిగానూ చేస్తుంది. మనిషిని జంతువునుండి వేరుచేసి పాంచభౌతికమైన శరీరాన్ని సరైనదారిలో నడిపించటానికి మహిమాన్వితమైన సాధనం మనస్సు

మనసు యొక్క ధర్మాలను, లక్షణాలను, పరిణామదశలనూ వివరించేది మనోవిజ్ఞానశాస్త్రం. ఇందులో ఒక విభాగం మనోవిశ్లేషణ. (Psycho anlysis) "1912 వ సంవత్సర ప్రాంతంలో మనోవిజ్ఞానశాస్త్రం నుండి విముక్తమై స్వతంత్రశాస్త్రంగా ప్రత్యేకతను, సంతరించుకుంది. అంతకుముందే 1879లో మనస్తత్వ ప్రయోగశాలను ' ఉండ్ట్ లైప్‌సిగ్‌లో ఏర్పాటుచేసిన అంతర్వీక్షణంద్వారా మనసులోని విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నించాడు. అయితే ఫ్రాయిడ్ దీనితో ఏమాత్రంసంబంధంలేని ఒక విధానాన్ని ఏకకేల కీలించాడు. అందరూ చేతనానికి మనోజీవితం నడిబొడ్డన పీటవేస్తే, ఫ్రాయిడ్ ఆపీటను లాగివేసి మనస్సును నీటితో తేలే మంచుగడ్డతో పోల్చి, నీటిఉపరితలంపై కనిపించేది మంచుగడ్డతో 1/4వ వంతు మాత్రమే ననీ, ఇదిమన చేతనకు సమానమని, అలాగే ఉపరితలం క్రింద మునిగిన్న మంచుగడ్డభాగం 3/4వంతు అనీ, ఇదిమన అచేతనకు సమానమనీ, మంచుగడ్డలో మునిగిన భాగం మనకెలా కన్పించదో అచేతనం కూడా మన ఎరుకలోకి కొన్ని ప్రత్యేకసాంకేతికపద్ధతులు ద్వారా తప్పరాదని చెప్పాడు. ఎరుకకురానిభాగాన్ని ఎరుక తెచ్చాడు. మనకెప్పడూ కన్పించని చంద్రుని ఆవలివైపుకు దర్శింపచేసాడు."[1]

"ఫ్రాయిడ్‌తో ప్రారంభమైన మనస్తత్వ పరిశీలనం ప్రపంచసాహిత్యానికి కొత్తగాదు. అయిననూ ఆంధ్రసాహిత్యమున ఆ సిద్ధాంతమును పరిశీలించి అనుసరించినట్లు విస్పషటముగా గోచరించుట చలంగారితోనే ఆరంభమైందని చెప్పవచ్చును. ఇట్టి సిద్ధాంత ప్రభావమునకు లోబడిరచన సాగించిన వారు. బుచి బాబుగారు. మనసత్వ పరిశీలనవముతో వ్రాయబడిన రచన

వ్యక్తినిష్ఠమగుటచే ఈ రకం నాటకములను 'వ్యక్త్యాత్మక రూపకము' లనుట సమంజసము''.[2]

''నాటకసాహిత్యంలో కేవల మనస్తత్వ నిరూపక రూపకములు తెలుగులో అంతగా కన్పట్టవు. ఆయా కాలములందు అచ్చటచ్చట ఇట్టి ప్రయత్నాలు కన్పట్టగలవు. సంతానభాగ్యమునకు నోచుకొనని ఒక స్త్రీ తనభర్తను ద్వితీయ వివాహము చేసుకొమ్మని వేధించి, స్వయముగా తానే ఆశుభకార్యమును నిర్వహించి. పిమ్మట తనభర్త తనచేతులనుండి జారిపోయోనని కలవరపడి సవతి జీవితమునుదుఃఖభాజనంగావించి చివరకు తమ ముగ్గురి మరణములకు హేతువైన ఒక స్త్రీ మనస్తత్వమును పానుగంటివారు 'సరోజిని' (1930) అనెడి నాటకములో విపులముగా చిత్రించారు. బహుశః తెలుగులోని ప్రథమ మనస్తత్వనిరూపణ రూపకము ఇదియే కావచ్చును. రాజమన్నారు నాటకములలో కూడా ఈ గుణముకొంత కానవచ్చును. కాళ్ళకూరి గోపాలరావు గారి 'వాల్మీకి' (1932) ఈ జాతి నాటకములలోముఖ్యంగా పేర్కొనదగిన రచన. 'మనఃపరిణామ నిరూపమగు అభినవరూపకము'గా ఇది పేర్కొనబడినది. తస్కర నాయకుడు తాపసకవీంద్రుడగుట ఇందు చిత్రితము. నాటికలలో చలంగారి 'భానుమతి' ఉత్తమమైన మనసస్తత్వనిరూపక రచన. నాటకములలో బుచ్చిబాబుగారి 'ఆత్మవంచన' (1951) ఉత్తమ మనస్తత్వ నిరూపక రూపకము. ఇందుకూడా స్త్రీ హృదయమే సహజాలంబనము అనుకొందుము''.[3] కె.యల్. నరసింహారావుగారి 'క్రీనీడలు'. 'ఒకరోజు' నాటకాలు మనస్తత్వ నిరూపణా నాటక విభాగానికి చెందినవి.

**క్రీనీడలు :**

క్రీనీడలు నాటకం 1988 లో నవంబర్ 10న సికింద్రాబాద్ సెంట్రల్రైల్వే ఇన్స్టిట్యూట్ వారు తమ సాంస్కృతిక విభాగాన్ని ప్రారంభిస్తున్న సందర్భంలో మొదటిసారిగా శ్రీ.డి. రాజేశ్వరరావు గారు, మరికొందరు మిత్రులు ఈ నాటకాన్ని ప్రదర్శించారు. స్థూలంగా ఈ నాటకంలోని ఇతివృత్తం 'సరళాదేవి' మానసిక విశ్లేషణ అనవచ్చు. ఈమె విద్యాధికురాలు, డాక్టరుగారి భార్య. సమాజంలో డబ్బుతో హోదాను, భర్తవల్ల పలుకుబడినీ పొందుతూ కూడా విపరీతమానసిక స్థితిని కలిగిఉంటుంది.

ఆమె చిన్ననాటి స్నేహితుడైన 'వాసు' నాటక ప్రదర్శనకోసం ఆ ఊరికి వస్తే , అతని బృందాన్ని తమ ఇంటికి ఆహ్వానించి, ఆతిథ్యమిస్తుంది. కానీ వారిని

కలుసుకోవటానికి, నాటకప్రదర్శన బావుందని ప్రశంసించటానికీ వచ్చే జనాన్ని చూసి, చీదరించు కుంటుంది. 'రాధ' వాసుతోపాటు నాటకప్రదర్శనలో పాల్గొనే స్త్రీ పాత్రధారిణి. వారిద్దరి స్నేహాన్ని వక్రదృష్టితో చూస్తూ, అనుక్షణం రాధను అవమానపరుస్తుంది. రాధతండ్రి సీతాపతితో వాలిద్దరికీ తానూహించిన నీచాతినీచమైన సంబంధాన్ని వివరిస్తుంది. ఆమె దుర్భావాలను భర్త గుర్తించాడని తెలిసినా లక్ష్యపెట్టదు. తను డబ్బుగలదాన్ననే అహంకారంతోనూ, అందగత్తెనన్న అతిశయంతోనూ ప్రతివారినీ చులకున చేసి మాట్లాడటం ఆమెకు అలవాటు. తన అందంతోనూ, నటనానుభవంతోనూ మొదట్లో నాటకాలు వేయాలని ప్రయత్నించినా, ఆ తరువాత ఉన్నతవిద్య నభ్యసించటంతో నాటకరంగాన్ని చిన్నచూపు చూస్తుంది. నాటకాలు వేసేవారంతా నీతిబాహ్యులని పరిగణించి వారిమీద ఏహ్యభావాన్ని పెంచుకుంటుంది.

ఆ ఉద్దేశ్యంతోనే నాటకరంగాన్ని ప్రాణప్రదంగా భావించే చిన్ననాటి స్నేహితుడు 'వాసు'ని తన ఇంటికి పిలిచి తన భోగభాగ్యాలనూ, హోదానూ ప్రదర్శించాలనీ, వాటినిచూపి వాసు ఈర్ష్యపడాలనీ అనుకుంటుంది. కానీ, స్వతహాగా సంస్కారవంతుడైన వాసు ఆమె ఆడంబరాలను గాక, తన చిన్ననాటి స్నేహితురాలిగానే ప్రవర్తిస్తాడు. దాంతో అవమానంగా భావించిన సరళ వారి నాటకం జరగకుండా కావాలని రాధను తన మాటలతోనూ, చేష్టలతోనూ, హింసించి, ఆమె తండ్రితో చీవాట్లు వేయించి, నాటకంలో నటించకుండా చేస్తుంది.

జరుగుతున్న పరిణామాలను చూచాయగా అర్థంచేసుకున్న సరళభర్త ఆమె మనస్తత్వానికి ఎంతో బాధపడినా ఏమీచేయలేక పోతాడు. కానీ జరిగిన పరిణామాలకు అభిమానవంతుడయిన వాసు, సరళను దూషిస్తాడు తప్పుదిద్దుకోమని హెచ్చరిస్తాడు. అప్పుడు సరళ తన మనసులోని బాధనూ, తన ఆశయాలనూ, తీరని తన కోరికలనూ వెల్లడిస్తుంది. అంతావిన్న ఆమెభర్త 'పతి సరళ మనఃప్రవృత్తికి సిగ్గుపడి రాధనూ, వాసునూ క్షమించమని కోరటంతో క్రీనీడలు నాటకం సమాప్తమవుతుంది.

మూడురంగాల్లో సాగే ఈ నాటకం స్వచ్ఛమైన మనసుమీద అసూయా ద్వేషాల క్రీనీడలు పడి ఎలా మలినం చేసాయో వివరిస్తుంది. సరళపాత్ర ఈ నాటకంలో అద్భుతంగా చిత్రించబడింది. ఆమెమనస్సులో విరిసిన భావసుమాలు సరైన సమయంలో సుగంధాలు వెదజల్లవలసింది పోయి, కాలాతీతమై, కుళ్ళి దుర్గంధాన్ని సమాజంపై వెదజల్లుతాయి. తన బాధను ఆ విధంగా తీర్చుకుంటుంది.

ఈ నాటకంలో సరళ తను చదువుకునే రోజుల్లో వాసుతోకలిసి నాటకప్రదర్శనలిస్తుంది. అందమూ నటనాశక్తీగకల ఆమె సహజంగానే ఆ కళలో రాణిస్తుంది. కానీ పై చదువులు చదవటానికి అవకాశంరావటంతో ఉన్నత విద్యాభ్యాసం ముగిస్తుంది. ఆ చదువు ఆమెలో స్థాయీభేదాల్నీ, అహంకారాన్నీ పెంచుతుంది. తనకు కూడా నటించటానికి ఉత్సాహమూ, అర్హతా ఉన్నా కూడా తన కన్నా తక్కువైన వారితోనూ, జీవనోపాధికోసం నాటకాలేసే వారితోనూ నటిస్తే తన హోదాకు, చదువుకు సమాజం విలువివ్వదనీ, తనను నీతిబాహ్యురాలిగా పరిగణిస్తుందనీ, అపోహపడి తానిష్టపడే నాటకరంగానికి దూరమవుతుంది.

తన హోదాకు తగిన డాక్టర్‌ను వివాహమాడి కూడా తెలియని అసంతృప్తితో నిస్సారమైన జీవితాన్ని గడుపుతుంటుంది. భర్తను సరిగా గౌరవించలేక ఎంతో మానసిక వ్యధను అనుభవిస్తుంది. ఆ స్థితిలో కొట్టుమిట్టాడుతున్న సరళకు తన స్నేహితుడు వాసు నాటక ప్రదర్శన లివ్వటానికి అతని బృందంతో వస్తాడు. వారికి జనంపట్టే బ్రహ్మరథాన్నీ, ప్రేక్షకులకు వారిపైనున్న ఆకర్షణకూ చలించిపోయిన సరళ, ఏ ప్రత్యేకతాలేని తన జీవితాన్నీ, అభిమానుల నీరాజనాలందుకుంటున్న వాసు జీవితాన్నీ బేరీజువేసుకుని కుమిలిపోతుంది.

విపరీతమనస్కురాలైన ఆమె మనస్సులో వారిపై అకారణంగా ద్వేషాగ్ని పెంచుకుంటుంది. తన జీవితంమీద కోపాన్ని పెంచుకుని అందరినీ హింసిస్తుంది. ఈ నాటకంలో సరళ పాత్రపట్ల జాలినీ, కోపాన్నీ, ప్రేక్షకుల్లో ఒకేసారి కలిగేట్లుగా చేయటంలో రచయిత కృతకృత్యు లయ్యారు.

పరిస్థితుల కారణంగా తనకిష్టమైన వృత్తిలో కొనసాగలేక ఆ రంగంపై అకారణ ద్వేషాన్ని పెంచుకుని జీవితాన్నిన నరకప్రాయం చేసుకుంటుంది. నాటకరంగం అపవిత్రమైందనీ, నీతిబాహ్యమనీ ఆ రంగంలోని వారందరిపైనా అసూయ పెంచుకుంటుంది. చివరకు వాసుచేసిన హెచ్చరికతో తన మనసులో ఏళ్లతరబడిగా పేరుకున్న బాధనూ, ఆవేదననూ, వెళ్లగక్కుతుంది. పశ్చాత్తాపంతో పునీతమై, ర్తఅభయహస్తంతోనూ, వాసు స్నేహహస్తంతోనూ, మానసిక రుగ్మతకు చికిత్సపొంది, ప్రశాంతంగా జీవితాన్ని ఆనందమయం చేసుకుంటుంది. ఒక పాత్ర మానసి పరిస్థితినే ఇతివృత్తంగా ఎన్నుకుని, తదనుకూలంగా పాత్రలనూ, సంఘటనలనూ కూర్చి ఒక గొప్పనాటకాన్ని ప్రేక్షకులకందించారు రచయిత గ్రామీణ నాటకాలకూ, సాంఘిక నాటకాలకూ భిన్నమైన స్త్రీ మానసిక పరిస్థితిని ఇతివృత్తంగా ఎన్నుకుని తన నాటకరచనా వ్యాసంగాన్ని సంపూర్ణం చేసుకున్నారు

సాంఘిక పరమైన సమస్యలకు సమాజంలోని వ్యక్తులు ఎలాకారణ మవుతారో వ్యక్తి మానసిక సమతుల్యతకు కూడా ఆయా వ్యక్తులే కారణమని ఈ నాటకంద్వారా రచయిత నిరూపించారు. వారి ఆశయాన్ని ఆంధ్ర ప్రేక్షకలోకం ఆదరించి, ఈ నాటకాన్ని ప్రదర్శన రీత్యా దిగ్విజయం చేసి రచయితకు సరైన మూల్యాన్ని చెల్లించారు.

౧౯౫౧ లో కొత్తగా స్థాపించబడిన సంగీతసమితి వారి నిధి సేకరణకుగాను ఒకనాటిక కావాలని అడిగిన సందర్భంలో ఒకరోజు నాటిక వ్రాయబడింది. ఒకేరంగంలో సాగే ఈ నాటికకు డా సి. నారాయణరెడ్డిగారు పాటలు రచించారు.

ఇందులో ఒకవిద్యావంతురాలైన గృహిణి తన అభిరుచులకు విలువనిచ్చి, నాటకరంగంలో పాల్గొంటే ఆమెచుట్టూ ఉన్న సంఘం. ఆమెనమ్మినభర్త, మొదలైన వారిలో కలిగిన విపరీత పరిణామాలే వాస్తవికంగా చిత్రించబడ్డాయి. చర్చా ప్రధానమైన ఈ నాటికలో నేటిసమాజంలో పురుషునికొకన్యాయం, స్త్రీకొకన్యాయం అమలు జరుగుతున్న వైనాన్నీ, ఆ స్త్రీ వ్యధాపూరిత జీవితాన్నీ రచయిత చిత్రించారు.

పాత్రల మనో విశ్లేషణే ప్రధానంగా సాగిన ఈ నాటిక స్త్రీ జీవితాన్ని ఒక పురుషుడి ఆవేశపూరితమైన ప్రవర్తన ఎన్నెన్ని మార్పులకు గురిచేస్తుందో, చివరికి ఆమెమరణానికి కూడా ఏ విధంగా కారణమవుతుందో విషాదాంత నాటకంగా రచింపబడింది. ఉన్నతమైన చదువు, అందం, ఆకర్షణలున్న ఇందిరాదేవికి నాటకరంగంమీద ఎనలేని ప్రేమ. ఆ ఇష్టానికి అనుగుణంగానే నటనలోని మెళకువలన్నీ తెలుసుకుని మంచినటిగా, మంచివ్యక్తిగా పేరుతెచ్చుకుంటుంది. కోరుకున్న వృత్తిలో, రాణించగల అవకాశాలతో ఆమెజీవితం హాయిగా సాగిపోతుంటుంది.

నాటకాల్లో ఆమె అందాన్ని చూసి ఆకర్షితుడై ఆమెను పెళ్ళిచేసుకోవాలనీ, ఆమెప్రేమను పొందాలనీ రాజారావు ఎంతోఆరాటం కనబరుస్తాడు. ఆమె చుట్టూతిరిగీ, ఆకర్షణలుచూపీ, ప్రలోభపెడతాడు. పెళ్ళయ్యాక కూడా ఆమెకిష్టమైన నాటకరంగంలో మరింత రాణించవచ్చనీ, ఆమె ఇష్టాలకు తానెన్నడూ వ్యతిరేకిని కాననీ అలా జరగని పక్షంలో తన ప్రాణాలయినా తీసుకుంటాను గానీ, ఇందిరకు కష్టంకలిగించననీ ఎన్నో వాగ్దానాలు చేసి ఆమెను పెళ్ళి చేసుకుంటాడు.

ఒకనటిని పెళ్ళాడటం రాజారావు తల్లితండ్రులకు ఏమాత్రం నచ్చదు. చిన్నప్పట్నించీ అనుకున్న మేనసంబంధాన్ని కాదని కొడుకు ఒకనటిని చేసుకోవటంతో వారు రాజారావుతో సంబంధాన్ని తెంచుకుని వేరుగా ఉంటారు. చెల్లెలు రాజ్యం మాత్రంవీరితోనే ఉంటూంటుంది. ఆమెకు పెళ్ళిచేయాలని ఎన్నో సంబంధాలు చూస్తున్నా రాజారావు కులాంతర వివాహకారణంగా రాజ్యాన్ని పెళ్ళిచేసుకోవటానికి ఎవరూ ఇష్టపడరు. రాజారావు మేనమామ జోగారావు తనకొడుకుసత్యానికి రాజ్యాన్నిచ్చి పెళ్ళి చేయాలంటే ఇందిర నటించటం మానేయాలనే షరుతు పెడతాడు. ఆ విషయాన్ని తీవ్రంగా పరిగణించిన రాజా ఆమె నటించరాదని శాసిస్తాడు. ఆమె ఎంతబ్రతిమాలినా విన్పించుకోడు. ఇందిర బాధపడుతూండగా ఆమె సహనటుడు కృష్ణమూర్తి బంగారుగొలుసు బహుమతిగా తెచ్చి తనకోరిక తీర్చమంటాడు. అప్పుడే ప్రవేశించిన రాజా ఇందిర ప్రవర్తన మీద అభాండాలువేసి, ఆమెను నీతి బాహ్యురాలిగా పరిగణిస్తాడు.

జరుగుతున్న సంఘటనలు ఒకరోజులోనే ఎన్ని విపరీత పరిణామాలకు దారితోస్తాయో గ్రహించిన ఇందిర ఆ పరీక్షలకు తట్టుకోలేక తన నిష్కళంక జీవితాన్నే ఆత్మహత్యతో అంతంచేసుకుంటుంది. విషాదాంతమైన ఈ నాటకం ఒకరోజులోనే జరుగుతుంది. స్త్రీజీవితాన్ని, ఆమె మనస్తత్వాన్నీ, కొందరి అభాండాల వలన ఆమెపడే మానసిక క్షోభనూ యథార్థంగానూ, వాస్తవికతా పూర్వకంగానూ రచించారు. తొందరపడి అవతలివారి జీవితాలపై అసూయా పూర్వకమైన నిందలు వేస్తే అవి వారి ప్రాణాలకే ముప్పు తెస్తాయనీ, పరనింద మహా పాపమనీ ఈ నాటకం ద్వారా నరసింహారావుగారు తెలియచేశారు.

1. మనసు – మర్మం. ఏ. వెంకటేశ్వరరెడ్డి. పే. 15.

2. తెలుగు నాటక వికాసము. పి. యస్సార్. అప్పారావు. పే. 445.

3. తెలుగునాటక వికాసము. పి. యస్సార్. అప్పారావు. పే. 481.

# రేడియో నాటకాలు

సంవత్సరాల తరబడి క్రమంతప్పకుండా ఆకాశవాణిలో ప్రసారమైన నరసింహారావుగారి రేడియో నాటకాలు ఐదువిభాగాలుగా వర్గీకరించటానికి వీలుగా ఉన్నాయి. అవి:

1. వెంగళప్ప కబుర్లు.
2. ముచ్చట్లు.
3. ప్రాథమిక పాఠశాల.
4. అందరికీ చదువు.
5. వయోజన విద్య.

## వెంగళప్ప కబుర్లు

ఆకాశవాణిలో ప్రతి ఆదివారం ప్రసారమైన ఈ వెంగళప్ప కబుర్లు ఎంతో ప్రజాదరణ పొందాయి. బాలానందం కార్యక్రమంలో హాస్యవిభాగంకోసం రచింపబడినవీ కబుర్లు. ఈ కబుర్లన్నీ సంభాషణాపరంగా ఎంతో హాస్యాన్ని సంతరించుకున్నవి. తెలుగు సాహిత్య చరిత్రలో హాస్య రచయితలకున్న పేరు ప్రతిష్ఠలను ఇనుపడింపచేసి, వారి కీర్తిని చిరకాలం నిలబెట్టగలిగేవివారు సృష్టించిన హాస్యకథానాయకుల పాత్రలేననటం అతిశయోక్తి కాదు. ప్రాచీనరూపకాలలో కథానాయకుడు ధీరోదాత్తుడైతే, హాస్యంకోసం విదూషకపాత్రలుండేవి. ఆధునిక సాహిత్యంలో హాస్యనాటకాలకూ, హాస్యరచనలకూ ఏర్పడిన ప్రాముఖ్యం వలన హాస్య కథానాయకులు ఏర్పడి తమ ప్రత్యేకతను నిలబెట్టుకున్నారు. వారిలో:

గురజాడవారి – గిరీశం.

ముళ్ళపూడి వెంకటరమణ– అప్పారావు.

పానుగంటివారి– జంఘాలశాస్త్రీ మొక్క పాటివారి పార్వతీశం.

మునిమాణిక్యంవారి–కాంతావల్లభుడు.

యర్రంశెట్టిశాయి– భవానీ శంకరం.

మల్లిక్–రాంబాబు.

మొదలైన కథానాయకులెందరో తమ జన్మకు కారకులైన హాస్య రచయితలను సాహితీనీలాకాశంలో ధ్రువతారలుగా నేటికీ వెలిగింపచేస్తున్నారు.

ఇదేకోవకు చెందిన హాస్యపాత్రధారి నరసింహారావుగారి 'వెంగళప్ప' ఈ వెంగళప్ప ప్రాచీనసాహిత్యంలోనూ, శిష్టసాహిత్యంలోనూ ఎక్కడా కనబడకపోయినా, అతిపురాతనమైన జానపదసాహిత్యంలోనూ, గ్రామీణుల పలుకుబడులలోనూ ఎన్నోఏళ్ళుగా దర్శనమిస్తున్నాడు. ఏమీ తెలియని అమాయక చక్రవర్తులను, అజ్ఞానంతో హాస్యాన్ని సృష్టించే వారినీ 'వెర్రివెంగళప్ప'లని పిలవటం తెలుగునాటనేటికీ వినిపిస్తున్న సర్వసామాన్యమయిన పలుకుబడి. గ్రామీణుల నాటకాల్లో (నాలుకల్లో) నలిగిపోయే ఆ వెంగళప్పను తెలుగుసాహిత్యపు వీధులగుండా సామాన్యుడి నట్టింట్లో నడిచేట్టుచేసిన ఘనత మాత్రం నరసింహారావుగారిదే. కల్లాకపటాలులేని స్వచ్ఛమైన గ్రామసీమలలో ఎందరో అమాయకులకు ప్రతీకగా నిలిచే ఈ వెంగళప్పను పట్టణప్రాంతాలకు తీసుకువచ్చి ఆయా ప్రాంతాలలో ఆయా వ్యక్తులతోనూ తన అమాయకత్వమే ఆయుధంగా జరిపిన హాస్యపోరాటాన్ని 'వెంగళప్ప కబుర్లు'గా ఆదివారం ప్రసారమైనరోజుల్లో బాలానందం కార్యక్రమంకోసం పెద్దవాళ్ళంతా ఎంతో ఉత్సాహంగా ఎదురు చూసేవారు. ఈ కబుర్లు బాలానందం కార్యక్రమంలో ఎన్నోవారాల పాటు నడిపించి తెలుగు శ్రోతలకు చక్కటి హాస్యంతోపాటు గ్రామీణతత్వాన్నీ అందించారు. ఈ కార్యక్రమంలో వెంగళప్పకాక, మరిద్దరు పాత్రధారులుంటారు. వీరు చదువుకున్న పట్నవాసులు. వీరితో వెంగళప్ప జరిపే హాస్యసంభాషణలే ఈ కార్యక్రమం.

వెంగళప్ప కబుర్లు శీర్షికన ఎన్నోవారాలపాటు ప్రసారమై శ్రోతలను మురిపించిన ఈ కబుర్లన్నీ చాలాసార్లు పునఃప్రసారమైన భాగాలే. 10.7.84న 2.10నిముషాలకు ప్రసారమైన భాగంలో పట్నాలలో ట్రాఫిక్ సమస్యలను చర్చిస్తూ, తాను ఎలా గాయాలకు గురై హాస్పిటల్లో చేరిందీ పట్నవాసులకు వెంగళప్ప హాస్యస్ఫోరకంగా వినిపిస్తాడు.

31.7.84- ప్రసారమైన వెంగళప్పకబుర్లు, పట్నవాసంపహోటళ్ళలో జరిగే అవకతవకలను, పాశ్చాత్య ఆచారవ్యవహారాల ఫలితంగా ఏర్పడిన దుష్పరిణామాలనూ, వాటి వల్ల పల్లీయులు ఎదుర్కొనే బాధల్నీ నిశితంగానూ, హాస్యస్ఫోరకంగానూ వివరించారు రచయిత.

౨౮.౧౧.౭౩న ప్రసారమైన కబుర్లలో చలికాలంవస్తే ఎన్నితంటాలో అనే శీర్షికన పల్లెసీమలలోని వెచ్చదనాన్నీ, చలికాలంలో పట్నవాసాలలో ఏదుర్కొనే ఇబ్బందులనూ వివరించారు.

౨౧.౧౧.౭౩న ప్రసారమైన కార్యక్రమంలో 'మావూరి పిల్లలు' శీర్షికన వెర్రివెంగళప్పను ఆ వూరి పిల్లలు ఏ విధంగా ఏడిపించింటీ వివరించారు.

౨౦.౭.౭౨న ప్రసారమైన విభాగంలో వెంగళప్ప రాత్రిబడిలో చదివే విధానాన్ని పట్నవాసులకు వివరిస్తాడు.

7.౨.౭౩న ప్రసారమైన భాగంలో వెంగళప్ప తన మూగజీవాలను పెంచే విధానాన్నీ, వాటి అవసరాలనూ చర్చిస్తాడు.

పైన పేర్కొన్న రూపకాలేగాక, ఇంకా ఎన్నో సంభాషణలు ౧౯౭౫ నుండి ౭౪ వరకూ క్రమంగానూ, అప్పడప్పడూనూ, వెంగళప్ప కబుర్లు' శీర్షికన ఆకాశవాణి బాలానందం శ్రోతలను విజ్ఞానవినోదాలలో ముంచెత్తాయి. పానుగంటివారి 'సాక్షి'లో జంఘాలుడు తన శిష్టగ్రాంథిక ఉపన్యాసాలతో సాహిత్యప్రియులను అలరించగా, రావుగారి వెంగళప్ప గ్రామీణభాషతో, మాండలిక యాసతో, రేడియో శ్రోతలను ఉర్రూతలూపటమే గాక తెలుగుసాహిత్యచరిత్రలో కూడా తనదైన స్థానాన్ని సంపాదించుకున్నాడు. జానపదులనోళ్లలో నానుతున్న వెర్రివెంగళప్పను ఆకాశవాణి ద్వారా సామాన్యుడిని తలమునకలయ్యేలా వినోదంలో ముంచెత్తారు.

**ముచ్చట్లు :**

గ్రామసీమల వినసొంపైన ముచ్చట్లతో చాలాకాలం ఆకాశవాణి శ్రోతలను అలరించిన కార్యక్రమమిది. ఆద్యంతం గ్రామీణ భాషలో, యాసతోసాగిన ఈ ముచ్చట్లు కార్యక్రమంలో ఎన్నోవిభాగాలుగా వారంవారం ఆకాశవాణి శ్రోతలనెంతో ఆనందపరచాయి. వాటిలో:

౧. స్వయం ఉపాధి పథకాలు:- ౨౨-౫-౭౦న 7.౦౦గం.శి. కు ప్రసారమైన విభాగమిది. ఇందులో తమకున్న వసతులను సరిగా ఆకళింపుచేసుకోని గ్రామీణ యువకులు స్వయం ఉపాధిపేరుతో ప్రభుత్వబాంకులలో 'లోన్' తీసుకుని, సరైన అవగాహన లేక, నష్టపోయిన విధానాన్ని చెపుతూ స్వయం ఉపాధి పథకానికి ప్రాంతీయ నేపథ్యపు అవసరాన్ని వివరించారు.

2. ఆరోగ్యం:- ఈ విభాగంలో మనిషి ఆరోగ్యానికి శారీరక పుష్టితోపాటు మానసిక సంతుష్టి కూడా అత్యవసరమని రామయ్య, సీతమ్మ పాత్రధారులతో వివరించారు.

3. విద్య, ఆవశ్యకత:- గ్రామసీమలలో ప్రతివ్యక్తికీ విద్య ఎంతవసరమో వివరించి, గ్రామీణులకు వయోజలవిద్య యొక్క ఆవశ్యకతను చక్కగా స్పష్టంచేశారు ఇందులో.

4. పారిశుధ్యం:- ఈ విభాగంలో గ్రామల్లోనేగానీ, పట్నవాసంలోనేగానీ వ్యక్తి శుభ్రత, ప్రాంతీయం పరిసరాల పారిశుధ్యం కలిగి ఉండటం ఎంత ఉపయోగకరమో వివరించారు.

పైన పేర్కొన్న విభాగాలేకాక 'ముచ్చట్లు' శీర్షికతో ఆకాశవాణి గ్రామసీమలు కార్యక్రమంలో ఎన్నో విభాగాలు ప్రసారమైనాయి. ఈ భాగాలను నేటికీ ఆకాశవాణికార్యాలయంలో సమయానుకూలంగా ప్రసారం చేస్తూండటంతోనే ఈ కార్యక్రమానికి గల ప్రాచుర్యం విశదమవుతోంది.

**ప్రాథమిక పాఠశాల :**

ప్రాథమిక స్థాయి విద్యార్థుల కోసం ఆకాశవాణిలో ప్రభుత్వం ఏర్పాటు చేసిన కార్యక్రమాలకోసం నరసింహారావు గారు కొన్ని రూపకాలను రచించారు. ఎన్నోసార్లు పునఃప్రసారాలయిన ఆ కార్యక్రమాల్లో ముఖ్యమయినవి నేటికీ శ్రోతల మనసుల్లో నిలిచిపోయాయి. విద్యార్థులు పాఠశాలల్లోనే ఈ కార్యక్రమాలద్వారా పాఠ్యాంశాలు నేర్చుకోవటానికీ విజ్ఞానాన్ని పెంపొందింప చేయటానికీ ప్రభుత్వం ఏర్పాటు చేసిన రేడియోకార్యక్రమాలు ఇవి.

పలుగు-పార:- 6.11.20వ తేదీన 2-3గం.శి. సమయంలోప్రసారమైన ఈ విభాగంలో ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు గ్రామాలలో వ్యవసాయానికి గొడ్డలి, నాగలి, గడ్డపార, కొడవలి మొదలైన పనిముట్ల ఉపయోగాలను వివరించారు. ఇందులోని పాత్రధారులు రామనాథం, సరళ, శేఖర్, నాగయ్య.

పూవులు వేయి పూజ ఒకటే:- రూపకంలో అంటరానితనాన్ని దుయ్య బట్టారు. సమాజంలో కొందరు తమ వర్ణాధిక్యతనడ్డుపెట్టుకొని ఇతరులను ఎలా చిన్న చూపుచూస్తున్నారో వివరిస్తూ, ఈ భావన సమసమాజ స్థాపనకు ఎంత అనర్థహేతువో పిల్లలమనస్సులకు హత్తుకునేట్టుగా రచించారు. ఇలా పైన పేర్కొన్న విభాగాలేగాక, ప్రాథమిక పాఠశాల అనే శీర్షికన ఇంకా ఎన్నో రూపకాలు ప్రసారమై పునఃప్రసారాలవుతూనే వున్నాయి. చిన్నారులను ఉత్తేజపరుస్తున్నాయి.

## అందరికీ చదువు :

ఈ శీర్షికలో వెంకమ్మ, లింగన్న పాత్రధారులతో ఆకాశవాణి మొట్టమొదట 24.8.93న 8.00గం.కి. సమయంలో ప్రసారమైన ఈ కార్యక్రమం ఎన్నో విభాగాలుగా వారంవారం రేడియోలో ప్రసారమైంది. ఈ భాగంలో గ్రామీణులలో పట్నవాసులపైనా, పెద్దచదువులపైనా ఉన్న అపోహలను తొలగించటానికి ప్రయత్నించారు.

ఇదే శీర్షికలో ప్రసారమైన మరోవిభాగం 5.1.93న 8.00గం.కి. చదువురాని కారణంగా గ్రామీణులను పట్నంలోని వ్యాపరస్థులు నకిలీ ఎరువులనిచ్చి ఎలా మోసం చేస్తున్నారో, చదువు గ్రామీణులకు ఎంత అత్యవసరమో వివరించారు.

24.11.92న 8.00గం.కి న ప్రసారమైన విభాగంలో గ్రామీణులకు వ్యవసాయ పాఠశాలలకు విద్యాభ్యాసమూ, కొత్త కొత్త పరిశోధనల ఫలితంగా శాస్త్రజ్ఞులు కనుగొన్న వ్యవసాయపద్ధతులు తెలుసుకోవటం యొక్క ప్రాముఖ్యతను వివరించారు. ఈ శీర్షికలోని విభాగాలన్నీ గ్రామీణుల సమస్యలను ప్రతిబింబించే విధాన రచింపబడి శ్రోతలనెంతో ఆకట్టుకున్నాయి.

## వయోజన విద్యాకార్యక్రమాలు :

రాష్ట్రంలో సంపూర్ణ అక్షరాస్యతను సాధించేందుకు ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాల్లో భాగంగా ఆకాశవాణిలో వయోజనవిద్యకు సంబంధించిన కార్యక్రమాలు ప్రసారంచేయటానికి తలపెట్టారు. ఆ ఉద్దేశ్యానికి అనుగుణంగా గ్రామీణులలో వయోజనవిద్యకు సంబంధించిన అన్ని వివరాలను ఈ కార్యక్రమాలద్వారా ప్రసారం చేయటానికి సంకల్పించారు. ఆ సందర్భంలో వ్రాయబడినవే ఈ వయోజనవిద్యా కార్యక్రమాలు. ఈ శీర్షికలో ఎన్నో భాగాలు ఆకాశవాణిలో ప్రసారమైనాయి.

1. విద్య-వివేకం:- 15.11.91 న ప్రసారమైన ఈ రూపకంలో తండ్రికి చదువు లేదు గనక ఆయన చేసేదంతా అశాస్త్రీయమని నమ్మే విద్యావంతుడై కూడా వివేకహీనుడైన కొడుకు జీవితంలో పడ్డ కష్టాలూ, అనుభవించిన ఆవేదనా సజీవంగా చిత్రించారు.

2. రాత్రిబడిలో రంగడి చదువు:- 14.4.84 ప్రసారమైన ఈ రూపకంలో చదువుకోని రంగన్న తనకెదురైన కష్టనష్టాలవల్ల తెలివితెచ్చుకుని, వయోజన

విద్యతో తన జీవితాన్ని సఫలంచేసుకున్న వైనాన్ని చిత్రించారు. ఇందులో రంగన్న, వీరక్క, భద్రయ్య, సోమన్నలు పాత్రధారులు.

3. వెన్నెల:- 14.8.92 రోజున 21.8.92వ తేదీన రెండుభాగాలుగా ప్రసారమైన ఈ నాటకంలోని పాత్రలు ప్రసాద్ అరుణ, గోపయ్య, సీతమ్మ, రంగారావు, వెంకమ్మ. ఎవరూ చదువుకోని తమింట్లో విద్యావంతులయిన కోడలే కారడవిలో వెన్నెల అనిభావించే గోపయ్య, చాదస్తాలతో, మూఢాచారాలతో భార్య కోడల్ని విసిగిస్తుంటే బుద్ధి చెప్తాడు. చదువుకున్న అరుణ తన విజ్ఞానంతో వయోజనవిద్యా కేంద్రంలో పదిమందికీ విద్య నేర్పటమేగాక, తన ఇంట్లో విసిగించే అత్తగారి మనసును మార్చి, తన జీవితాన్నీ, ఇంటినీ తేజోవంతం చేసుకుంటుంది.

ఈ విధంగా నరసింహారావుగారి ప్రసారితనాటకాలన్నీ రేడియో శ్రోతలను ఎంతో ఆకట్టుకున్నాయి. సాహిత్యంలో తమకంటూ ప్రత్యేకమైన స్థానాన్ని నిలబెట్టుకున్న తెలంగాణా యాసనూ, మాండలికాలనూ, చిరకాలం నిలిచే ధృవతారలుగా వెలిగింపచేస్తున్నా యనటంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

# భాషాశైలి

ప్రపంచంలో నిత్యంజరిగే వేలాదిసంఘటనలు అందరినీ స్పందింప చేయలేవు. కానీ కవిహృదయం ప్రతి చిన్న సంఘటనకూ చలించిపోయి కవితాఝురులను ప్రవహింపచేస్తుంది. ఆవేశప్రధానమైన కవిత్వంతోపాటు సంఘసంస్కరణాభిలాషాపూర్వకమైన సృజనాత్మకత కూడా గోచరిస్తుంది. రచయిత కలంనుండి ఏ రచన వెలువడినా అందులో అంతర్లీనమైన సాంఘిక ప్రయోజనమే ముఖ్యంగా ఉంటుంది. ఐనా అతని రచనలలో వినోదవిజ్ఞానాలూ, కవితాత్మకతలకు కూడా అవకాశంఉండి, పఠితల మనస్సులను రజింపచేస్తాయి.

నరసింహారావుగారి నాటకాలలో చాలాభాగం గ్రామీణనాటకాలే. ఈ నాటకాలన్నీ గ్రామనేపథ్యంలో సాగినవేగాక, అక్కడి బడుగుజీవుల భాషతోనూ యాసతోనూ కూడినవి. గ్రామప్రాంతాలలో పేదప్రజలజీవన విధానాలే వీరి సాహిత్యానికి ఇతివృత్తాలు. వాటికి సరిగ్గా అతికిపోయిన వీరి రచనా సాధనం వీరు ప్రయోగించిన భాష. శిష్ట వ్యావహారికంలోనూ, శుద్ధగ్రాంథికంలోనూ చాంతాడంతసంభాషణలతో సామాన్య జనానికి దూరంగా ఉన్న తెలుగు నాటకం వీరిభాష ద్వారా అమాంతంగా గ్రామీణుల పూరిగుడిసెల్లోకి చొచ్చుకుపోయి, గాఢనిద్రలో ఉన్నవారిని వెన్ను తట్టిలేపి, కర్తవ్యాన్ని బోధించింది. వీరి నాటకాలలోని భాష గ్రామ్యభాష. గ్రామ్యమంటే జానపదుల వ్యావహారిక భాష. శిష్టవ్యవహారానికీ, గ్రామ్యానికీ చాలా వ్యత్యాసముంది.

| "శిష్టోచ్చారణ | శిష్టేతరోచ్చారణ( గ్రామ్యభాష) |
|---|---|
| 1.(ఈ )ఒత్తులు నిలుస్తాయి | ఒత్తులు పోతాయి. |
| భాగవతం, ధర్మం- | బాగవతం, దర్మం. |
| ( ఉ) హకారం నిలుస్తుంది. | హకారం పోతుంది. |
| హరివిల్లు , రోహిణి. | అరిల్లు,రోయిని. |

2. అద్విరుక్త చకారం అంతటా నిలుస్తుంది. చకారంసకారమవుతుంది.

చవుడు, చుక్క, పలచన,సవుడు, సుక్క, పలసన.

| | |
|---|---|
| 3.పదాది వకారం నిలుస్తుంది. | వకారం పోతుంది. |

విల్లు, వీధి, వెండి, వేడిఇల్లు, ఈది, ఎండి, ఏడి.

4. సంయుక్త హల్లులు నిలుస్తాయి. హల్లులు సమీకరణం పొందుతాయి.

భక్తి, చేస్తాడు, కలెక్టర్. బత్తి, సేత్తాడు, కలకటేరు.

5. శ,ష,సల భేదం ఉంటుంది.శ,షలు సకారంగా మారుతాయి.

శాస్త్రి, భాష, కాసు,సేత్రి, బాస, కాసు,

6. మూర్ధన్యదంతమూలీయభేదం నిలుస్తుంది.మూర్ధన్యాలు దంత మూలీయాలవుతాయి. ళ ల, ణ న

పల్లం, పళ్ళెం, దాణ్ణి, వాణ్ణిపల్లం, పల్లెం, దాన్ని, వాన్ని

7. ఎఫ్, ప, వేరుగా ఉంటాయి. ఎఫ్, గా మారుతుంది.

ఆఫీసు, కాఫీ, తోపు ఆఫీసు, కాపీ,తోపు'''

శిష్టభాషకు, గ్రామ్యభాషకూ ఇన్ని భేదాలున్నప్పటికీ నరసింహారావుగారు తమనాటకాలలో ఇతివృత్తానికి తగిన పాత్రోచితభాషనే ఎన్నుకుని గ్రామీణ భాషనూ, మాండలిక యాసనూ అధికంగా ఉపయోగించారు. కారణం, కూపస్థమండూకమైన గ్రామీణ జీవితాల్లో లేశమాత్రమైనా వెలుగునింపాలనే వీరి ప్రగాఢవాంఛ.

పల్లెల్లోని బడుగుజీవితోద్ధరణే ధ్యేయంగా కలం పట్టిన వీరు ఆ సామాన్యుని జిహ్వాగ్రాన నర్తించే మాండలిక భాషనే తన నాటకాలకు జీవద్భాషగా ఎన్నుకున్నారు. మేధావులు ఆనందించాలని తన మేధస్సునంతా ఉపయోగించి వీరురచనలు చేయలేదు. పండితుల సాహితీగోష్ఠుల్లో చిరకాలం తన నాటకాలు నిలిచిపోవాలనీ ఆశించలేదు. నూటికి ఎనభైమంది నివసించే గ్రామీణ ప్రాంతాల్లో, నిత్యావసరాలు కరువై దీనంగా ప్రపంచం వంకచూసే గ్రామీణుల కోసమే కలంపట్టి తనరచనలతో గ్రామప్రాంతీయుల్లో మార్పుకు కారణమయ్యారు.

నరసింహారావుగారి నాటకసాహిత్యంలోని భాష సులభ వ్యావహారిక భాష. మాండలిక యాసతో కూడిన గ్రామ్యభాష. ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా ప్రాంతానికి చెందిన నల్లగొండజిల్లా తూర్పు మాండలిక భాష. బడుగువర్గాలమీద ఎనలేని ప్రేమగల వీరు ఏరకంగానైనా వారిలో కనీసమార్పు తీసుకురావటానికి

వారుపయోగించే 'భాష'ను, 'యాస'నూ తనలక్ష్యసాధనకు ఆయుధాలుగా వాడుకున్నారనేది నిస్సంశయమేగాక, గ్రాంథికకావ్యాల పరిచయంలేక గ్రామ్యాన్ని ఉపయోగించాననే సందేహాన్ని రూపుమాపటానికి వీరి సాంఘిక, చారిత్రక, హాస్యనాటకాలే నిదర్శనాలు. అలనాటి పూర్వకవులనుండీ ఆధునికులవరకూ ప్రజాభీష్టమయిన రచనలే చేయటానికి కారణం '' 'కవియొక్క చిత్తవృత్తిని బట్టి, కావ్యశైలి, లేకభాష మారుతుంది. సాత్వికుడైనకవి సాత్వికుడైన బాటసారి వంటివాడు. సత్వస్వభావంగల బాటసారి తానునిష్కంటకమైన ఋజుమార్గంలో ప్రయాణించటమే గాక, తోటి ప్రయాణీకులనూ నిష్ప్రమాదమైన మార్గాన తీసుకుపోతాడు. రాజసుడైన కవి రాజసుడైన బాటసారి లాంటివాడు. రాజసుడైన బాటసారి తాను ఋజుమార్గాన ప్రయాణిస్తాడు కానీ తోటివారిని తనతో తీసుకుపోయే బాధ్యత వహించడు. వారు తనవెంట రాగలరనో, రావాలనో భావించి తన యిచ్ఛవచ్చినట్టు ప్రయాణిస్తాడు. వేదాంత భాషలో చెప్పాలంటే,

యత్నాలకు

విడిచిపెట్టక, నోటికికరుచుకుని వెళుతుంది. అలాగే సాత్వికకవి తనతో పాఠకుని తీసుకుపోయే దృష్టి పెట్టుకుంటాడు. రాజసకవి తల్లి మర్కటము వంటివాడు. కోతిపిల్లలు తల్లిమర్కటము నంటిపెట్టుకుని తల్లితో ప్రయాణం చేస్తాయి. తల్లివాటిని నోటకరుచుకుని వెళ్ళదు. రాజసకవి సహృదయుడయిన పాఠకుడు తన వెంటరావాలనే దృష్టి పెట్టుకుంటాడు. రాజసకవి తన భావవైహాయసగమనాన్ని గమనించుకుంటూ పాండిత్య శిఖరాగ్రాలకు తనతోపాటు పాఠకుడు ఎక్కిరావాలంటాడు. మన ప్రాచీనకవుల్లో నన్నయ, తిక్కన, ఎర్రన, పోతన, పెద్దన్నలు సాత్విక కవులు. నాచన సోమన, శ్రీనాథుడు. రామరాజభూషణుడు, తెనాలిరామకృష్ణకవి వంటివారు రాజసకవులని స్థూలంగా భావిద్దాము. వారి గుణవిశేషణాలను బట్టి వారి శైలీభేదాలు ఉంటాయి. భాష ఆశైలిని అనుసరించే ప్రవహిస్తుంది. అందుచేత సాహిత్య భాషలో సాత్విక, రాజస భేదాలను మనం

ఈ భేదాన్ననుసరించి, వర్గీకరించినట్టయితే, రావుగారు సాత్వికకవి. గ్రామీణ ప్రాంతాల్లోని అమాయక నిరక్షరాస్యులకు అక్షరజ్ఞానం పంచటంతో పాటు వారిలో ఆలోచనను పెంచటానికే వీరు నాటక రచనను చేపట్టారు. సంస్కృత ప్రాకృతాలు రాజభాషగా చెలామణీ అవుతున్నకాలంలో నన్నయభట్టు సామాన్యుని నోటపలికే తెలుగుభాషకు జీవం పోశాడు. ఆ జీవికి తిక్కనాదులు ప్రేమతోనుడి కారపు సొగసులను నింపారు. శ్రీనాథాది మహాకవులా కన్యకు

ప్రౌఢస్వాతిశయాన్నందించారు. పోతనగారామెకు రమణీయ భక్తిని కానుక చేశారు. నాయకరాజులామెను నవలామణిగా తీర్చిదిద్దారు. మారినకాలంలోని నాగరికతకనుగుణంగా ఆధునిక కవులెందరో ఆమెకు అత్యంతాధునికమైన సౌందర్యసాధనాలను సమర్పించి, తెలుగుభాషా యోషను వసుధైక మోహినిగా తీర్చిదిద్దారు.

నరసింహారావుగారి భాషా ప్రయోగాలలో ముఖ్యంగా అన్యదేశ్య ప్రయోగాలు, మాండలిక ప్రయోగాలు, తెలంగాణా ప్రాంతీయ యాస, ఊతపదాలు, గ్రామీణులలో నలిగిన పలుకుబడులు మొదలైనవి కనిపిస్తాయి.

అన్యదేశ్యప్రయోగాలుః- వీరి రచనలలో ఇంగ్లీషు పదప్రయోగ మున్నప్పటికీ అది పాత్రోచిత వ్యవహారానికే వర్తిస్తుంది. కానీ ఉర్దూ, పారసీభాషల ప్రభావం మాత్రం వీరి రచనలపై అధికంగా కన్పిస్తుంది. '''తెలంగాణపు తెలుగుభాషపై ఉర్దూ, పారసీకముల ప్రభావము మిక్కుటముగ నేర్పడుటకు రెండు సంఘటనలు ప్రధానముగ గలవని స్పష్టమగుచున్నది. మొదటిది అసఫ్‌జాహీ ప్రభువులలో నవాబు మహబూబ్ అలీఖాన్ గారి పరిపాలనా కాలమున క్రీ.శ. ౧౮౭౦ ప్రాంతంలో ప్రభుత్వ వ్యవహారములు పారసీలో జరుగుతూండటం, రెండవది అతిముఖ్యమైన సంఘటనా రాష్ట్రంలో ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపనము.''[3] రాష్ట్రంలో హైస్కూలు తరగతులనుండి యం.ఏ వరకు ఉర్దూ బోధనాభాషగా స్వీకరింపబడి, ప్రభుత్వోద్యోగాలనాశించేవారు, ఉన్నత విద్యాభ్యాసం చేసేవారూ, నిర్బంధంగా ఉర్దూ నేర్చుకోవలసి వచ్చింది. సామాన్య జన వ్యవహారంలోనూ ఉర్దూలో పరిచయం కలిగి ఉండటం తప్పని సరైంది. ఈ కారణాలను బట్టి రచయితలు సైతం (తెలంగాణాపు) ఉర్దూ పారసీకాల ప్రభావంనుండి తప్పించుకోలేకపోయారు. ముఖ్యంగా రావుగారి నాటకాలన్నీ గ్రామీణ నేపథ్యంలో సాగినవే అవటంవల్ల ఉర్దూ, పారసీల ప్రభావం పడక తప్పిందికాదు.

''ఆ దస్తరం ఊడగుంజుదాయనే''- అడుగుజాడలుయపే ౭౮ 'దస్తరం' పారసీపదం. దఫ్తర్ యొక్క వికృతి ఇది. ఈ పదానికి 'వ్యవహార పత్రముల మూట' అని అర్థం. దఫ్తర్ అంటే రాచకార్యాలయం.

''ఆరులేకపోతే ఈపనికి ఉసారిచ్చేదోరు.'' అడుగుజాడలు. పే.౮. హోషియార్ అనే ఉర్దూపదం వ్యావహారికంలో హుషార్‌గా మారి గ్రామ్యంలో ఉసారుగా నలిగింది.

''వాళ్లంత మీ కంపినీలకొచ్చే ఆదత్ ఉందిగదా.'' రేపటికి వాయిదా పే.24 ఉర్దూవ్యావహారికంలో 'అలవాటు'ను సూచించే ఈ 'ఆదత్' తెలుగులో కూడా సమానార్థకంగానే వాడబడింది.

''మీరప్పడే నాలుగుసూదులెక్కించి 'ఫరాకత్'గ కూసుంటరు''. గెలుపునీదే. పే.10 తీరికను సూచించే ఈ'ఫరాకత్'పదం సమానార్థకంగానే తెలుగులోకి చేరిన ఉర్దూపదం.

''ఇదేం తరీఖా అయ్యా''-కొడిగట్టిన దీపాలు. పే.48.

పద్ధతిని సూచించే ఈ 'తరీఖా' సమానార్థకంగానే వాడబడుతున్న ఉర్దూపదం.

ఇవేగాక వీరిప్రయోగాల్లో ఉర్దూపారసీకాల్లోని విశేష్య విశేషణాలకూ, ధాతువులకూ, తెలుగులోని సహాయక క్రియలు చేరగా ఏర్పడే కొత్త ధాతువులు ఎన్నో కన్పిస్తాయి. అన్యదేశ్యధాతువులకు ఇంచు', 'ఆయించు', ఆగమములు కలిగి ఏర్పడ్డ తెలుగురూపాలు, ''ఫిరాయించు ఫిర్ + ఆయించు = ఫిరాయించు''- ప్రజాదేవత. పే.8. ''సతాయించు. సతా+యించు =సతాయించు- కల్పతరువు.పే.14.

అన్యదేశ్య విశేషణములకు 'చేయు' సహాయక క్రియ వలన ఏర్పడిన ఎన్నోరూపాలు గ్రామీణభాషతో కన్పించే నూతన అందాలతో వీరిరచనల్లో పొందుపరచుకున్నాయి. వాటిలో కొన్ని

''తనిఖీ చేయు''-కల్పతరువు. పే.67

''బంద్ చేయు''-కొత్తగుడి-పే.1

''బదనాం చేయు''-అడుగుజాడలు.పే.71

''మంజూర్ చేయు''-కొడిగట్టిన దీపాలు.పే.89

''బాకీ చేయు''-కొత్తగుడి.పే.9.

''తమాషా చేయు''-అపరాధపరిశోధకులు.పే.20

'పడు' అన్న సహాయక క్రియ వలన ఏర్పడిన పదాలు.

''గాబరాపడు''- ఉర్దూ 'ఘబరా' 'గాబరా' గా మారి 'పడు' సహాయక

క్రియతోచేరి ఇలా రూపొందింది. క్రీనీడలు.పే.18.

''దగాపడు''-గెలుపునీదే-పే.85

''బాకీపడు''-ఆదర్శలోకాలు.పే.28.

తెలుగులో అన్యదేశ్యాల్లో ఏర్పడిన ఎన్నోరకాల మార్పులను భాషా శాస్త్ర సిద్ధాంతాలననుసరించి కొన్నివిధాలుగా వర్గీకరించవచ్చు.

1. స్వరాకర్షణః- పూర్వంలోగానీ, పరంలో గానీ ఉన్న అచ్చుల ఆకర్షణం వల్ల ఒక అచ్చు మార్పును పొందటం స్వరాకర్షణమనబడుతుంది. ద్రవిడ భాషలందీమార్పు సర్వసాధారణం.

'కు' ప్రత్యయం 'కి'గా మారుట. ఈ సూత్రానుసారం వల్లనే.

చేతి +కు=చేతికి, రాముని+కు=రామునికి.

ఉర్దూపారసీలు తెలుగులో చేరినప్పుడీ మార్పులను పొందాయి. ఖబర్-కబరు= కబరుగా మారింది.

''పోలీసులకీ కబురెలా తెలిసిందో''-భారతి.పే.29.

విభక్తి ప్రత్యయాలు చేరిన పదాలలోనూ, బహువచన రూపాలలోనూ ఈ మార్పు గోచరుస్తుంది.

తుపాకి+లు= తుపాకులు

''మేమేనన్న తుపాకులు బట్టిటోళ్లమా''-అగ్నిపరీక్ష-పే.6.

ఇలాంటి మార్పులన్నీ ఉచ్చారణ సౌకర్యంలో ఏర్పడినవే.

2. వర్ణవ్యత్యయంః- అచ్చులుగానీ, హల్లులు గానీ పరస్పరం అటూ ఇటూ మార్పునొందటం 'అమానతు', అనామతు గా మారింది. ''అనామత్ గ సూపిచ్చిండు''-కొత్తగుడి.4

ధ్వనివ్యత్యయంః- ఊనిక పదంయొక్క ప్రథమాక్షరం పడటం. 'బహెదా', హోదా గామారింది. ''నువ్వు కోరిన హోదాదక్కిందిగా'' క్రీనీడలు. 14.

ద్విరుక్తిః- ఒకవిధమైన వర్ణసమీకరణం. ఇందులో విభిన్నాలైన రెండు వర్ణాలు సంయోగం చెందుతాయి.

హద్-హద్దు. ''సరిహద్దుల్లో గొడవలు''. అగ్నిపరీక్ష.పే.౨.

స్వరభక్తి లేక స్వరవిశ్లేషం:- విజాతీయాలైన హల్లులు సమీకరణం పొందేటప్పుడు ఒక అచ్చుచేరి సంయుక్తాక్షరాన్ని విశ్లేషమౌతుంది.

బద్లీ= బదిలీగా మారింది. ''నువ్వే నాకుబదిలీ చేయించావు''- స్వార్థం.పే.౧౮.

గుణధర్మం:- ఏ. ఓ. అర్‌లు అనునవి గుణములు సంధిసూత్రంతో నిమిత్తం లేకుండా ఉ.ఓగా మారటం ఉచ్చారణసామ్యంవల్లనే.

ముగలాయి-మొగలాయి.

''ఈ మొగలాయి సామ్రాజ్యం నీదే''- అక్బర్.౨౪

వర్ణచ్యుతి:- సంయుక్తాక్షరాలలోని ఒక వర్ణం జారిపోవటం.

మజ్జిద్-మసీదు.

''మసీదైనా, దేవాలయమైనా మనవే''- ఆదర్శలోకాలు.పే.౩౨.

జానపద వ్యుత్పత్తి:- శబ్దస్వరూపంతో స్వల్ప పరిచయం వల్లా, అసలు పరిచయం లేకపోవటం వల్లా కొన్నికొన్ని పదాలు చిత్రమైన మార్పులకు గురవుతుంటాయి.

నంగా-లంగా.

మాండలిక ప్రయోగాలు:- దేశీయవృత్తుల్లో జానపదులువాడే భాష ఆధారంగా నాలుగు భాషా మండలాలను గుర్తించవచ్చు. అవి.

పూర్వమండలం-కళింగదేశం, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు.

దక్షిణ మండలం-రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు.

ఉత్తర మండలం-తెలంగాణా, మహబూబ్‌నగర్, ఖమ్మం జిల్లాలు.

మధ్యమండలం-ఉభయగోదావరులు, గుంటూరు, కృష్ణా జిల్లాలు.

నరసింహారావుగారు నాటకాలలో ఉపయోగించిన భాష ఉత్తరమండలంలోని నల్గొండజిల్లా తూర్పుమాండలిక భాష. గ్రామీణ యాసతో కూడిన రమ్యమైన భాష.

''వీళ్ళ అన్ని పనులు 'పదునుకుని' సేస్తున్నట్టుందె.'' అడుగుజాడలు.౨౮.

'పదునుకుని'- తెలంగాణాలో 'బదులుకుని' అనే ఈ పలుకుబడికి 'కూడబలుక్కుని' అనే అర్థం ఉంది.

''ఉండుసినబాబూ 'శనా' పనుండది'', పుట్టినరోజు పండుగ.పే. 1.

'శనా' చాలా అనేమాటకుతెలంగాణాలో 'శానా' అనే వాడుక ఉండి, నల్గొండలోకి 'శనా' గా వెళ్ళిపోయింది. శానేండ్లు అంటే చాలా సంవత్సరాలని అర్థం.

'పాపన్నే ఈ'పనిజేసే'నంటరుమల్లా''. అడుగుజాడలు.పే. 10.

పనిజేసే మామూలుగా 'పనిసేసె' అని ఉండాలి గసడవాదేశసూత్రం ప్రకారం. కానీ నల్గొండ, తెలంగాణా ప్రాంతాల్లో 'సరళాదేశం' వస్తూంటుంది. ఇటుజూసి, అటుజూసి, అనీ, ఏం చేస్తాడు అనటానికి ఏంజేస్తడు, ఏంజూస్తడు అనీ వాడుక. '' ఒద్దాలీ నువ్వుపోవద్దు''- తోడునీడ.పే.30.

ఒరే అనే వాడుకపదం తెలంగాణాలో 'వాలీ' ఐంది. గ్రామీణులతో సంధి చేసుకుని ఒద్దాలీ ఐపోయింది.

''సత్యంగారు పట్నంల పెద్దసదువులు సదివిన్రు'', తోడునీడ.పే. 12.

షష్ఠీవిభక్తి ప్రత్యయమైన 'లో' ఈ ప్రాంతంలో 'ల'గా మారింది. పట్నంలో - 'పట్నంల'గా మారింది. ఇంటిలో- ఇంట్ల, చెరువులో- చెరువులగా మారాయి.

''నిజంగానేజరవొచ్చిందండీ. అమ్మతోడుండీ''- తోడునీడ.పే.34.

నల్గొండ ప్రాంతాల్లో అండికి బదులు వాక్యాంతంలోనూ పదంలోని ఉత్తరార్థంలోనూ 'ఉండి' ఎక్కువగా వాడబడుతుంది. జ్వర+ వచ్చింది+ అండి = 'జరమొచ్చిందుండీ'గా మారిపోయింది.

ఇంకా అయ్యగారు, 'అయిగోరు'గానూ, స్వామివారు, 'సాములోరు'గానూ మారి, తెలీదుండీ, రాలేదుండీ, పోవాల్నుండీ. లాంటి ఎన్నో మాండలిక యాసతో కూడిన పలుకుబడులు వీరి రచనల్లో చోటు చేసుకున్నాయి.

''నేనుగూడ 'ఆనోతుగ' లాగుతొడిగితె''- తోడునీడ.పే.57.

'వతుగ' అంటే 'లాగా' అని అర్థం. చందమామెవొతుగ అంటే 'చందమామలాగా' అని అర్థం. ఈ 'వతు' లో ఉన్నది సంస్కృతపదమైన 'వత్' (వలె) హలంతమైన 'వత్' మాండలికభాషలో అజంతమైపోయింది.

''ధసెపోనాకేడ తీరుతదిరా?''–'ధసెపో, అచ్చమైన మండలికం. ఇంకే ప్రాంతలోనూ విన్పించని ఈ పదానికి సర్లే అనే అర్థంఉన్నా, ఇలాంటి చాలా మాటలు నల్గొండ ప్రాంతపు మాండలికానికి చెందినవే. 'ఎహెపో', 'ఓసోస్', 'జశోష్', 'ఇంక్యాడ', 'నేన్యాడ','ప్యార్లి', 'న్యాలం' మొదలైన మాండలిక పదాలు ఈ ప్రాంతానికే పరిమితమైనవి.

''నీ శాతిగాల నీ ఒగలు నా కాడనా''?– కొత్తగుడి.పే.28.

ఈ 'శాతి', ఖ్యాతికి వికృతి. 'నీ కీర్తిమండా' అనే మధ్య గోదావరి మాండలికానికి సరిపోతుంది.దెబ్బగాల, మొగంగాల, పిచ్చిగాల, నోరుగాల మొదలైనవన్నీ ఈ కోవలోనికే వస్తాయి.

''ఆ మాట నివ్వద్దే నుండీ''–కొత్తగుడి పే 52.

నివ్వద్ది అంటే నిబద్ధి–మాటకు కట్టుబడి ఉండటం, నిజం, లాంటి అర్థాలున్నాయి ఈ పదానికి, అబద్ధం కానిది 'నిబద్ధి' అంటే నిజమన్నమాట.

పై మాండలికాలే గాక , తెలంగాణా ప్రాంతంలోని .ఎన్నో 'పలుకుబడులు'వీరి రచనలలో సాక్షాత్కరించాయి.

''మనమే ఇగురంజేసుకోవాలె''–కల్పతరువు.పే.18.

'ఇగురం' అంటేనేర్పు. ఇది వివరం అనే మాటకు వికృతి.

వివరం–ఇవరం–ఇగురం–ఇదీ క్రమం. వ్యాకరణం ప్రకారం అపదాదిగకారం వకారమవుతుంది. చిగురు–చివురు. నగు–నవు. మొదలైనవి. కానీ ఇక్కడ వకారం, గకారంగా మారింది. మాండలిక చమత్కారంగా మారిపోయింది.

''రొండునుడుగులు పాడు నర్సక్కా''– కొత్తగుడి.పే.28.

'నుడుగులు' అంటే మాటలు, చరణాలు, పంక్తులు. ఒక నుడుగు వినిపించమని అడిగితే, ఒక చరణం పాడమని అర్థం.

తెలంగాణామంతటా చేసినాడు. చెప్పినాడు అంటానికి బదులు, చేసిండు, చెప్పిండు అనటం సర్వసాధారణం.

పూర్వగ్రాంథికభాషలోనూ, ఇప్పటికీ రాయలసీమలోనూ ఉన్న 'చేసినాడు' వంటి క్రియారూపాల్లోని 'నకారం' అనుస్వారంగా మారి 'న' లోని అకారాన్ని

గిరాటువేసి, 'చేసిండు' గా మారింది. తెలంగాణాలో క్రియల్లోని దీర్ఘం హ్రస్వంకావటం చాలాసహజం.

ఊతపదాలు:- రావుగారి ప్రతినాటకంలోనూ 'ఊతపదం' ఖచ్చితంగా కన్పిస్తుంది. అమాయకులైన గ్రామీణుల మనస్సుల్లోంచి పుట్టుకొచ్చిన ఆ పదాల అందంఅలవిగానిది.

అడుగుజాడలు నాటకంలో కొమరయ్య ప్రతిదానికీ,

''సావితోడుండీ'' అంటాడు. అదే నాటకంలో పాపన్నకు, ''బొక్క నవుల్తమల్ల బొక్క'' ఊతపదం.

సహజంగానే మనంమాట్లాడేభాషలో 'ఊతపదాలు' దొర్లుతుంటాయి. మాట్లాడేవారు ఆ మాటలను ఎక్కువగా గుర్తించక పోయినా కూడా, వినేవారు ఎవరికి ఊతపదాల వాడుక అధికమో ఇట్టే గుర్తిస్తారు. ఊతపదాలను ఊరికే కొట్టిసెయ్యకుండా పరిశీలించి చూస్తే, వాటిలోని ఎన్నో అర్థాలను, పరమార్థాలనూ గ్రహించవచ్చును.

సమర్థుడయిన నాటకరచయిత తన మనోభావాలనూ పాత్రలద్వారా బయటపెడుతూనే, వాటికి జనరంజకమైన పలుకుబడులు, జాతికి వన్నె తెచ్చే జాతీయాలూ జోడిస్తాడు. నరసింహారావుగారీ విషయంలో మహాసమర్థులు. వీరి హాస్యనాటిక 'మతిలేని మహారాజు' లో రాజుగారు ప్రతిసంభాషణముందూ సేవకునితో ''నువ్వే నా మంత్రి'' అంటాడు. ఈ ఊతపదం నాటకం ప్రదర్శించేటప్పుడు అందరినీ ఆకట్టుకుని తరువాత కూడా కడుపుబ్బ నవ్వించేది.

కొత్తగుడి నాటకంలో రాములు చేత,

''రాములు దెబ్బంటే,, ఊరంత అబ్బ'' అన్పిస్తారు.

క్రీనీడలు నాటకంలో డాక్టరు 'పతి' చేత,

''దేవీ నేనెంతో మంది పొట్టలు చీల్చి రోగాలు కనుక్కున్నాను గానీ నీ మనసులో ఏముందో తెలుసుకోలేదు.'' అంటూ ప్రతిసంభాషణకు ముందూ, ''నేనొంతోమంది''- అనే ఊతపదాన్ని అలవాటుగా వాడుతుంటాడు.

భారతి నాటకంలో వీరాస్వామి.

''పేగులు పగులజీరి, మెల్లేసుకుని నెత్తురుగట్టగట్ట తాగుత''- అంటూ మనసులోని క్రౌర్యాన్ని బయట పెట్టుకుంటాడు. పాత్రల స్వభావాలకు

అనుకూలంగా వారిచేత ఊతపదాలు వాడటంలో రచయిత నైపుణ్యం అన్ని నాటకాల్లోనూ వ్యక్తమయింది.

హాస్య నాటిక' అపరాధ పరిశోధకులు' లో సత్యం చేత, '' నీ హత్య తగలడ'', నే ఊతపదాన్ని ఉపయోగింపచేశారు. తొలకరి నాటకంలో అమాయకుడైన లింగన్న పాత్ర చేత ప్రతిసంభాషణకూ,

''లచ్చబోసినా రావు. లచ్చేంది ఏలు, నూర్లుబోసినారావు.'' అనిపించి, ప్రేక్షకుల చేత నవ్విస్తారు. ప్రతి నాటకంలోనూ ఒకే పాత్రకుకాక, రెడు మూడు పాత్రలవరకూ ఊతపదాల ఊనికనిచ్చి, ఆయా పాత్రలను ప్రేక్షకుల మనసుల్లో చెరిగిపోని విధంగా సృష్టించారు రచయిత.

**సామెతలు :**

నరసింహారావుగారి నాటకాలలో గ్రామీణులు నిత్యం వాడుకునే అనేకానేక సామెతలు మెరుపుల్లా తళుక్కుమంటాయి. 'సామెత' సామ్యతకు వికృతి.సామ్యతకు దృష్టాంతమని స్థూలార్థం. ఒక విషయాన్ని చెప్పవలసి వచ్చినపుడు అలాంటిదే ఇంకొక విషయాన్ని గుర్తుచేసుకుంటూ వర్తమానాన్ని నిర్వచించటంలో సామెతలు ముఖ్యపాత్ర వహిస్తాయి. ప్రాచీన మానవుడు కనుగొన్న ఈ సామెత నేటివరకూ, ''ఏదో సామెత చెప్పినట్టు'' ''ఏదో శాస్త్రం చెప్పినట్టు'' అని విన్పిస్తుంది.

1.''తీర్థానికితీర్థంప్రసాదానికిప్రసాదం''. అడుగుజాడలు.పే.31.

2. ''ఆరేదీపం మహామండుతుందని''. అడుగుజాడలు.పే.51.

3. ''నీ యిల్లు బంగారంగాను''. అడుగుజాడలు.పే.58.

4. ''నీ పిచ్చి దొంగలు దోల''. అడుగుజాడలు.పే.52.

5. ''పుట్టుకతో వచ్చింది పుడకలతోగానీ పోదు''. ఆదర్శలోకాలు.పే.15.

6. ''ఉడతఊపులకే రాజ్యాలు కదలిపోతాయా''. ఆదర్శ లోకాలు.పే.51.

7. ''పానకంలో పుడక''. ఆదర్శలోకాలు.పే.58.

8. ''సంతోషమే సగంబలం''. అడుగుజాడలు.పే.23.

9. ''చల్లకొచ్చి ముంతదాచటం''. కొత్తగుడి.పే.54.

౧౦. ''పొరక తిరగేసినట్టు''. తొలకరి.పే.౮.

మొదలైన సామెతలన్నీ నరసింహారావుగారి ప్రయోగాల్లో చోటుచేసుకుని గ్రామ్య భాషకూ, గ్రామీణ యాసకూ సహజ సౌందర్యాలుగా విలసిల్లుతున్నాయి. తెలుగు భాషను సుసంపన్నం చేసే జాతీయాలు రచయితల చేతుల్లో ఎన్నెన్నో అందాలను సంతరించుకున్నాయనటానికి తెలుగుసాహిత్యంలో సంచరించే ఎన్నో జాతీయాలూ, పలుకుబడులే సాక్ష్యాలు.

౧. తెలుగు భాషా చరిత్ర - భద్రిరాజు కృష్ణమూర్తి. పే. ౪౦౭.

౨. సాహిత్య భాషగా తెలుగు. ఖండవల్లి లక్ష్మీరంజనం. పే. ౫.

౩. తెలుగుపై ఉర్దూపారసీకముల ప్రభావము.

కె. గోపాలకృష్ణారావు. పే. ౨

# ముగింపు

దేశాభిమానాన్ని చాటుకోవటానికి వేదికలు అలంకరించి ఉపన్యాసా లివ్వనవసరం లేదనీ, ఆ భావాన్ని చేతలద్వారా నిరూపించ వచ్చుననీ యాభై సంవత్సరాల నుండీ ఆచరించి చూపుతున్న నిష్కళంక దేశాభిమాని స్వచ్ఛమైన గాంధేయవాది నరసింహారావుగారు. గ్రామీణ ప్రాంతాల్లో పునర్వికాసానికి వీరు చేసిన నాటకరచనా ప్రయత్నాలు, ప్రదర్శనా నిర్వహణలూ ఇన్నని చెప్పి వాటి విలువలను బేరీజు వేయటం సాహసమే అవుతుంది. తెలంగాణాలో సాగిన జాతీయోద్యమాల ప్రభావం వీరి రచనలలో ప్రతిబింబిస్తుంది.

నిజాం ప్రభుత్వంలో రాజకీయంగా ఎన్ని కట్టుబాట్లున్నా, అధికారులు ఎంత హింసించినా కవుల కంఠాలకు తాళం వేయలేకపోయారు. అలాంటి రాక్షస ప్రభుత్వం అంతరించినా తెలంగాణా ప్రజల్లో ఆ కష్టాల నీలినీడలు మనోనేత్రం ముందు సదా కదలాడేవి. 'నీ బాంచెన్ కాల్మొక్తా' ఆనాటి తెలంగాణా రైతుకు ఊతపదం. రోజంతా కష్టపడి పనిచేసినా, కూటికీ గుడ్డకూ నోచుకోని అమాయక గ్రామీణ జనులకోసమే తనరచనా వ్యాసంగాన్ని అంకితం చేసిన మరో మహాత్ములు నరసింహారావుగారు. మామూలు మనిషికన్నా భిన్న మనఃప్రవృత్తి గలవాడే రచయిత. ఆవ్యక్తిలో కవితాత్మకత, సృజనాత్మకత వెల్లువలై ప్రహిస్తుంటాయి. ఇది సాధారణ విషయం. కానీ ఆ రచయితలోని వ్యక్తిత్వం అసాధారణంగా బైటపడే గుణం. ఏలక్ష్యసాధనకు తానుకలంపట్టాడో, ఏలక్ష్యాన్ని చేరుకోవటానికి తన జీవితాన్నే పణంగా పెట్టతల్చుకున్నాడో ఆ పవిత్రమైన లక్ష్యాన్ని తన ప్రతిరచనలోనూ, ప్రతి వాక్యంలోనూ వ్యక్తపరచగలగటం. తాను నమ్మిన సిద్ధాంతంకోసం, తాననుకున్న లక్ష్యాన్ని మనస్సులోనూ, మాటల్లోనూ, తానుచేసే ప్రతిపనిలోనూ వ్యక్తపరిచే మహామనీషి నరసింహారావుగారు మారుమూల పల్లెల్లో జీవిస్తున్న కూలీకూడా భరతమాత ముద్దు బిడ్డడేననీ, అతనుకూడా సగర్వంగా తలఎత్తుకుని భారతపతాకానికి అభివాదం చేయటానికి, విద్యావంతులు, శాసన కర్తలూ, ధనవంతులూ అందరూ తప్పనిసరిగా కృషిచేయాలనేదే వీరి ప్రగాఢవాంఛ. జీవితాశయంకూడా.

భారతదేశంలో సగానికపైగా గ్రామాలలో నివసిస్తున్న కష్టాలను వీరి హృదయం తల్లడిల్లేది. ఆయన పరిసరగ్రామాలలో ఒకవైపు అమాయకులైన గ్రామీణులు. ఆ అమాయకత్వాన్ని ఆసరాచేసుకున్న నికృష్టమైన వర్గపోరాటాలు. ఎటుచూసినా నిరక్షరాస్యత, భరించలేని దారిద్ర్యం తాండవం చేస్తున్న

గ్రామీణప్రాంతాలలో పునర్వికాసం కోసం వీరు చేపట్టని ప్రక్రియలేదు. నాటకరచనారంగంలో సంస్కరణోపేతమైన నాటకరచనల ద్వారా గ్రామీణప్రాంతాలలో వీరు చైతన్యస్రవంతిని ప్రవహింపచేశారు.

మనదేశంలో ప్రజాస్వామ్య ప్రభుత్వం కూడా ఉన్నతవర్గాలకు చెందిన ఉద్యోగస్థులను, పారిశ్రామికులను, వర్తకులను బలపరచటానికే ఉపయోగ పడుతున్నది గానీ, గ్రామీణ ప్రాంతీయాభివృద్ధికిగానీ, రైతాంగసంరక్షణకుగానీ సురక్షిత పథకాలు అమలు చేయుటంలేదు. మన పంచాయతీ వ్యవస్థ గ్రామీణ వ్యవస్థను బలపరచలేకపోగా, అది పెత్తందారుల హస్తగతమై బంధుప్రీతికీ, కులతత్వాలకు, ఆశ్రితపక్షపాతాలకూ కుళ్ళిపోయిన రాజకీయాలకూ నిలయమై పోయిన వైనాన్ని వీరు తన నాటకాలలో వ్యధాపూరితంగా వ్యక్తీకరించారు.

తాను ముక్కిపోయిన జొన్నసంకటి తింటూ, నగరజీవికి పలావు బియ్యాన్ని అందించే మహర్షి రైతు. భూదేవిని నమ్ముకుని పెట్టుబడిపెట్టి, కాయకష్టంతో శ్రమించి, రేయింబవళ్ళూ శ్రమించీ, పర్యవేక్షించీ, అతివృష్టికీ, అనావృష్టికీ, అకాల పకృతి వైపరీత్యాలకూ ఎదురునిల్చి, తట్టుకోగలిగే మానసిక, ఆర్థికస్థోమత లేని రైతుల దయనీయగాథలే నరసింహారావుగారి నాటకాలకు ఇతివృత్తాలు. ప్రపంచంవైపు సహాయంకోసం జాలిగా చూసే అమాయకరైతే వీరి నాటకాలకు కథానాయకుడు.

మనదేశంలో గ్రామీణ సమస్యల పట్ల, స్వాతంత్ర్యానంతరం కూడా కేంద్రంలోగానీ, రాష్ట్రంలోగానీ, చురుకైన కదలికరాలేదనీ, పరపీడనలో దారుణంగా బలైపోయిన గ్రామాలు స్వపాలనపై పెట్టుకున్న ఆశలేవీ తీరలేదనీ, తరతరాలుగా గ్రామసీమలు ఎదుర్కుంటున్న తీరనిసమస్యలెన్నో యథాతథంగానే ఉన్నాయని వ్యక్తపరుస్తూనే, తన నాటకాల్లో ప్రభుత్వంగ్రామీణప్రాంతాలకు ప్రత్యేకంగా కేటాయిస్తున్న సౌకర్యాలను, పంచవర్ష ప్రణాళికలద్వారా గ్రామాలకు కలుగచేస్తున్న అభివృద్ధి పథకాలను, అమాయకులైన గ్రామీణులకు తన నాటకరచనలద్వారా, ప్రదర్శనలద్వారా సవివరంగా తెలియచేసిన స్వచ్ఛమైన ఆశావాది నరసింహారావుగారు.

ప్రభుత్వ ప్రణాళికల పరమార్థాన్నీ, ప్రభుత్వం పల్లెసీమలకోసం చేస్తున్న కృషినీ, పల్లె ప్రజలకు సులువుగా అర్థమయ్యేలా, వారిభాషలోనే, మాండలిక యాసలోనే వారిలో ఒకరిగాతనూ అనుభవిస్తున్న ఎన్నో సమస్యలను తన ఒక్కొక్కనాటకంలో ఒక్కొక్క ప్రత్యేక గ్రామీణసమస్యగా ఎన్నుకుని, వాటి

కారణాలనూ, పరిష్కారమార్గాన్నీ సూచించగల రచయితవీరు. దేశం ప్రగతిని సాధించాలంటే ఎక్కడోదూరాన ఉన్నసమస్యలను చర్చించటం గాదు మనచుట్టు పక్కల గ్రామాల్లో ముళ్ళకంచెలలాగా ఉన్న సమస్యాకంటకాలను కొన్నింటిని తొలగించి గ్రామీణులను ప్రగతిమార్గాన నడిపించటమే వేంలని నరసింహారావుగారు విశ్వసించారు. అప్పుడే దేశం సుభిక్షమవుతుందని వీరి నమ్మకం.

గ్రామాల్లో ఉంటూ, అక్కడి తిండి తింటూ, గ్రామస్థులు ఏమీ తెలియని వారని నిరసించకుండా వారిని చైతన్యవంతులను చేయటంలో భాగంగానే గ్రామీణరైతుల్నే తననాటకాలకు నటులుగా ఎన్నుకున్నారు వారిలో నిద్రాణమైన కళలను వెలికి తీసేప్రయత్నంతోనే సంగీత, గీతాలకూ, పక్క వాద్యాలకూ (తన నాటకప్రదర్శనకు ఉపయోగపడే) తన గ్రామస్థుల్నే ఎన్నుకుని వారిలో స్ఫూర్తిని పెంచారు.

గ్రామీణులలో సృజనాత్మకతను వెలికి తీసి, వారిని ఉత్సాహ పరచటమే ధ్యేయంగా పెట్టుకున్న నాటకరచయిత నరసింహారావుగారు. ఆయనతన కార్యక్రమాలనూ, రచనలనూ ప్రదర్శనలనూ, ఎవరెన్ని విధాలుగా ప్రశంసించినా, విమర్శించినా కేవలం గ్రామీణులకోసమే తన శక్తియుక్తులన్నింటినీ ధారపోసి వారి చీకటి జీవితాలలో వెలుగునింపిన మానవతామూర్తి. ఏ కొంచెం పలుకుబడి ఉన్నా, ఎన్నో పదవులకోసం ఆరాట పడుతూ, డబ్బుసంపాదనే ధ్యేయంగా ఉన్ననేటి సమాజంలో ఎందరో రాజకీయనాయకులతోనూ, పరిచయాలున్నా కె. యల్. నరసింహారావు గారు ఏ పదవులకోసమూ ఆశపడక, నిస్వార్థంగా గ్రామసేవలకే అంకితమయ్యారు. తన రచనలద్వారా పేరుప్రతిష్ఠలుపొందాలనీ, డబ్బుసంపాదించాలనీ ఆయనెప్పుడూ ఆశపడలేదు. కేవలం గ్రామీణుల కోసమే తన జీవితాన్నంతా వెచ్చించారు.

రేపాల పరిసర ప్రాంతాలలో ఎవరికి ఏ అవసరం వచ్చినా, ఏ కష్టంవచ్చినా సాధ్యమైనంతగా అనునయ వాక్యాలతోనూ, శక్తివంచన లేకుండా సహాయం చేసే నిజమైన మానవతావాది. సంఘసంస్కర్తలయిన ఒక వీరేశలింగం పంతులు, ఒకరాజా రామ్మోహన్‌రాయ్, ఒకగిడుగు, ఒక గురజాడ ఏక్కడో లేరు, మన మధ్యే పుట్టారు. మనలోనే పెరిగారు. మనిషిలో స్వార్థంనశిస్తే నిస్వార్థమైన మానవ సేవకు పునాదులు పడతాయని వీరందరూ నిరూపించారు. వారి కోవలోనికే చెందిన శ్రీ.కె.యల్. నరసింహారావుగారు యాభైసంవత్సరాలుగా ఎన్నో

ప్రజోపయోగకరమైన కార్యక్రమాలను నిర్వహిస్తూ, గ్రామీణ ప్రజలకు ఎన్నో సహాయసహకారాలందించారు. తన నాటకాలలో స్వభావ వాదాన్ని పరిచయంచేసి, ఆ వాదాన్ని పరిపూర్ణంగా తనరచనలలో వ్యక్తీకరించిన శ్రీ నరసింహారావుగారు వాస్తవికతను ప్రతిబింబించే ఆధునిక నాటకరచయితగా సాహిత్యరంగంలోనూ, ఆకాశవాణి కార్యక్రమాలలోనూ చెరగని స్థానాన్ని సంపాదించుకున్నారనటానికి సందేహం లేదు.

# అనుబంధాలు

## రచయితతో ముఖాముఖి

ఈ పి.హెచ్.డి. సిద్ధాంత వ్యాసరచనకు తమ ముద్రిత అముద్రిత సాహిత్యాన్నిచ్చి, పరిశోధన సకాలంలో ముగించటానికి తగిన సహాయ సహకారాలను అందించి, ప్రోత్సహించిన గ్రంథకర్త శ్రీ నరసింహారావుగారు. వారి నాటక రచనాకాలానికీ సంబంధించిన ఎన్నో అనుభవాలనూ, తెలంగాణా లోని రాజకీయ సంఘటనలను, సామాజిక పరిస్థితులనూ గురించి వారితో జరిపిన ముఖాముఖీ కార్యక్రమంలో సవివరంగా తెలియజేశారు.

ప్రః- మీ స్వగ్రామంగురించీ, బాల్యంగురించీ వివరించండి?

జః- ప్రస్తుతం నల్గొండజిల్లా, మునగాల మండలంలోని 'రేపాల' మా స్వగ్రామం. గ్రామకరణీకమేగాక వ్యవసాయంకూడా మాకు జీవనాధారం. కీ.శే. శ్రీ. కోదాటి వెంకటనరసింహారావుగారు మా తండ్రిగారు. శ్రీమతి వెంకట రామనరసమ్మగారు మా మాతృదేవత. ౨౩.౧౦.౧౯౨౪న నేను జన్మించిన దినం. నిజాం రాష్ట్రం వ్యతిరేక ఉద్యమానికి నా చిన్ననాడు రేపాల కార్యస్థలంగా ఉండేది. మా దగ్గరిబంధువైన శ్రీ కోదాటి నారాయణరావుగారు స్వాతంత్ర్య సమర యోధులేగాక, మా ఊరే కేంద్రంగా నిజాం వ్యతిరేకోద్యమానికి నాయకులు, నాకు ఊహ తెలిసిన దగ్గరినుంచీ మా స్వగ్రామంలో రాజకీయపు సందడి అధికమే.

ప్రః- మీ విద్యాభ్యాసాన్ని గురించీ, ఆకాలంలోనే మీరు కమ్యూనిస్ట్ సాహిత్యాన్ని అభిమానించటానికి గల కారణాల గురించీ చెప్పండి?

జః- మా స్వగ్రామమైన రేపాలలో నా ప్రాథమిక పాఠశాల చదువు పూర్తయ్యాక, ఉర్దూ కూడా రావాలని మా నాన్నగారు సూర్యాపేటలోని మిడిల్ స్కూల్లో నన్ను చేర్పించారు. అందులో నాల్గవతరగతిలో మా నాన్నగారు మిడిల్ ప్యాసయ్యాక జగ్గయ్యపేట చేరి, ౧౯౪౩-౪౪లో అక్కడి హైస్కూల్లో చదువుపూర్తి చేసాను. ఈ నాడు నేను నాటకరచయితగా, నటుడిగా నలుగురికీ పరిచయం కావటానికి గట్టిపునాదులు సూర్యాపేటలోనే పడ్డాయి. ఈ వూరి నుంచి ఉద్భవించిన కళాకారుల్లో నేనొకడిని.

ప్రజోపయోగకరమైన కార్యక్రమాలను నిర్వహిస్తూ, గ్రామీణ ప్రజలకు ఎన్నో సహాయసహకారాలందించారు. తన నాటకాలలో స్వభావవాదాన్ని పరిచయంచేసి, ఆ వాదాన్ని పరిపూర్ణంగా తనరచనలలో వ్యక్తీకరించిన శ్రీ నరసింహారావుగారు వాస్తవికతను ప్రతిబింబించే ఆధునిక నాటకరచయితగా సాహిత్యరంగంలోనూ, ఆకాశవాణి కార్యక్రమాలలోనూ చెరగని స్థానాన్ని సంపాదించుకున్నారనటానికి సందేహం లేదు.

# అనుబంధాలు

## రచయితతో ముఖాముఖి

ఈ పి.హెచ్.డి. సిద్ధాంత వ్యాసరచనకు తమ ముద్రిత అముద్రిత సాహిత్యాన్నిచ్చి, పరిశోధన సకాలంలో ముగించటానికి తగిన సహాయం సహకారాలను అందించి, ప్రోత్సహించిన గ్రంథకర్త శ్రీ నరసింహారావుగారు వారి నాటక రచనాకాలానికీ సంబంధించిన ఎన్నో అనుభవాలనూ, తెలంగాణా లోని రాజకీయ సంఘటనలను, సామాజిక పరిస్థితులనూ గురించి వారితో జరిపిన ముఖాముఖీ కార్యక్రమంలో సవివరంగా తెలియజేశారు.

ప్రః- మీ స్వగ్రామంగురించీ, బాల్యంగురించీ వివరించండి?

జః- ప్రస్తుతం నల్గొండజిల్లా, మునగాల మండలంలోని 'రేపాల' మా స్వగ్రామం. గ్రామకరణీకమేగాక వ్యవసాయంకూడా మాకు జీవనాధారం. కీ.శే. శ్రీ. కోదాటి వెంకటనరసింహారావుగారు మా తండ్రిగారు. శ్రీమతి వెంకట రామనరసమ్మగారు మా మాతృదేవత. ౨౩.౧౦.౧౯౨౪న నేను జన్మించిన దినం. నిజాం రాష్ట్రం వ్యతిరేక ఉద్యమానికి నా చిన్ననాడు రేపాల కార్యస్థలంగా ఉండేది. మా దగ్గరిబంధువైన శ్రీ కోదాటి నారాయణరావుగారు స్వాతంత్ర్య సమర యోధులేగాక, మా ఊరే కేంద్రంగా నిజాం వ్యతిరేకోద్యమానికి నాయకులు, నాకు ఊహ తెలిసిన దగ్గరినుంచీ మా స్వగ్రామంలో రాజకీయపు సందడి అధికమే.

ప్రః- మీ విద్యాభ్యాసాన్ని గురించీ, ఆకాలంలోనే మీరు కమ్యూనిస్ట్ సాహిత్యాన్ని అభిమానించటానికి గల కారణాల గురించీ చెప్పండి?

జః- మా స్వగ్రామమైన రేపాలలో నా ప్రాథమిక పాఠశాల చదువు పూర్తయ్యాక, ఉర్దూ కూడా రావాలని మా నాన్నగారు సూర్యాపేటలోని మిడిల్ స్కూల్లో నన్ను చేర్పించారు. అందులో నాల్గవతరగతిలో మా నాన్నగారు మిడిల్ ప్యాసయ్యాక జగ్గయ్యపేట చేరి, ౧౯౪౩-౪౪లో అక్కడి హైస్కూల్లో చదువుపూర్తి చేసాను. ఈ నాడు నేను నాటకరచయితగా, నటుడిగా నలుగురికీ పరిచయం కావటానికి గట్టిపునాదులు సూర్యాపేటలోనే పడ్డాయి. ఈ వూరి నుంచి ఉద్భవించిన కళాకారుల్లో నేనొకడిని.

జగ్గయ్యపేటలో నేను చదువుతున్నప్పుడు ఆ స్కూల్లో కొందరు కమ్యూనిస్ట్ టీచర్లుండేవారు. వారిప్రోత్సహంతో నేనా సాహిత్యాన్ని ఎడతెగకుండా చదివేవాడిని. ప్రజల్లోకి సాహిత్యాన్ని తీసుకెళ్ళటం, రచనలద్వారా ప్రజలను చైతన్య పరచటం. ఆర్థిక అసమానతలు లేని సమసమాజాన్ని నెలకొల్పి, దోపిడీ వ్యవస్థను రూపుమాపటం, నిరాడంబరంగా, నిజాయితీగా జీవించటం. సామాన్యప్రజల్లో ఉంటూ, వారి ఆశయాలనూ, ఆకాంక్షలనూ గమనిస్తూ, అవి నెరవేర్చటానికి ప్రయత్నించటం. ఇవీ ఆ సాహిత్యం ద్వారా నేను అర్థం చేసుకున్న సూత్రాలు. అవి నాకెంతగా నచ్చాయో చెప్పలేను. ఐతే ఇంత చక్కటి సూత్రాన్ని అందించిన ఆ టీచర్లు కొన్ని నిబంధనలూ విధించారు. ఆ నిబంధనలను అనుసరించి వేరే సాహిత్యాన్నేమీ చదవకూడదు. వారి దృష్టిలో ఇతరసాహిత్యమంతా చెత్త, నిషిద్ధం. మన ప్రాచీన సాహిత్యం, రామాయణం, భారతం, ప్రబంధాలేగాక, ఆనాడు వెలువడే ఇతరపత్రికలు కూడా చదవకూడదు. మరినా ప్రవృత్తి ఏమిటోగానీ, కమ్యూనిస్ట్ రచనలుగానీ, ఇతరసాహిత్యంగానీ నాకుమహానచ్చేవి. వారువద్దన్నా, ఆనాటి ఇతర ఆధునిక పత్రికలు మటుకు చాటుగా చదివేవాడిని. ఈ విధంగా ఆనాటికే నా మనస్సులో విభిన్నదృక్పథాల భావబీజాలు పడ్డాయనిపిస్తుంది. ఈ నాడు కాస్తలోతుగా ఆలోచిస్తే, రానురాను జీవితానుభవంలో నా రచనల్లోనూ ఆ భావాలు ప్రస్ఫుట మవుతూ వచ్చాయనుకుంటున్నానుఅందుకే నేను రేపాలలో నిర్వహించిన లైబ్రలీకి ఎనభైదాకా అన్ని రకాల పత్రికలనూ తెప్పించేవాణ్ణి.

ప్ర:- ముద్రిత, అముద్రితాలతో కలిపి నూటయాభైకిపైగా వెలువడ్డ మీ నాటకరచనలలో మొట్టమొదటినాటకం గూర్చి చెప్పండి?

జ. నా రచనల ప్రారంభంనుండీ చెప్పాలంటే దాదాపు యాభై సంవత్సరాల వెనక్కువెళ్ళి, ఆలోచించాలి. కానీ బొత్తిగా డైరీలు నిర్వహించే అలవాటు లేకపోవటం మూలాన తేదీలు, సంఘటనలూ చప్పను గుర్తుకు రావు. అయినా ప్రయత్నించి చెప్తాను. 1947 - ఆగస్టు 15-1948 సెప్టెంబర్ మధ్యకాలం అప్పటికి కాంగ్రెస్ వారూ, కమ్యూనిస్ట్ వారూ నిజాంకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్నారు. ఐతే కమ్యూనిస్టుల పోరాటం తెలంగాణా సాయుధ పోరాటంగా మారి నిజాంకు వ్యతిరేకంగా కాక, తమకు ఇష్టంలేని వారందరినీ చంపే వికృత పోరాటంగా పరిణమించింది. అలా చంపబడిన వారంతా భూస్వాములనీ, బూర్జువాలనీ, అభివృద్ధి నిరోధకులనీ, వర్గశత్రువలనీ ఏదో ఒక ముద్ర వేసేవారు.

అలా హత్యకు గురయిన వారిలో శ్రీయుతులు ఆరె. సత్యనారాయణ, కొల్లు రఘుసత్యనారాయణలున్నారు. 8-5-48 తేదినాడు వీరిద్దరూ, మా ఊరునించి, జగన్నాథపురం వెళుతుండగా కిడ్నాప్ చేసి చంపేశారు. నాకు తెలిసినంత వరకు వారిద్దరూ ఎంతమాత్రం దుర్మార్గులు కాకపోగా, చాలా మంచివారు, సౌమ్యులు. ఇలా అమాయకులైన వారినీ, అబలలనూ, వయోవృద్ధులనూ తెలంగాణా పోరాటం పేరుతో చంపేవారు.

సరిగ్గా ఈ స్థితిలోనే నేను నేరుగా చదువుతున్న కమూనిస్ట్ సాహిత్యానికి, చాటుగా చదివే ఇతరసాహిత్యానికీ మధ్య తీవ్రమైన ఘర్షణ ప్రారంభమైంది. నేను చదివిన కమ్యూనిస్ట్ సాహిత్యాన్ననుసరించి, తనపనితో, ప్రవర్తనతో,తర్కబద్ధమైన హేతుబలంతో మాత్రమే జనాన్ని చైతన్య పరచగలవాడు. అలాంటి మనీషి ఎవర్నీ తమస్వార్థం కోసం హత్య చేయడు. కానీ అదే పేరుతో రోజురోజుకూ ఘోరాలు ఎన్నో జరిగిపోతున్నాయి. చివరికి నా అంతరాత్మే నెగ్గింది. ఆ ఫలితమే గెలుపునీదే నాటకరచన. 1948లో మొదటినాటక రచనా ప్రదర్శనా తర్వాత విజయవంతమైన నాటకం కూడా ఇదే. ఆ నాటకంలో సాయుధ పోరాటం పేరుతో జరుగుతున్న మారణహోమాన్ని తీవ్రంగా దుయ్యబట్టాను. నా తీవ్రమైన ఆవేదనే కేవలం ఒకటి రెండు రోజుల్లో నాటకరూపంగా వెలువడింది.

ప్ర:- మీరు మీ గ్రామంలో నెలకొల్పిన నాటకసంస్థ నిర్వహించే కార్యకలాపాలేమిటి? దానికి ప్రజల ప్రోత్సాహమెలా ఉంది?

జ. 1948లో జనవరి ఒకటవ తేదీన ఒక నాట్యమండలిని నెలకొల్పాను. దానిపేరు 'గ్రామవెలుగు నాట్యమండలి,' గ్రామ' అనే పదం సంస్కృతమనీ, వెలుగు తెలుగుపదమనీ ఆ విధంగా సమాసం కుదరదనీ ఎవరో చెప్పారుగానీ, గ్రామాలకు వెలుగు నివ్వాలనే కమూనిస్ట్ భావాల ఉత్తేజంతో నేను ఆ పేరే పెట్టాను గ్రామవెలుగు నాట్యమండలి ద్వారా, పల్లెప్రజల కోసమే నాటకాలు రాయాలనీ, వారి చేతే ప్రదర్శన లిప్పించాలనీ, వారి చీకటిబ్రతుకల్లో వెలుగునింపాలనీ నా శాయశక్తులా ప్రయత్నించాలని నాధ్యేయాభిప్రాయం. అందుకోసమే ఎన్నో నాటకాలు వారి భాషలోనే, వారి యాసలోనే రచించి, మా నాట్యమండలితో ప్రదర్శింప చేశాను. నా నాటకాలలోని పాత్రలు మా పరిసరగ్రామీణులకు సుపరిచితాలు. వారికి ఆత్మీయులుకూడా. అందుకే నాటకాలన్నీ పదేపదే ఎన్నో ప్రదర్శనలుపొంది విజయవంతమయ్యేవి.

గెలుపునీదే తరువాత పోలీస్ చర్య అనంతరం సుడిగుండాలు

వ్రాశాను. గాంధీజీ హత్యను నిరసిస్తూ, ఆదర్శలోకాలు వ్రాశాను. గెలుపునీదే నాటకాన్ని ప్రచురించిన మిత్రులు మాణిక్యరెడ్డి కోరగా , 'ఒకరోజు' వ్రాశానం – ఈ నాటికకు డా. సి. నారాయణరెడ్డి గారు మొదటిసారిగా పాటలు రచించారు. ఇంకా ప్రణాళికలూ, సంక్షేమ కార్యక్రమాలూ ఇతివృత్తంగా అడుగుజాడలు. కొత్తగుడి, తోడునీడ, కల్పతరువు, కొడిగట్టిన దీపాలు. అందరం సుఖపడదాం రచించానం. అడుగుజాడలు ఆనాడు రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించిన ప్రణాళికేతివృత్తంగల రచనలలో ప్రథమ బహుమతి పొందింది. గ్రామీణులకు హాస్యనాటకాలను పరిచయం చేయటంకోసం అపరాధపరిశోధకులు, రేపటికి వాయిదా రచించాను. ఇలా ఎన్నో నాటకాలు యభైసంవత్సరాలుగా వ్రాస్తూనే ఉన్నా. ప్రదర్శన లిప్పిస్తేనే ఉన్నాను.

ప్ర:- కమ్యూనిజంలోని తీవ్రవాద శక్తిగా ఉద్భవించిన నక్సలిజానికి వ్యతిరేకంగా మీ నాటకసాహిత్యం ఎంతవరకు ఫలించింది?

జ. గ్రామీణప్రాంతాల్లో ముఖ్యంగా తెలంగాణాలో సాగుతున్న విధ్వంస కాండలను, తీవ్రవాదాన్ని నిరసిస్తూ నిజమైన ప్రజాస్వామ్యాన్ని తెలియచేయటం కోసం రచించిన భారతి, ప్రజాదేవత, తుపాకీరాజ్యం మొదలైనవి వేయిసార్లకు పైగా ప్రదర్శించబడ్డాయి. ఇంకా ప్రదర్శింపబడుతూనే ఉన్నాయి. 'భారతి' టీ.వి.లో కూడా ప్రసారమైంది. వర్గశత్రువులుగా పరిగణిస్తూ, తమకు వ్యతిరేకు ల్నందరినీ చంపుతుంటే నాహృదయం తపించిపోయేది. పోరాటంలో చనిపోయిన వారు వృత వీరులయినప్పుడు, వారిచే అమాయకులు హత్యకావింపబడితే, ఆ అమాయకులు అల్పప్రాణులయినా కారా? అని వ్యధ చెందేవాడిని. ఆ వ్యధాపూరిత మస్తిష్కంలో నుండి వెలువడే ఆ నాటకాలు ప్రజలకు దగ్గరయినాయి.

ప్ర:- నాటకాలు కాకుండా మీ ఇతర రచనల గురించి తెల్పండి?

జ. తెలంగాణా పరిస్థితులను వివరిస్తూ 'తెలుగు స్వతంత్ర' లో 'తెలంగాణా తీరుతెన్నులు' పేరుతో చాలాకాలం లేఖలు వ్రాశాను. కోలన్ పేరుతో సినిమావ్యాసాలు వ్రాశాను. ఆంధ్ర మహిళాసభవారు నిర్వహించిన రైటర్స్ వర్క్‌షాప్‌లో నాన్నకు జాబులు వ్రాసాను. ఆలిండియా రేడియోకోసం ఎన్నో శీర్షికలు చాలాసంవత్సరాలు నిర్వహించాను. రేడియోప్రసారిత రూపకాల్లో వెంగళప్ప కబుర్లు, ముచ్చట్లు, వయోజన విద్య, ప్రాథమిక విద్యా కార్యక్రమాలు, అందరికీ చదువు మొదలైనవి ప్రధానమైనవి.

ప్ర:- మీరు నిర్వహించిన ఇతర కార్యక్రమాలగురించి కూడా చెప్పండి?

జ. నా కార్యక్రమాలన్నీ గ్రామీణులకోసమే మా నాట్యమండలి ద్వారా, ఎన్నో ప్రదర్శన లిప్పించాను. రేపాలలో జరిగే శ్రీ లక్ష్మినరసింహస్వామివారి ఉత్సవాలకు జోడిస్తూ, ''వైజ్ఞానిక మహాసభలు'' పేరుతో ఎన్నోసభలు, ప్రదర్శనలు నిర్వహించి, ఎందరో ప్రముఖులను ఆహ్వానించి ఉపన్యాసాలిప్పించేవాడిని. వీలైనంతగా గ్రామీణప్రజలను చైతన్యవంతులను చేయుటమే నా లక్ష్యం

ప్ర:- భవిష్యత్తులో మీ కార్యక్రమాలేమిటండీ?

జ. నా జీవితాశయం ఒకటే - సమాజంలోని వ్యక్తి ఏ పని చేసినా పక్కవాడికి సహాయపడేవిధంగా ఉండాలి. అప్పడే దేశం పురోభివృద్ధి చెందుతుంది. ముఖ్యంగా గ్రామీణులలో స్ఫూర్తిని పెంచటానికి ప్రతిపౌరుడూ కృషిచేయాలని నా ఆకాంక్ష! ధృఢాభిప్రాయంకూడా.

## రచయిత గ్రంథసూచి


1. అక్బర్

జనపదప్రచురణలు, చిక్కడపల్లి, హైద్రాబాద్. 1973.

2. అగ్నిపరీక్ష

జనపద ప్రచురణలు, చిక్కడపల్లి, హైద్రాబాద్. 1973

3. అడుగుజాడలు

ఆంధ్రబుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైద్రాబాద్. 1956

4. అపరాధప పరిశోధకులు

శివాజీప్రెస్, సికింద్రాబాద్, 1969

5. అభాగ్యులు.

దేశోద్ధారక గ్రంథమాల, ఇమాంబావివీథి, సికింద్రాబాద్, 1958

6. ఆదర్శలోకాలు

కళావాణి ప్రచురణలు, రేపాల, నల్గొండజిల్లా, 1948

7. ఉంగారాల వ్రేళ్ళు

దేశోద్ధారక గ్రంథమాల, ఇమాంబావి వీథి, సికింద్రాబాద్. 1958

8. ఒక రోజు

సంగీతసమితి, రెడ్డి హాస్టల్, హైద్రాబాద్, 1951.

10. కల్పతరువు

జనపద ప్రచురణలు, హైద్రాబాద్, 1973.

11. కొడిగట్టిన దీపాలు

జనపద ప్రచురణలు, హైద్రాబాద్, 1973.

12. కొత్తగుడి

జనపద ప్రచురణలు, హైద్రాబాద్, 1973.

13. క్రీనీడలు

ఆంధ్రబుక్ హౌజ్, సుల్తాన్‌బజార్, హైద్రాబాద్, 1979

సంగీతసమితి, హైద్రాబాద్, 1952

[illegible]

జనపద ప్రచురణలు, హైద్రాబాద్, 1973.

16. తోడునీడ
జనపద ప్రచురణలు హైద్రాబాద్, 1973

17. పుట్టినరోజు పండుగ
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, 1979

18. ప్రజాదేవత
ఆంధ్రబుక్ హౌజ్, సుల్తాన్‌బజార్, హైద్రాబాద్, 1964

19. ప్రజారథం
వెంకట్రామా ప్రైవేట్ లిమిటెడ్, హైద్రాబాద్, 1974.

## ఉపయుక్త గ్రంథసూచి

1. ఆధునిక తెలుగునాటకం రెండుభాగములు.
గండవరం సుబ్బరామిరెడ్డి, ప్రవీణ్ పబ్లికేషన్స్
హైద్రాబాద్ – 1989.

2. ఆంధ్రనాటక పితామహుడు
దివాకర్ల వెంకటావధాని
రైటర్స్ ఆన్విల్ వారి ప్రచురణ. హైద్రాబాద్, 1972

3. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి
ఖండవల్లి లక్ష్మీరంజనం
బాలసరస్వతీ బుక్ డిపో హైద్రాబాద్, 1992

4. ఆంధ్రవాఙ్మయ చరిత్ర
దివాకర్ల 'వెంకటావధాని
ఆంధ్రసారస్వత పరిషత్తు, హైద్రాబాద్, 1975

5. ఆంధ్రప్రదేశ్‌లో రైతు ఉద్యమాలు, పోరాటాలు
వై.వి. కృష్ణారావు
ఎవాన్ ప్రింటింగ్ వర్క్స్, హైద్రాబాద్, 1986.

6. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయము.
ప్రయోగములు
తెలుగు అకాడమీ, హైద్రాబాద్, 1967

ఆంధ్రులజానపద విజ్ఞానం
ఆర్వీయస్ సుందరం
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్,
హైదాబాద్, 1983

౮. ఆధునికాంధ్రకవిత్వం భావకవిత్వయుగంవరకు
డా. సి. నారాయణరెడ్డి
ప్రపంచ తెలుగు మహాసభ, ప్రచురణ ౧౯౭౫

౯. ఇంటావిడతో పోట్లాటలు
మునిమాణిక్యం నరసింహారావు
వెంకట్రామ అండ్ కో, విజయవాడ – ౧౯౬౨

౧౦. కదంబం
నార్లవెంకటేశ్వరరావు, నవోదయా పబ్లికేషన్స్ – ౧౯౭౬

౧౧. ''కోవెల'' ప్రత్యేకసంచిక
రేపాల, మునగాలమండలం, నల్గొండజిల్లా, ౧౯౯౨

౧౨. చరిత్ర చెప్పిన పాఠాలు
ఆచార్యమామిడిపూడి వెంకటరంగయ్య
తెలుగువిద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం – ౧౯౮౫

౧౩. చేరాతలు
చేకూరి రామారావు
చరిత ప్రచురణలు – ౧౯౯౧

౧౪. చేతవెన్నముద్ద
వాకాటిపాండురంగారావు
శ్రీమతి వాకాటిపాండురంగారావు. ఐ.౨, పోర్ట్లయా,
విశాఖపట్నం – ౧౯౮౨

౧౫. తెలుగునాటక వికాసము
డా. పి.యస్సార్ అప్పారావు
నాట్యమాలా ప్రచురణ – ౧౯౬౭

౧౬. తెలంగాణా రైతాంగ పోరాటం
సాహితీసర్కిల్, హైద్రాబాద్ – ౧౯౮౬

౧౭. తిరుపతి కవుల సాహిత్య సమీక్ష
శిష్టాలక్ష్మీకాంత శాస్త్రి
శ్రీ అరుణాబుక్ హౌజ్, నారాయణ మొదలివీధి,
మద్రాస్ – ౧౯౮౦

౧౮. తెలుగులో సాహిత్యవిమర్శ
పాడిబండ మాధవరాయశర్మ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైద్రాబాద్ – ౧౯౭౫

౧౯. తెలుగు భాషా చరిత్ర
టి. భాస్కర రావు. (స్ఫూర్తిశ్రీ)
౨౦. తేనెసోనలు తెలుగుభాష
చల్లారాధాకృష్ణశర్మ
ది క్రిస్టియన్ అఫ్ లిటరేచర్ సొసైటీ హైద్రాబాద్ - ౧౯౭౧
౨౧. తెలుగు వీణ
సంపాదకులు, రావూరు వెంకట సత్యనారాయణరావు
భాషాకుటీరం, హైద్రాబాద్ - ౧౯౭౬
౨౨. పరిశీలన
ఆచార్యనాయని కృష్ణకుమారి
జయశ్రీప్రింటింగ్స్, హైద్రాబాద్ - ౧౯౭౭
౨౩. పానుగంటివారి సాహిత్యసృష్టి
ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాద్ - ౧౯౭౫
౨౪. బాలసాహితీ వికాసం
వెలగా వెంకటప్పయ్య
సిద్ధార్థ పబ్లికేషన్స్ విజయవాడ - ౧౯౮౨
౨౫. తెలుగు భాషాచరిత్ర
భద్రిరాజు కృష్ణమూర్తి
తెలుగుసాహిత్య అకాడమీ - ౧౯౭౯
౨౬. మన హాస్యము
మునిమాణిక్యం నరసింహారావు - ౧౯౬౮
౨౭. మహతి
యువభారతీ ప్రచురణ, హైద్రాబాద్ - ౧౯౭౩
౨౮. మనదేశంలో పునర్వికాసం ఉందా?
ఇన్నయ్య
నవభారత్ బుక్ హౌజ్, విజయవాడ - ౧౯౯౦
౨౯. మనసు - మర్మం
అన్నపురెడ్డి వెంకటేశ్వర రెడ్డి
పల్లవి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ -
౧౯౯౩

౩౦. మొక్కపాటి నరసింహారావు కృతులు, సమీక్ష
నలకుర్తి రాంబాబు
రేఖాప్రచురణలు, నరసరావుపేట - ౧౯౮౯

౩౧ రచయితా శిల్పము
తుమ్మల వెంకటరామయ్య
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌ., హైద్రాబాద్ - ౧౯౮౯

౩౨ రైతాంగసమస్యలు
కిసాన్‌శ్రీ నవన
కిసాన్ పబ్లికేషన్స్, బుర్రిపాలెం, తెనాలి - ౧౯౭౮

౩౩ వాల్మీకి రామాయణము
వావిళ్లవారి ముద్రణ, మద్రాసు- ౧౯౩౫

౩౪ వీరేశలింగంపంతులు - సమగ్ర పరిశీలన
అక్కిరాజు రామాపతిరావు
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
హైద్రాబాద్ - ౧౯౭౨

౩౫. వెలుగు - వెన్నెల
కోడూరి శ్రీరామమూర్తి
తెలుగు విద్యార్థి ప్రచురణ, మచిలీపట్నం - ౧౯౮౬

౩౬.
కె.వి. ఆర్. నరసింహం
తెలుగు అకాడమీ హైద్రాబాద్ - ౧౯౮౭

౩౭. సాహిత్య శిల్పసమీక్ష
పింగళి లక్ష్మీకాంతం
మాధవీబుక్ సెంటర్ - ౧౯౭౦

౩౮. సారస్వత సౌరభం
జి.వి. సుబ్రహ్మణ్యం
ఆంధ్రసారస్వత పరిషత్తు - ౧౯౭౦

౩౯. సాహిత్య సోపానములు
దివాకర్ల వెంకటావధాని
ఆంధ్ర సారస్వతపరిషత్తు - ౧౯౭౫

40. సాహితీవ్యాసాలు
బూదరాజు రాధాః
విశాలాంధ్రబుక్ హౌజ్ - ౧౯౯౦

41 సాహిత్య భాషగా తెలుగు
ఖండవల్లి లక్ష్మీరంజనం
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైద్రాబాద్ - ౧౯౭౫

42. సమవీక్షణం
ఎస్వీ. రామారావు
పసిడి ప్రచురణలు, హైద్రాబాద్ - ౧౯౯౨

43. స్వప్నవాసవదత్తము
జి.వి. అండ్, కో ప్రెస్, త్యాగరాజనగర్,
రాజమండ్రి - ౧౯౭౦

44. The South Indian stage & other Lectures.
Ballari Raghava Publications - 1976

45.· The comedies of American life
Introduction by Josephe E. Mersand

47. The Theatre of Dinyses in Athens. A. W.
Pickard,Cambridge

48. History of the Theatre
Oscar, G. Brockette

49. The Buddha and his Drama
Dr. B.R.Ambedkar - 1980

50. Play directing - Analysis Cummunication & Style.
Francis Hodge.